ISSN- 2582-7294
సంపుటి 14 - సంచిక 9 - హైదరాబాద్
పేజీలు 68- వెల రూ. 30




# పాలపిట్ట

మాసపత్రిక | అక్టోబర్ 2023



స్త్రీల అంతరంగ గవేషణం

తటవర్తి నాగేశ్వరి కథ సంకల్పం



## అనన్య సామాన్యుడు అశ్వినీ కుమార్

ISSN 2582-7294

# విషయసూచిక




సుజాతారెడ్డి కథలలో తెలంగాణ భాషా సౌందర్యం...............48

తెలంగాణ జీవితాన్ని అచ్చమైన తెలంగాణ భాషలో ముదిగంటి సుజాతారెడ్డి రికార్డు చేశారంటు న్నారు **ఆముదాల నరేందర్** ఈ వ్యాసంలో. పాత్రోచిత భాషని సరిగ్గా ఉపయోగించారు. కథా కథనంలోనూ తెలంగాణ నుడికారాన్ని వాడటం ఈ కథల విశిష్టత. తెలంగాణ భాషలోని సొగసు దనం తెలుస్తుంది ఈ కథలు చదివితే.

## కథ



## సీరియల్స్



## వ్యాసాలు



## పజిల్



## కవితలు





# అనన్య సామాన్యుడు అశ్వినీకుమార్



అనేక సృజనకోణాలతో విరాజిల్లే మూర్తిమత్వం వల్లభనేని అశ్వినీ కుమార్‌ది. తెలుగు సాహిత్య ప్రపంచానికి 'మిసిమి' సంపాదకుని గా సుపరిచితులయిన ఆయనలో నిరంతరం సృజనశీలత్వంతో చరించే కవి, కథకుడు, అనువాదకుడు, యాత్రికుడు, ఎడతెగని చదువరి ఉన్నారు. వీటన్నిటితో సమ్మిళితమైన తనదైన తాత్విక దృక్పథం వుంది. అది ఒక సాహిత్య సంపాదకునిగా 'మిసిమి' నిర్వహణలో వ్యక్తమవుతోంది. బహుళత్వం అశ్వినీకుమార్ జీవితంలోనూ, రచనా వ్యాసంగంలో ప్రతిఫలిస్తోంది. ఒక్కమాటలో చెప్పాలంటే సాధారణంగా కనిపించే అనన్య సామాన్యుడు అశ్వినీకుమార్. వారిలోని అసాధారణత్వం, వైశిష్ట్యం సుదీర్ఘమైన సంభాషణ ద్వారా తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నారు ప్రముఖ రచయిత **సి.ఎస్. రాంబాబు.** అశ్వినీకుమార్‌లోని అనేకతని తెలియజెప్పే వ్యాసాలు, అభిప్రాయాలు ఈ సంచిక ప్రత్యేకం.

పేజీ 14 నుంచి 47 వరకు...



**‘నా అభివ్యక్తికి మాధ్యమాలు అనేకం’**

# అనన్య సామాన్యుడు

## అశ్వినీకుమార్‌తో సి.ఎస్. రాంబాబు సంభాషణ

“నన్ను నేను వ్యక్తీకరించుకోవాలంటే అనేక మాధ్యమాలు ఉపయోగపడతాయి. నా అనుభవాలు చెప్పాలంటే కథలను ఎంచుకుంటాను. నా ఆవేదన చెప్పాలంటే కవిత్వం ఉపయోగపడుతుంది. నా జీవితాన్ని ఇంకోళ్ల ద్వారా చెప్పాలంటే అనువాదాలు ఉపయోగపడతాయి. ఇట్లా అనేక మాధ్యమాల ద్వారా నన్ను నేను వ్యక్తీకరించుకుంటాను” అంటున్నారు ప్రముఖ రచయిత, అనువాదకులు, కవి, ఎడిటర్ వల్లభనేని అశ్వినీకుమార్. సాహిత్య పాఠకులకు ‘మిసిమి’ సంపాదకులుగా సుపరిచితులైన అశ్వినీకుమార్‌ను ‘పాలపిట్ట’ పాఠకుల కోసం ప్రముఖ రచయిత సి.ఎస్.రాంబాబు ఇంటర్వ్యూ చేశారు. దాదాపు పుష్కరకాలం మిసిమి ఎడిటర్‌గా తెలుగు సాహిత్య ప్రపంచానికి దగ్గరయిన అశ్వినీకుమార్ ఆధ్వర్యంలో ఇప్పటివరకు 144 సంచికలు వచ్చాయి. ప్రతి సంచికను వైవిధ్యమైన రీతిన మలచిన వారిలో కేవలం సంపాదకుడు మాత్రమే కాదు లోకం చుట్టిన రచయిత ఉన్నారు. సాహిత్యాన్ని మథించిన పాఠకుడున్నారు. గొప్ప సాహిత్యాన్ని తెలుగు వారికి అందించిన అనువాదకుడున్నారు. స్వయంగా తనదైన విలక్షణ స్వరంతో కవిత్వాన్ని, కథలను సృజించిన రచయిత ఉన్నారు. దేశదేశాల పర్యాటక అనుభవాల్ని అక్షరీకరించిన యాత్రారచయిత ఇమిడి ఉన్నారు. అశ్వినీకుమార్ అనేక దేశాల్లో పర్యటించారు. అడవుల్లో, సముద్రాల్లో, ఎడారుల్లో ప్రయాణించారు. తత్వవేత్తలను, సినిమా ప్రముఖులను, క్రీడాకారులను ఎందరినో కలిశారు. రాజకీయాల్లో పండిపోయిన నేతలతో సంభాషించారు. ఉద్యోగమంటూ చేయకుండా పలు వృత్తి వ్యాపకాలతో తన కాలాన్ని సృజనాత్మకంగా మలుచుకున్న అశ్వినీకుమార్ జీవితగమనం సాహిత్యంతో పెనవేసుకొని పోయింది. కనుకనే ఎక్కడున్నా, ఏం చేస్తున్నా ఆయన గమనాగమనంలో సాహిత్యం అంతర్నిహితంగా వుండి వారిని నడిపించింది. భిన్నమైన ప్రక్రియల్లో తనని తాను వ్యక్తం చేసుకోవడం ద్వారా కవిత్వం, కథలు, యాత్రాకథనాలు రచించారు. పరమ ఇష్టంగా బైరన్‌ను, షెల్లీని, చార్లీచాప్లిన్‌ను అనువదించి తెలుగువారికి సులువుగా బోధపడేలా అందించారు. హెర్మన్ హెస్ ‘సిద్ధార్థ’ను, రాజారావు ‘రజ్జు సర్ప భ్రాంతి’ అశ్వినీకుమార్ అనువాదంలోని అందానికి నిదర్శనంగా నిలిచిపోయాయి. లోకానికి తెలిసినట్టే వుండి తెలియని సృజనకోణాలు ఎన్నో వారిలో దాగివున్నాయి. వాటిని ప్రపంచానికి పరిచయం చేయాలనే సంకల్పంతో అశ్వినీకుమార్‌తో రాంబాబు జరిపిన సుదీర్ఘ సంభాషణ ‘పాలపిట్ట’ పాఠకుల కోసం అందిస్తున్నాం. దీనితోపాటు వారి సాహిత్యం, వ్యక్తిత్వం మీద పలువురు రాసిన వ్యాసాలు, సమీక్షలు, అభిప్రాయాలు ఇక్కడ చదవండి...

***అశ్వినీకుమార్ గారూ నమస్కారమండీ... మీది ఒక వైవిధ్యమయిన ప్రయాణం. కేవలం రచయితగానే కాకుండా మీరు ట్రావెల్ ఏజెన్సీ నడిపించారు. సినిమారంగంలో వ్యాపారం చేశారు. వైజాగ్‌లో సముద్రం చూడడటం కోసమే రెండేళ్లు గడిపారు. వివిధ దేశాలు పర్యటించారు సరే కథలు, కవిత్వం, అనువాదాలు, యాత్రా రచనలు ఇవన్నీ ఉండగా మిసిమి పత్రికకు పుష్కర కాలం నుంచి సంపాదకులుగా ఉన్నారు. ఉన్న ఒక జీవితంలో ఎన్ని పనులు చేయాలో అన్నీ చేశారు.***

నమస్కారమండీ... మీరు మధ్యలో నుంచి మొదలుపెట్టారు (నవ్వు). అయిన సరే చెబుతాను. ఇన్ని పనులు నేను చేయటానికి, ఇన్ని అవకాశాలు నాకు రావటానికి ఒక బలమైన కారణం ఉంది. అదేమిటంటే నేను డిగ్రీ చదివేటప్పుడు సైన్సు క్లాసు జరుగుతోంది. లెక్చరర్ పాఠం చెబుతున్నాడు. నేను లాస్ట్ బెంచ్‌లో కూర్చున్నాను. నాకు ఆ పాఠాలు వినబుద్ధి అయ్యేది కాదు. అయినా పరీక్షలు రాయాలి కదా. అంతవరకు వినేవాడిని. నా పక్కనే ఓ కిటికీ ఉండేది. ఆ కిటికీలోంచి బయటకు చూస్తున్నాను. దూరంగా వేపచెట్టు హాయిగా గాలికి తలూపుతున్న దృశ్యం. ఆ చెట్టుకింద నన్ను నేను ఊహించుకున్నాను. జీవితం అలా హాయిగా ప్రకృతిలో గడవకూడదా అని నాకనిపించింది. ఒక బొమ్మ (లైన్ డ్రాయింగ్) కూడా గీసుకున్నాను. అప్పుడు నాకు నేను ఒక ప్రశ్న వేసుకున్నాను. ఈ చదువు ఉద్యోగం కోసమే కదా! ఉద్యోగం అక్కరలేదు అనుకుంటే ఈ చదువు అక్కర్లేదు కదా! ఉద్యోగం ఎందుకు చేయాలి, పొట్టకూటి కోసమే కదా! పొట్టకూటి కోసం ఉద్యోగం చేయనని నాకు నేను ప్రామిస్ చేసుకున్నాను. అయితే డిగ్రీ పూర్తి చేయడం నాకు కష్టం కాదు. డిగ్రీ పూర్తి చేశాను. అయితే నా ప్రామిస్ నాకుండిపోయింది. మా నాన్నగారు అడిగారు.. "ఏం చేస్తావు" అని. "ఉద్యోగం చేయను" అని చెప్పాను. మా నాన్నగారు డాక్టర్. పోనీ మద్రాసు వెళ్లి డాక్టర్ కోర్సు చేయి.నేను లెటర్ ఇస్తాను అన్నారు. ఇదంతా యాభయ్యవ దశకం చివరిలో. మా నాన్నగారి ఉత్తరంతో నాకు సీటు వచ్చేది ఆ రోజున. మా నాన్నగారితో నేనన్నాను. "నువ్వు పడే బాధలు చూస్తున్నాను. పేషెంట్లు పడే బాధలు చూస్తున్నాను. ఇంకా ఆ మందుల వాసన భరించటం నావల్ల కాదు" నా మాటకు ఆయన కూడా నన్ను బలవంత పెట్టలేదు. ఆ రోజుల్లో వైద్యమంటే సేవే. డాక్టర్లకు డబ్బుమీద ప్రేమ ఉండేది కాదు. రోగులు కూడా వాళ్లని దేవుళ్లలా చూసేవారు. నేను ఈ ఉద్యోగ బాధలోంచి, డాక్టర్ చదువులోంచి బయటపడాలి. ఏం చేయాలో ఆలోచించలేదు. ఏం చేయకూడదో మాత్రం నిర్ణయించుకున్నాను. ఇది నా పునాది. It opened so many doors & so many avenues. "ఇన్ని పనులు మీరు ఎలా చేస్తున్నారు" అని అడిగారు కదా! అదే కారణం. నాకిష్టమయిన పనులు చేయటానికి అవకాశం కలిగింది. నేనెవరి దగ్గర పని చేయలేదు. ఇష్టంలేని పని చేయలేదు. కాని ఎన్ని పనులు చేశానో చూశారు కదా! దీనికి పెద్దగా నా దగ్గర డబ్బు కూడా లేదు. Neither I am rich nor poor! (నవ్వు) డబ్బు సంపాదన లక్ష్యంగా పెట్టుకోకూడదు–

***మరి సాహిత్యంలోకి..***

సాహిత్యంలోకి నేను ఆలస్యంగా వచ్చాను. కాని నేను ఐరోపా సాహిత్యం చాలావరకు ఆంగ్లం లోనే చదివాను. అలాగే ప్రపంచ మేధావులందరినీ విస్తృతంగా చదివాను. పన్నెండేళ్ల నుంచి చదువుతుండే వాడిని. మాదో చిన్న పల్లెటూరు. రెండు రోజులకి పోస్ట్‌లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పేపర్ వచ్చేది. అమెరికన్ రిపోర్ట్ అనే పత్రిక నెలరోజులకు వచ్చేది. మా నాన్నగారు మద్రాసులో చదివారు కాబట్టి ఇంగ్లీషు పుస్తకాలు చాలా ఉండేవి ఆయన



***22 ఏళ్ళ వయస్సులో అశ్వినీకుమార్***

దగ్గర. పెరల్ బెక్, ఇంకా అనేకం. ఇవన్నీ నేను చదివేవాడిని అనడం కన్నా ఆయన చదివించేవాడు అనటం కరెక్టు. మార్క్ ట్వెయిన్, సెర్వంటెజ్, టాల్‌స్టాయ్, థామస్‌హార్డీ, సోమర్‌సెట్ మాం, హెర్మన్ హెస్ సిద్దార్థ (ఈ పుస్తకం ఎన్నిసార్లు చదివానో లెక్కలేదు). షోపెన్ హెూవర్ తర్వాత చదివాను. 'ఆంద్రీ మార్వ్యా' తర్వాత చదివాను. బైరన్, షెల్లీ, ఆస్కార్‌వైల్డ్, రస్కిన్‌బాండ్, వీరసావర్కార్ (ఆయన రాసిన First War of Independence 800 పేజీల పుస్తకం ఫుట్‌పాత్ మీద ఐదు రూపాయలకు అమ్ముతుంటే కొని చదివాను. ఆర్కే నారాయణ్, నెహ్రూ, గాంధీల జీవిత చరిత్రలు చదివాను. వీర సావర్కర్ పుస్తకం చాలా గొప్పదనిపించింది. నన్ను చాలా ప్రభావితం చేసిన పుస్తకం. ఇక వినోదం కోసం సర్ ఆర్థర్ కానన్ డయల్ చదివాను. జేమ్స్‌బాండ్ పుస్తకాలన్నీ చదివా. వాటిని సినిమాలు తీయకమునుపే (నవ్వు). రూపాయి, రెండు రూపాయలకు దొరికే జేమ్స్ మేసన్ వంటి డిటెక్టివ్ నవలలు చదివాను. తెలుగు పుస్తకాలు ఎక్కువ చదవలేదు. రామకృష్ణ పరమహంస జీవితం పదహారేళ్ళకే చదివాను.

నేను కాలేజీలో చదివే రోజుల్లో కుటుంబరావు గారనే తెలుగు మాస్టారు ఉండేవారు. నా దస్తూరీ బావుండేదని ఆయన సెలవులొస్తే 'భారతం' పుస్తకం నాకిచ్చి కాపీ చేయమని అడిగేవాడు. కాపీ రాసినప్పుడు అవన్నీ జాగ్రత్తగా చదివేవాడిని. చాలా ఆసక్తిగా ఉండేవి. అట్లా ఆ మూడు సంవత్సరాలు, సెలవులొచ్చినప్పుడల్లా చదివి రాశాను. అప్పటికి జిరాక్స్ మెషీన్ లేదు కాబట్టి. నేను కాపీ మెషన్ ఆయనకి. అది ఆయనకు ఎంతవరకు ఉపయోగపడిందో తెలీదు కానీ, నాకు చాలా ఉపయోగపడింది. It rekindled my interest. ప్రబంధం పట్ల నాకు ఆసక్తి కలిగింది. ఛందోబద్ధమయిన పద్యాలు రాసేవాడిని. ఇంకో విషయం చాలామంది తత్వవేత్తలను కూడా చదివాను. జెకె, అరబిందుల వంటి వారిని చదివి, అరబిందో ఆశ్రమం దర్శించాను. కొంత ఆధ్యాత్మికత నాలో ఏర్పడటానికి ఆ రచనలు దోహదపడ్డాయి.

మళ్ళీ మొదటికే వస్తాను. ఇన్ని పనులు ఎలా చేశారు అన్న ప్రశ్నకు! ఉద్యోగం చేసేవారికి అవకాశాలు తక్కువుంటాయి. ఉద్యోగమయ్యాక సాయంత్రం ఇంటికి వచ్చేటప్పటికి అలసిపోతారు. ఇక కుటుంబ బాధ్యతలు ఎలాగూ ఉంటాయి. ముప్పై ఏళ్లపాటు ఇదే చేసినప్పుడు వారికి కొంచం కష్టమే. నాకు అలాకాదు. "Wide World is before me" (నవ్వు).

నేను వ్యాపారాలు చేస్తూనే నా సాహిత్య తృష్ణ తీర్చుకున్నాను. మోటార్‌సైకిల్ స్పేర్‌పార్ట్స్ వ్యాపారం చేశాను. రేడియోలు అమ్మాను. సినిమాలను రీ రిలీజ్ చేశాను. ఆ తర్వాత ట్రావెల్ ఏజెన్సీ నడిపాను.

***మీ ఈ మూలాలన్నింటికి మీ బాల్యం కారణమనుకోవచ్చా?***

అస్సలు కాదు. నేను పుట్టింది బెజవాడే. ఆరేళ్ల వరకు మా అమ్మమ్మ వాళ్ల దగ్గరే పెరిగాను. మా చిన్నతనంలోనే నేను అమ్మను కోల్పోయాను. ఒకరకంగా నేను అనాథనే. నలుగురం సోదరులం మేం. నన్ను మా నాన్న తన వెంట తీసుకెళ్లాడు. మా నాన్న బెజవాడలోనే ప్రాక్టీసు చేస్తుండేవాడు. కానీ ఆయనకు అప్పుడే ఈ అర్బనైజేషన్ పాడు చేస్తుంది అన్న భావన కలిగింది. పల్లెటూళ్లలో వైద్యసేవలు సరిగ్గాలేవు. అక్కడికి వెళ్లాలి అనే



*27 ఏళ్ళ వయసులో జయంతితో వైవాహిక జీవితంలోకి...*

నిర్ణయానికి వచ్చాడు. చిన్నపిల్లలం కదా మాకప్పుడు అర్థం కాలేదు. అర్థంకాక ఆయన్ని తిట్టుకునేవాళ్లం. ఆ పల్లెటూరిని ఆస్వాదించటం మొదలయ్యాక, అక్కడ ఫ్రెండ్సు ఏర్పడ్డాక నా ఆలోచనల్లో మార్పు వచ్చింది. స్కూల్‌కు వెళ్లటం కోసం నేను రోజుకు నాలుగు మైళ్లు నడిచేవాడిని. ఇంకో దారి లేదు. ఒకటే బస్సు ఉండేది. దాని టైమింగ్స్ మనకు సరిపోయేవికావు. నా కథలన్నింటిలోను నా బాల్యం జ్ఞాపకాలు, కౌమారం జ్ఞాపకాల్లో వూరు తొంగి చూస్తూ ఉంటుంది. అలా ఒక కథకుడిగా నన్ను "త్రివేణి" పత్రిక నా ఆత్మను పట్టుకోగలిగింది. నా 'అమహా' కథల పుస్తకాన్ని సమీక్షించారు "త్రివేణి" పత్రిక. "While reading the book, the first thing that strikes the reader invariably the soft and sentimental personality of the author and its unmistakable reflection all through the pages. ఈ కథల్లో లోపాయకారిగా మనకు కనిపించేది రచయిత వ్యక్తిత్వం. రచయిత అనుభవాలు అంటాడు త్రివేణి పత్రికా సమీక్షకుడు. మామూలుగా రివ్యూ రాసేవారు కేవలం కథల గురించో, శిల్పం గురించో రాస్తారు... రచయిత తొంగి చూసేది చాలా తక్కువ.

The author having travelled world over, scenorios chosen by him of these episodes vary widely from rural India to the modern cities. అని కూడా రాశారు.

***తెలుగు సాహిత్యం తక్కువ చదివినా, తెలుగు సాహిత్యంవైపే వచ్చారే?***

తెలుగుమీద మంచి పట్టు ఉన్నదని చెప్పా కదా! కుటుంబరావుగారి చలవే అది. మేము చందమామ చందా కట్టి తెప్పించుకునేవాళ్లం. కవర్ వ్యాఖ్య పోటీలో మాకు బహుమతులొస్తే సంవత్సరంపాటు 'ఫ్రీ'గా పంపించారు పత్రిక మాకు. నాగిరెడ్డిగారి పుస్తకం చదివి పెరిగిన నేను, నాగిరెడ్డిగారిని కలసినప్పుడు వారి ప్రెస్ అంతా నాకు దగ్గరుండి చూపించారు. చూడండి ఈ 'లీప్' నా జీవితంలో! నా చిన్నప్పటి మా జ్ఞాపకం కూడా వారికి చెప్పాను. అట్లాగే వారబ్బాయి విశ్వనాథ రెడ్డిగారిని కలసినప్పుడు ఆ సామ్రాజ్యమంతా ఏమయి పోయిందా అనిపించింది.

***ఇంగ్లీషులో మీరు చాలామందిని చది వారు చాలామందిని అభిమానించారు. తెలుగులో అలా చెప్పమంటే ఎవరి గురించి చెబుతారు?***

వడ్డెర చండీదాసు ఒక్కడే నేను అభిమానించే రచయిత. అంతకుముందు మరొకాయన రచనలను ఇష్టపడేవాడిని. ఆయన పేరు సింగరాజు లింగమూర్తి. ఆయన ప్రభలో సీరియల్స్ రాస్తుండేవారు. మంచి వచనం రాసేవారు. అడివి బాపిరాజు కూడా, విశ్వనాథ, తిరుపతి వెంకట కవులు–

***మీ తొలి రచన ఎప్పుడు చేశారు?***

'అమహా' కథ నా మొదటికథ. అప్పటిదాకా ప్రేమలేఖలు కవిత్వం మాత్రమే రాశాను (నవ్వు). ఈ కథ రాసే సమయానికి నేను ప్రపంచం తిరిగొచ్చాను. ఈ కథ రాయటానికి నన్ను ప్రేరేపించింది పురాణపండ రంగనాథ్ గారు. ఆయన నన్ను చాలా ప్రోత్సహించాడు. "నువ్వు చాలా ప్రపంచం చూసొచ్చావు. కథ రాయి" అనేవాడు. నేనంటే చాలా ఇష్టం ఆయనకు. నా టాలెంటేమిటో తెలుసాయనకు. ఆయన పోరు పడలేక ఆ కథ రాశాను. ఆ కథలో నేను తిరిగిన ప్రదేశాలన్నీ ఉంటాయి. అలాగే నా కథలన్నింటిలో నేను తిరిగిన ప్రదేశాలుంటాయి. తిరగని ప్రదేశం గురించి నేను రాయను. అందుకే నా కథల్లో డీటెలియింగ్ ఎక్కువ ఉంటుంది. ఆ తర్వాత కథ వస్తువుకు సంబంధించి నేను చూసినవి కొన్ని, నా అనుభవాలు కొన్ని, జరిగేవి కొన్ని. కథ ఈ రకంగా ఉంటేనే కథ జీవిత శకలమై కనిపిస్తుంది. నా కథల్లోని చాలా సబ్జెక్టులను నవలగా రాయవచ్చు కానీ నేను నవల రాయాలంటే చాలా సమయం కావాలి. ఓర్పు ఉండాలి.

అమెరికన్ రచయిత John Updike ఇలా చెబుతాడు.

"ఒక నవల రాయాలంటే ఆ నవలలోని పాత్రలతో మీరు (రచయిత) చాలాకాలం కాపురం చేయగలగాలి."

ఇది నేను చేసిన అనువాదాలలో జరిగింది. అసలు చాప్లిన్ అనువాదం నేను చేద్దామనుకోలేదు. "చాప్లిన్ అంతరంగం" శీర్షికతో 'మిసిమి' పత్రిక కోసం ఒక వ్యాసం రాశాను. దానికి చాలా పేరొచ్చింది. చాప్లిన్ బయాగ్రఫీ నా దగ్గర ఉండేది. చాలా పాత పుస్తకం... ఒక డాలర్‌కు కొన్నాను. 'మిసిమి'కి వచ్చాక ఒకసారి నాకు ఆరోగ్య సమస్య వచ్చింది. దాని వలన నేను నెలరోజులు ఇంట్లో ఉండాల్సి వచ్చింది. ఆ నెల రోజుల్లో చాప్లిన్ తెలుగు అనువాదం రాశాను. ముప్ఫైరెండు చాప్టర్లున్నా యనుకుంటాను. రోజుకొక ఛాప్టర్ చొప్పున రాశాను. మీలాంటి స్నేహితులకిచ్చాను. చదివి ఎలా ఉందో చెప్పమని. బావుందని ఏకగ్రీవంగా చెప్పారు. దాన్ని ఈ పుస్తకంగా తయారుచేయటానికి రెండు, మూడు నెలల పట్టింది. ఇప్పటికి పదివేలు కాపీలు అమ్ముడయ్యాయి. మొదటి నెలలోనే వెయ్యి పుస్తకాలు కొన్నారు.

***చాప్లిన్ మీకు ఇష్టమయిన వ్యక్తా?***

చాప్లిన్ ఎవరికి ఇష్టం కాదో చెప్పండి. పదివేల కాపీలు పోయాయంటే సగం క్రెడిట్ ఆయనిది. ఆయన పాపులారిటీ ఆ పుస్తకం అమ్ముడుపోవటానికి కారణం. మరో ఎడిషన్‌కు సిద్ధమవుతున్నాడు 'చాప్లిన్'. సరికొత్త కవర్‌తో.

***సొంతంగా రాసే శక్తి ఉండి, అప్పటికే ఒక కథ సంపుటి వెలువరించి అనువాదం వైపు వెళ్లారు... దేనికి?***

దానికి కారణం చెబుతాను. ఇంతకు ముందు మీకు చెప్పాను. మేం డిగ్రీ చదివే రోజుల్లో ఒక పేరా ఇచ్చేవారు అనువాదం చేయమని. నేను అందరికంటే




*30 ఏళ్ళ ప్రాయంలో మొదటి పాస్‌పోర్ట్!*

వేగంగా చేసేవాడిని, దానికి కారణం రెండు భాషలపై నాకు పట్టు ఉండటం. నా క్లాస్‌మేట్స్‌ని నేను చూసేవాడిని. చాలామందికి తెలుగు రాదు; ఇంగ్లీషు చదివే వారు కానీ వారికి అర్థం అయ్యేదికాదు. అలా వారంతా ఇబ్బంది పడుతుండేవారు. నాకేమో రెండు భాషలు బాగా వచ్చేవి.

అలా అనువాదాన్ని నేను ఇష్టపడుతూ చేసే వాడిని. తర్వాత నేను ఇంగ్లీషులో ఉన్న కవిత్వాల్ని తెలుగులోకి అనువాదం చేస్తుండేవాడిని ఎవరో అడిగారని రాయటం కాదు. నాకు నేను రాసుకునే వాడిని. ఇంకో విషయం చెప్పాలి నేను హిందీ పాటలు బాగా వింటుండేవాడిని. ఆ పాటలను కూడా తెలుగులో అనువాదం చేసి రాసుకునేవాడిని. రఫీ పాట 'బహారో ఫూల్ బర్‌సావో.. మేరే మెహబూబ్ ఆయా హై" విన్నారుగా అది తెలుగులో రాస్తే ఎంత బావుంటుందండీ. ఉత్తర భారతమంతా తిరగటం వలన హిందీ వచ్చు. "నల్లని మేఘాలుపైన తిరుగుతున్నాయి అవి నా ప్రియురాలి కళ్ల కాటుకలా ఉన్నాయి". "గులాబీపూలు తీసుకురండి.. మెహందీ పెట్టాలి నా ప్రియరాలికి" ఇలాంటి అందమైన భావనలు ఆ పాటల్లో ఉంటాయి. నా ప్రేయసి వస్తున్నది – ఓ వసంతమా పూలబాట వేయి! ఇదీ!

***మళ్లా మీ అనువాదం దగ్గరికి వద్దాం. చాప్లిన్ తర్వాత షెల్లీ, బైరన్, కీట్సు జీవిత చరిత్రలను అనువాదం చేశారు కదా!***

షెల్లీ జీవితచరిత్ర ఎందుకు అనువాదం చేశానో చెబుతాను. నాకు రచయిత, అనువాదకులు ముక్తవరం పార్థసారధిగారు మంచి స్నేహితులు. మేమిద్దరం విజయనగర్ కాలనీలో ఉంటున్నప్పుడు అక్కడ పార్క్‌లో రోజూ కలుసుకునేవాళ్లం. మాట్లాడుకుంటుండేవాళ్లం. మాటలంటే ఏమీలేదు. పుస్తకాల గురించే కబుర్లు. ఆయన మాటల్లో ఒకసారన్నారు. ఆంద్రీ మార్వా అనే ఫ్రెంచి రచయిత ఉన్నాడు. షెల్లీ బయోగ్రఫీ రాశాడు అని. షెల్లీ బయోగ్రఫీ తెలుగులో ఎవరూ రాయలేదు కదా అనుకుని పుస్తకముంటే ఇమ్మంటే చిరుగులతో ఉన్న షెల్లీ బయోగ్రఫీని నాకు పార్థసారథి గారిచ్చారు. అది చదివానండీ. ఆంద్రీ మార్వా అనే ఫ్రెంచివాడు ఫ్రెంచ్‌లో రాసిన షెల్లీ బయోగ్రఫీ ఇంగ్లీషులో చదివాను. షెల్లీ అంటే బాగా ఇష్టం నాకు. ఆ పుస్తకం చదవగానే I was mesmerized అన్నమాట. కృష్ణశాస్త్రి, షెల్లీలు మనకు తెలిసిన వ్యక్తులు. కానీ వారి జీవితం గురించి మనకు తెలీదు, షెల్లీ అనేవాడు రెండొందల ఏళ్లక్రితం వాడు. అతని ప్రేమవిషాదం. నేను పెట్టిన పేరు కూడా అదే. షెల్లీ "ప్రేమవిషాదం" మతాన్ని, ఇంగ్లీషు రాజ్యాన్ని, సమాజాన్ని మొత్తం కాదన్నాడు. తను బతుకుతున్న సమాజం మీద, పాలిస్తున్న రాజు మీద తిరుగుబాటు ఎందుకొచ్చిందని ఆలోచిస్తే అతను మతం పేరిట జరిగే మోసాలను చూసి తట్టుకోలేకపోయాడు. దేశం వదిలిపెట్టి వెళ్లిపోయాడు. స్విట్జర్లాండ్ వెళ్లాడు. ఇటలీ వెళ్లాడు. ఇటలీలో సముద్రం పక్క ఇల్లు తీసుకుని అక్కడే గడిపాడు. గాడ్విన్ అని ఇంగ్లండులో ఉన్న కమ్యూనిస్టు అతను. అతని కూతుర్ని చేసుకున్నాడు. ఆమె పేరు మేరి. ఫ్రాంకిస్టెయిన్ – హార్రర్ నవల రాసింది! ఇంగ్లండ్ నుంచి ఇంగ్లీషు ఛానెల్ దాటి, స్విట్జర్లాండ్ దాటి ఇటలీ వెళ్లారంటే ఎంత ప్రయాణం చేయాలి. వాళ్ల ప్రయోగాలన్నీ స్వీయ అన్వేషణలే. ప్రయాణాలుగా చూడకూడదు మనం. అసలు బయటికి వెళ్లినప్పుడు నీకు నువ్వేమిటో తెలిసేది. షెల్లీ అనువాదం చేసిన తర్వాత పాఠకుల ఆదరణ లభించాక నాకు షెల్లీ సమకాలీనుడు బైరన్ గురించి తెలిసింది. బైరన్ బయోగ్రఫీ కూడా మళ్లా ఆంద్రీ మార్వానే రాశాడు. షెల్లీ గురించి అతను పరిశోధన చేస్తుంటే బైరన్ తగిలాడు మార్వాకి. షెల్లీ రాశాక బైరన్ గురించి వెతికాడు. బైరన్ షెల్లీ కంటే గొప్ప వాడని తెలిసింది. బైరన్ అనేవాడు ఒక అగ్నిపర్వతం.



***35 ఏళ్ళ వయసులో సరికొత్తగా...***

బైరన్ అనే వ్యక్తి లార్డ్ బైరన్ అయ్యాక ఆ లార్డ్‌షిప్‌ను కాలితో తన్నేసి ఇంగ్లాండ్ వదిలేసి వెళ్లిపోయాడు. బైరన్ కూడా ఆ స్వీయాన్వేషణలోనే వెళ్లిపోయాడు. షెల్లీ కంటే గొప్ప కవి బైరన్. తనలాగే తనుండటానికి ఎన్ని కష్టాలు పడాలో అన్ని కష్టాలు పడ్డాడు. గ్రీసు స్వాతంత్ర్యం కోసం ధన–ప్రాణాలు అర్పించాడు.

నాకిష్టమొచ్చినట్లు నేను బతకాలంటే ప్రపంచం ఒప్పుకోదు అని తెలిసినవాడు. ఈ సమస్య నాక్కూడా ఉంది. ఏమిటో వీడు ఉద్యోగం చేయడా? ఎలా బతుకుతున్నాడు! డబ్బెవరిస్తున్నారు? ఇవన్నీ కావాలి సమాజానికి. చాలామందిని గమనించాను నేను. బోల్డంత డబ్బుంటుంది. ఇల్లు కదిలి బయటికి వెళ్లరు. వారికి ప్రపంచమేమి తెలుస్తుంది? జీవితాన్ని ఏం తెలుసుకుంటారనిపిస్తుంది.

***తర్వాత కీట్స్ వైపు వచ్చారు.***

వాళ్ల ముగ్గురూ సమకాలీకులే. కీట్సు దురదృష్టమేమిటంటే అతనికి క్షయవ్యాధి వచ్చి పాతికేళ్లకే పోయాడు. షెల్లీ ముప్ఫై ఏళ్లకి మరణించాడు. బైరన్ ముప్ఫై ఆరేళ్లకు గతించాడు. ముగ్గురికి కలిపి వందేళ్లు లేవు. ఇవాళ రెండొందల సంవత్సరాల తర్వాత వారి గురించి మనం మాట్లాడుకుంటున్నాం అంటే వారెంత గొప్ప వారయి ఉండాలి. వాళ్లు ముగ్గురు కూడా తమ చుట్టూ వున్న రాజ్యాన్ని, సంఘాన్ని మతాన్ని కాదనుకుని వెళ్లిపోయినవారు. బైరన్, షెల్లీ ఇద్దరు mechanization అని ఒప్పుకోలేదు. ఒకసారి బైరన్ తన పొలంలో ఎవరో ట్రాక్టర్‌తో దున్నబోతుంటే వారించి గుర్రాలతో దున్నమంటాడు. మీరు ఇదంతా అభివృద్ధి అంటారు కదా! ఒకసారి నేను కారులో ప్రయాణం చేస్తున్నాను. నాతోపాటు ఇద్దరు ముగ్గురు స్నేహితులున్నారు. వాళ్లు అభివృద్ధి గురించి మాట్లాడుతుంటే "అభివృద్ధంటే విధ్వంసం" అని చెప్పాల్సి వచ్చింది. కాశ్మీర్‌లో ఒక రాజుండేవాడు. చిన్న చిన్న ఆనకట్టలు కట్టేవారిని పిలిపించి శిక్షించేవాడు. ప్రకృతికి అడ్డుకట్ట వేయకండి అన్నది ఆ రాజుగారి మాట. మనం ఆనకట్టలు కట్టినచోటల్లా భూకంపాలు వస్తున్నాయి. ప్రకృతిని యథాతథ స్థితిలో ఉంచాలి.

***మరి ముందుకెలా వెళ్లాలి.***

ముందుకెళుతున్నాం అని మనమనుకుంటు న్నాం. కొయ్య గుర్రాల మీద ఊరేగుతున్నాం మోస్తున్నాం. మానవజాతి ఆవిర్భవించి యాభై లక్షల సంవత్సరాలయింది. మన పూర్వీకులు సుఖంగా లేరా! మనం ముందుకొచ్చి సాధించింది ఏమిటి– ఆనందంగా వుంటున్నామా? అని మనం ప్రశ్నించుకోవాలి!

***మీరు అనువదించిన ముగ్గురిలో మీరు గమనించిన విషయాలేమిటి?***

షెల్లీలోని నైతికత. బైరన్ విశ్రుంఖలత. ఇద్దరూ వ్యతిరేక మార్గంలో ఉన్నా, ఇద్దరూ మంచి మిత్రులు. కీట్స్ ఐదేళ్లపాటు రాసి ఉంటాడేమో. కీట్స్ చనిపోయినపుడు షెల్లీ అద్భుతమైన 'ఎలిజీ' రాశాడు. అది నేను తెలుగులో రాసి రికార్డు చేసి యూట్యూబ్‌లో ఉంచాను. వాళ్లలోని తిరుగుబాటుతనం, స్వేచ్ఛాప్రియత్వం. దానికోసం ఎన్ని కష్టాలు పడటానికైనా వెనుకాడలేదు వారు. జీవితంలో మనం కాంప్రమైజ్ అయిపోతాం. కానీ వారు కాంప్రమైజ్ కాలేదు. వాళ్లకి కావలసినట్టు జీవించారు. అది కుదరనప్పుడు అక్కడ ఉండలేదు వారు. బైరన్ ఇంగ్లండ్ వదిలి వెళ్లిపోయేటప్పుడు పడవ ఎక్కాడు. కాళ్లు కూడ దులుపుకుని ఈ మట్టి కూడా నాకక్కర్లేదు అన్నాడు. దానికెంత ధైర్యముండాలి. మన దగ్గర అటువంటి ఒక కవిని చూపించండి! ఆధునిక విధ్వంసకు నెపోలియన్; ఆవిష్కరణలలో (విమానం–కారు) హిట్లర్ బాధ్యులు.







*1. జాన్ కీట్స్*
*2. పి.బి. షెల్లీ*
*3. లార్డ్ బైరన్*

*ఈ ముగ్గురూ సమకాలీకులే. కీట్సు దురదృష్ట మేమిటంటే అతనికి క్షయవ్యాధి వచ్చి పాతికేళ్లకే పోయాడు. షెల్లీ ముప్ఫై ఏళ్లకి మరణించాడు. బైరన్ ముప్ఫై ఆరేళ్లకు గతించాడు. ముగ్గురికి కలిపి వందేళ్లు లేవు. ఇవాళ రెండొందల సంవత్సరాల తర్వాత వారి గురించి మనం మాట్లాడుకుంటున్నాం అంటే వారెంత గొప్ప వారయి ఉండాలి. వాళ్లు ముగ్గురు కూడా తమ చుట్టూ వున్న రాజ్యాన్ని, సంఘాన్ని, మతాన్ని కాదనుకుని జీవించిన వారు.*

***మరో అనువాదం మీది హెర్మన్ హెస్ 'సిద్ధార్థ'! మీరు చాలాసార్లు చదివానని కూడా చెప్పారు. మీకు బాగా నచ్చటం వలన, చాలాసార్లు చదవడం వలన అనువాదం చేద్దామనుకున్నారా!***

సిద్ధార్థతో నాకు పోలిక ఉంది. ఒక ఐడెంటిఫికేషన్ ఉంది. సిద్ధార్థ తండ్రి దగ్గరుండి చదువుకుంటాడు. కానీ అక్కడే ఉండి ఒదిగిపోవడం అతనికి ఇష్టం లేదు. ఈ ప్రపంచం గురించి తెలుసుకోవాలి, నా గురించి నేను తెలుసుకోవాలి అంటే ఇక్కడ నుండి బయటపడాలి అనుకున్నాడు. బయటపడ్డాడు. శ్రమణుల దగ్గరకు వెళ్లాడు. శ్రమణులు అంటే సిద్ధులు. వాళ్లతోపాటు ఉంటాడు. వాళ్లను జయిస్తాడు. వర్షాల్లో ఉంటాడు. ముళ్లమీద పడుకుంటాడు. దాంట్లో అతనికేమీ ప్రత్యేకత కనపడలేదు. ఒక వృద్ధ శ్రమణుడి దగ్గరకు వెళ్లి నేను వెళ్లిపోతానని చెబుతాడు. అతను ఒప్పుకోడు. తన శక్తి ప్రయోగించి ఆపుదామను కుంటాడు. ఆ శక్తి అతనిముందు పని చేయదు. పక్కనే గోవిందుడు ఉంటాడు. అతనితో కలిసి వెళ్లిపోతాడు. ఆ గోవిందుడు అడుగుతాడు "ఎందుకు వారిని వదిలేసి వెళ్లిపోవాలనుకుంటావు" అని. వారికి తెలిసింది స్వల్పం. మనకు ఇంతకన్నా తెలుసుకోవలసింది ఉంది పద అంటాడు. అక్కడినుంచి బుద్ధుడి దగ్గరకు వస్తాడు. బుద్ధున్ని దర్శిస్తాడు అప్పటికే జేతవనంలో చాలామంది శిష్యులుంటారు. గోవిందుడు కూడా ఆ ప్రవచనాలు విని ఆగిపోతాడు. ఇతడొక్కడే మిగిలిపోతాడు. గోవిందు బుద్ధుడి దగ్గరకు వెళదామంటాడు. ఇతను బుద్ధుడి దగ్గరకు వెళతాడు. నాతోపాటు వచ్చిన గోవిందుడు కూడా మీ దగ్గర ఆగిపోతున్నాడు. నేను వెళ్లిపోదామనుకుంటున్నాను అంటాడు. బుద్ధుడు ఎవరినీ ఆపడు కదా! అలాగే నాయనా వెళ్లు అంటాడు. "నాకో సందేహం ఉంది, అడగవచ్చా" అంటాడు సిద్ధార్థుడు. అడగమని చిరునవ్వు నవ్వుతాడు తథాగతుడు.

సిద్ధార్థుడంటాడు కదా! "మీరు ప్రతిదానికి కార్యకారణ సంబంధముందంటారు కదా, అంటే ప్రతి కార్యానికి ఒక కారణముందంటారు; రాబోయే కాలంతో తత్వవేత్తలు, తర్కవేత్తలు దీనిని గుర్తుంచు కుంటారు. ఈ కార్యకారణ సంబంధం నాకర్థమ యింది. నాకర్థంకాని విషయం ఒకటుంది. అడగనా అంటాడు. అడగమని మరోసారి చిరునవ్వు నవ్వుతాడు బుద్ధుడు. "అంతకు ముందు తెలియని అంశాన్ని మీరు చెప్పారు. అంతకు ముందు లేని అంశాన్ని మీరెలా చెప్పారు. అంతకుముందు లేనిది కార్యకారణ సిద్ధాంతంలోకి రావటానికి వీల్లేదు. మీరు ఎట్లా చెప్పారు" అని అడుగుతాడు. అప్పుడు బుద్ధుడు "నేను ఇది నీలాంటి ఆలోచనావరుల కోసం చెప్పలేదు. ఇక్కడున్న భిక్షువులకోసం దాని అవసరం చెప్పాను. నీ దారి నువ్వెతుక్కుంటున్నావు. అదే వీరికి కూడా చెబుతున్నాను. ఏదయినా ఎవరి అనుభవం వారు పొందినప్పుడే అది అర్థమవుతుంది'' అంటాడు. "అట్లాగే నేను చెప్పానని నమ్మవద్దు. నీ దారిన నువు ప్రయాణం చేయి" అని సూచిస్తాడు. అలా సిద్ధార్థుడు, బుద్ధున్ని విడచి వచ్చేశాక ప్రకృతిలోకి చూడడం మొదలుపెడతాడు. సింహం ఒక జింకని తింటుంది. ఒక చేప ఇంకో చేపతో కూడుతుంది.ఆకలి–కోరిక... ఈ రెండు సుడులు తిరుగుతూ ఉంటాయని అతను గమనిస్తాడు. ఒక చెరువు దగ్గరకు వెళతాడు. అక్కడ ఒక స్త్రీ అతన్ని మోహిస్తుంది. ఇతను లొంగడు. నాకు వేరే పనులున్నాయని సాగిపోతాడు. నా గురించి రాజారామ్మోహన రావు ఒక మాట రాశాడు. 'అశ్వినికి మరణమంటే భయం లేదు' అని. జరా మరణాలు మనం అంగీకరిస్తే మనకు ప్రశాంతత చేకూరు తుంది. ఇవి facts of life అనుకుంటే. అలా సిద్ధార్థలో నన్ను నేను చూసుకున్నాను. అట్లాగే నాలో ఒక బైరన్ ఉన్నాడు. లేకపోతే ఇలా రాయను. నా రచనలు మీరు చదివుంటారు. ఇతరుల రచనలు మీరు చదివుంటారు. మీకో వ్యత్యాసం కనపడి ఉంటుంది ఎందుకని?

***మీరు చూసిన విశాల ప్రపంచం వలన మీ రచనలు లోతుగా ఉంటాయని అనిపిస్తుంది.***

దాన్నే Foot Loose రచయిత అంటారు. మీరు నాలుగు ప్రదేశాలు తిరిగి, మిమ్మల్ని మీరు తెలుసుకుని లేదా ఎదుటి వారిని గమనించి రాస్తే ఒకలా ఉంటాయి. ఒకేచోట కూర్చుని రాస్తే ఒకలా ఉంటాయి.

***మరో కష్టమయిన అనువాదం మీరు చేసింది రాజారావు "SERPENT AND ROPE"***

అదెందుకు చేశానో చెబుతాను. ఇప్పటి వరకు చేసిన అనువాదాలన్నీ విదేశీ రచయితలవే. ఎవరో అన్నారు. మీరు మంచి అనువాదాలు చేస్తున్నారు. కానీ ఇవేవి సాహిత్య అకాడమి దృష్టికి వెళ్లవు. సాహిత్య అకాడమి గుర్తించాలన్నా, మీ అనువాదానికో స్టాంపు ఉండాలన్నా భారతీయ రచయితను మీరు అనువదించాలి అన్నారు.

***మీకు అవార్డు దృష్టి ఉందా!***

నాకు అవార్డు గురించిన తపన లేదు. కాని గుర్తింపు ముఖ్యం – రెండోది రావాలంటే మొదటిది కావాలి! అయితే ఒక సృజన చేసినప్పుడు, అది అందంగా చేయాలనుకుంటాం కదా! ఆ దృష్టితో చెబుతున్నాను. మీరు విదేశీ రచయితను అనువదిస్తే అకాడమి దృష్టికి వెళ్లదనటంతో భారతీయు రచయితను వెతికినప్పుడు నాకు రాజారావు గుర్తొచ్చాడు. పాతకాలంలో వీర సావర్కర్, ముల్గాంకర్, ఆర్.కె. నారాయణ్, ముల్కరాజ్ ఆనంద్, రాజారావు.. ఇలా కొంతమంది కనిపిస్తారు. ఆర్‌కె నారాయణ్ నాకు నచ్చడు. రాజారావు నాలాంటి వాడే. ఉస్మానియా యూనివర్శిటీలో చదువుకున్నారు. నిజాం స్పాన్సర్ చేస్తే ఫ్రాన్స్ వెళ్లాడు. అక్కడో యువతిని చేసుకున్నాడు. ఆ కాపురం సజావుగా సాగలేదు. అక్కడినుంచి అమెరికా వెళ్లారు. తర్వాత అరవిందుల ఆశ్రమానికి వచ్చాడు. మన భారతీయ సంస్కృతిని ప్రచారం చేయటానికి ఒక సంస్థ నెలకొల్పాడు. మళ్లా ఇక్కడ నుంచి డల్లాస్ వెళ్లి అక్కడ స్థిరపడ్డారు. 97వ ఏట తనువు చాలించాడు. గొప్ప మేధావి. ఎందుకు చెబుతున్నానంటే మనకు మేధావులు తక్కువ. కన్నడ, తెలుగు భాషలు వచ్చు ఆయనకు. గురజాడ,

శ్రీశ్రీలను దాటి మన దృష్టి పోలేదు. అంటే రాజారావుని మనవాళ్లు గుర్తించలేదు. బాగా రాసినా గుర్తింపు రానివారు కోకొల్లలు మన దగ్గర. పిలకా గణపతి శాస్త్రి గారు ఎంత బాగా రాశారు. ఎంతద్భుతంగా రాసేవారు. అడవి బాపిరాజు, గోపీచంద్‌లు సామాన్యులా. వారు అవ్వాల్సినంత గొప్పవారు అవ్వలేదే! శ్రీపాద ఎంత పేదరికంలో మగ్గిపోయాడు...

మళ్లా రాజారావు దగ్గరకు వస్తాను. చాలామంది నన్ను నిరుత్సాహపరిచారు, నీవల్లకాదు అన్నారు. ముందు చదవనియ్యండయ్యా అనుకుంటూ మొదలుపెడితే చివరిదాకా ఆగలేదు. ఆ నవల ఆటోబయోగ్రఫికల్‌గా ఉంటుంది. నాకు అద్భుతంగా "Serpent and Rope" నచ్చింది. అంతే అద్భుతంగా తెలుగులోకి అనువాదం చేయడలిగాను.

***చాలా సందర్భాల్లో అనువాద రచనలు స్వతంత్ర రచనలంత వీలుగా ఉండి, చదవటానికి అనుకూలంగా ఉండవు. ఆ విషయంలో మీ అనువాదాలు భిన్నం. ఎక్కడా అనువాదం అన్న ఫీల్ లేకుండా మరల రచన అన్నట్టుంటాయి. ఒక కవితాత్మక ధోరణి మీ అనువాదాల్లో కనిపిస్తుంది. ఒక పుస్తకాన్ని ఎన్నిసార్లు చదువుతారు?***

మూడుసార్లు చదువుతాను. మొదటిసారి చదివి అర్థం చేసుకుంటాను. రెండోసారి అండర్‌లైన్ చేసుకుంటాను. మూడోసారి చదివినప్పుడు నోట్స్ రాసుకుంటాను. మూడుసార్లు చదవకుండా అనువాదం చేయను. తర్వాత నేను మక్కీకి మక్కీ చేయను. ఒకపేరా చదివినప్పుడు ఆ పేరాలో రచయిత ఏం చెప్పదలుచుకున్నాడో గమనిస్తాను. నాదైన శైలిలో చెబుతాను. నా పద ప్రయోగానికి, నా భాషకు అనువైన పుస్తకాన్నే ఎంచుకుంటాను. ఏ పుస్తకం పడితే ఆ పుస్తకం చేయను. ప్రపంచంలోని మతాలన్నిటిని ఒక తాటిన కట్టేస్తాడు రాజారావు. తాడును పాము అనుకుంటున్నాము. అది తాడే అంటాడు.

***యాత్రా సాహిత్యం వైపు వద్దాం. మీరు 60, 70 దేశాలు తిరిగారు. తిరిగినంతగా రాయలేదు. కారణం.***

ఇక్కడో విషయం చెప్పాలి. తిరగడం వేరు, రాయటం వేరు. నేను డైరీలో చూసిన ప్రదేశాల గురించి రాసుకోను. నోట్సు రాయను. వచ్చిన తర్వాత ఆరు నెలలు దాని గురించి పట్టించుకోను. నేను తిరిగిన ప్రదేశాలు, అక్కడి సంఘటనలు పునశ్చరణ చేసుకుంటా. దాంట్లో చెప్పదగ్గవి మాత్రమే చెబుతాను.

***పుస్తకాలు చదివి నోట్సు రాసుకునే మీరు, మీరు చూసే యాత్రలకు నోట్సు రాసుకోకపోవటం ఆశ్చర్యంగా ఉంది.***

యాత్రా రచనలు కొందరివి చదివాను. అవి టూరిస్ట్ గైడ్‌లా ఉంటాయి. అలా ఉండకూడదని నా ఉద్దేశం. అందులో మన అనుభూతి చెప్పాలి. అసలు యాత్ర ఎందుకు చేస్తాం. దాంట్లో మనం ఏం నేర్చుకుంటాం అనే అంశంపై ఒక వ్యాసం రాశాను.

***ఇన్ని దేశాలు తిరిగినప్పుడు మీకు కలిగిన అనుభూతి కానీ అనుభవం కానీ ఏమిటి?***

మనం చాలా చాలా అజ్ఞానంతో ఉన్నామని తెలిసింది. ఎందుకంటే మనం కొన్ని విలువలు పెట్టుకునుంటాం. వాటికి కట్టుబడి ఉంటాం. ఈ బోర్డర్ దాటగానే వాటికి విలువే ఉండదు. మనకిక్కడ గొప్ప విషయం. అక్కడ మామూలు వార్త. మనకిక్కడ చాలా విలువైన సంబంధం అక్కడెందుకు పనికి రాదు. ఇంత వైవిధ్యమున్న ప్రపంచంలో మనం బతుకుతున్నప్పుడు ఎరుకతో ఉండొచ్చు కదా! ఎందుకు వీటికి అంత ప్రాముఖ్యతనిస్తున్నాం. సామాన్యంగా ఇంత అహంకారం ఎందుకు అనిపించింది. నేను ప్రయాణాలు చేశాక నాకు కోపం రావటం పోయింది.

మీరు అలా ఉంటారు. నేను ఇలా ఉంటాను.



***45 ఏళ్ళ నడిప్రాయంలో...***

అందుకే ప్రయాణాలు మనకు ఎంతో నేర్పుతాయని అనుకుంటూ ఉంటాను.

***యాత్రలో మిమ్మల్ని ఆకర్షించేఅంశం ఏమిటి?***

వైవిధ్యమే. భాష మారిపోతుంది. సంస్కృతి మారిపోతుంది. మనుషులు మారిపోతారు. వారు గ్రీట్ చేసే పద్ధతి మారిపోతుంది. తిండి మారి పోతుంది చూడండి ఎంత వైవిధ్యమో. మన జీవితం లో మనకు కావలసిందే వైవిధ్యమే. కోనేటి నీరు పచ్చగా ఉంటుంది. దేనికని? అక్కడ నీరు ఆగి పోయింది. ప్రవాహం లేదు. జీవితం ఎప్పుడు నిలిచి పోయి ఉండకూడదు. అయిందంటే కుళ్లిపోతుంది. ప్రవాహంలా సాగిపోతుండాలి.

"ప్రతీత్య సముత్పాదం" అంటాడు. అంటే ప్రతి క్షణం కొత్తదే. నీరు ప్రవహిస్తుంటుంది. అంతా నీరే. కానీ ప్రవాహంలా ఉండదు. ప్రవాహం వేరు నీరు వేరు.

మీరు అబ్జర్వ్ చేసుంటారు. నాకు జీవితం తేలికగా ఉంటుంది. కారణమేమిటని నన్ను నేను ప్రశ్నించుకుంటే నాకు రెండు కారణాలు దొరికాయి. ఒకటి నేనెవరి దగ్గర్నించి ఏదీ Expect చేయను. అప్పుడు disappointment ఉండదు.

రెండు నా స్థానం నాకు తెలుసు. కాలవ వెళ్లిపోతుంటుంది. నేను గట్టుమీదుంటాను. కాలువగట్టు మీద నిలుచుంటే ఎంత బాగా చూడొచ్చు మీరు? అట్లాగే జీవితంలో మీరు గట్టుమీద ఉన్నారనుకోండి ప్రవాహాన్ని చక్కగా ఆస్వాదించవచ్చు. మీరు కాలవలో ఎప్పుడయితే దూకారో కొట్టుకుపోతారు.

ఇక్కడో విషయం చెప్పాలి. నా యాత్రా కథనాలు – కథలు చదివి చాలామంది నన్ను కలిసేవారు. అలా బెజవాడ వచ్చి కలిసినవారు కాంగ్రేగుల నాగేశ్వరరావు– తర్వాత మిసిమిలో పదేళ్ళుగా నా సహచరుడు – ఇప్పుడు లేరు.

***చాలా దూరం వెళ్లిపోయాం. మళ్లీ కాస్త వెనక్కొచ్చి అనువాద సాహిత్యం గురించి మరి కొన్ని విషయాలు మాట్లాడుకుందాం. క్రొత్తగా ఏమన్నా అనువాద సాహిత్యం రాస్తున్నారా?***

ఆమధ్య యూరోప్ టూర్‌కి వెళ్లొచ్చాను. 'మిసిమి'లో ఎడిటర్స్ డైరీలో సందర్భాన్ని బట్టి ఇస్తున్నాను. మెట్రో ప్రయాణం చేస్తున్నాననుకోండి.. అక్కడ మెట్రో ఎలా ఉంది! ఇక్కడ మెట్రో ఎలా ఉందో రాస్తున్నాను. అక్కడ ప్రయాణీకులు ఎలా ఉన్నారు! ఇక్కడ ప్రయాణీకులు ఎలా ఉన్నారు ఇలాంటి పోలికలతో రాస్తున్నాను. చదివే వాళ్లకు ఇది కూడా ఉపయోగమే. మొన్న ఒకరు ఇంగ్లండ్‌నుంచి ఫోన్ చేసి మీ డైరీలు చైతన్య ప్రవంతి అని పేర్కొన్నారు.

మీరు మొదట్లో అన్నారు మీలో ఒక కథకుడున్నాడు, కవున్నాడు యాత్రికుడున్నాడు.

దానికి సమాధానం చెప్పాలంటే నన్ను నేను వ్యక్తీకరించుకోవాలంటే అనేక మాధ్యమాలు ఉప యోగపడతాయి. నా అనుభవాలు చెప్పాలంటే కథలను ఎంచుకుంటాను. నా ఆవేదన చెప్పాలంటే కవిత్వం ఉపయోగపడుతుంది. నా జీవితాన్ని ఇంకోళ్ల ద్వారా చెప్పాలంటే అనువాదాలు ఉప యోగపడతాయి. ఇట్లా అనేక మాధ్యమాల ద్వారా నన్ను నేను ధృవీకరించుకుంటున్నాను. గొప్ప రచనలు చేస్తున్నానని అనుకోవటంలా (నవ్వు...) A kind of expressing myself through literature.

***ఇన్ని ప్రక్రియల్లో మిమ్మల్ని మీరు వ్యక్తీకరించుకున్న మీరు నవలెందుకు ప్రయత్నించలేదు?***

రెండు నవలలకు సంబంధించిన ప్రణాళికలు నా దగ్గర ఉన్నాయి. రాయటమే మొదలుపెట్టాలి. బ్రెయిన్‌లో అంతా రెడీగా ఉంది కూర్చోవాలి అంతే.

***'రేపు' పత్రిక ఎనభైల్లో ఒక సంచలనం మీరు కూడా అందులో భాగస్వాములే కదా! ఎందుకు ఆ పత్రిక అకస్మాత్తుగా ఆగిపోయింది.***

'రేపు' పత్రిక ఒక ప్రభంజనం. అలాంటి పత్రిక భారతీయ భాషల్లో ఎక్కడా కనిపించదు. ఆ పత్రిక ప్రత్యేకత ఏమిటంటే Psychology applied to life. దాంట్లో నాలుగు విభాగాలుండేవి. వ్యక్తిత్వవికాసం, భార్యాభర్తల సంబంధాలు, అన్యోన్య దాంపత్యం, పిల్లలను పెంచడం ఎలా, ఎలా ఆరోగ్యంగా ఉండాలి. ఈ నాలుగు విభాగాలమీద దృష్టి ఉండేది. వీటిమీద నాలుగు పుస్తకాలు వేశాం కూడా. సి. నరసింహారావు గారి నేతృత్వంలో వస్తుండేది ఆ పత్రిక. అయితే నరసింహారావు గారు అంతర్ముఖుడు. ఆయన ఇల్లు కదలడు. ఒక ప్రయోగం చేయాలన్నా పెద్ద పత్రిక ఎగ్జిక్యూట్ చెయ్యాలన్నా అది సరిపోదు. అప్పుడే నేను ఫిల్మ్ డిస్ట్రిబ్యూషన్ వ్యాపారం ఆపేశాను. ఆ సమయంలో ఆయన నన్ను ఆహ్వానించాడు. నా గురించి ఆయనకు తెలుసు. సినిమా మీటింగ్‌లు, ఫంక్షన్స్ పెట్టేవాణ్ణి. ప్రభ, నటరాజ రామకృష్ణ మరికొందరు సినిమా తారలతో సభలు చేశాను. వార్తా పత్రికలో వాటి గురించి వస్తుండేది. ఇవన్నీ ఆయన గమనించి నన్ను ఆహ్వానించాడు. ఆ పత్రిక మార్కెటింగ్ బాధ్యతలు నాకు అప్పగించేశాడు. ఇంకోటేమిటంటే సైకాలజీ రాసేవాళ్లు దొరికేవాళ్లు కాదు. ఒకే వ్యక్తి రాస్తే స్టేల్ అయిపోతోంది. విషయ వైవిధ్యాన్ని పెంచుదాం అని ఆయనకు సూచన చేసి అలాగే నేను ప్రకటనలు తీసుకొస్తానని ఆయనకు హామీ ఇచ్చాను. ఒక నెలలో 12 యాడ్స్ తెచ్చి చూపించాను. అన్నీ హై ప్రొఫైల్ యాడ్స్. పత్రిక రూపు రేఖలు మార్చాము. ఆరు వేలుండే సర్కులేషన్ ముప్ఫైవేలకు వెళ్లిపోయింది. బోల్డంత డబ్బు వచ్చింది. ఆయనకా డబ్బు మీద ప్రేమలేదు. ఆ డబ్బుతో ఏదో ఒకటి చేయాలి అనుకున్నాం. మాకు మళయాళీ స్నేహితులుండే వారు. మళయాళ మనోరమ లాంటి పత్రికల్లో పనిచేసిన వారు వస్తుండేవారు. వాళ్ల ద్వారా దర్శకుడు 'అరవిందన్' పరిచయం. ఆయనిక్కడ గోదావరి ఒడ్డున షూటింగ్ చేశారు. మన్‌మోహన్‌దత్ అనే పెయింటర్, ఆయన సినిమాకి కళా దర్శకుడు. ఆయన ద్వారా వీరంతా పరిచయం అయ్యారు. అలా ఒక బ్యాచ్‌తో మాకు సంబంధాలుండేవి. వాళ్లకు తెలుగురాదు. ఒక లైన్ కథ రాశాం. "హరిజన్". ఏంటి హరిజన్? ఒక వూరుంది. ఆ ఊరిలో ఇద్దరు స్నేహితులున్నారు. వారిలో ఒకరు హరిజన్, ఒకరు అగ్రకులంవాడు. వాళ్లిద్దరు కాలేజీలో కలసి చదువుకున్నారు. అప్పుడున్న సమాజంలో వీరికి అవకాశాలెలా ఉంటాయి చెప్పడం మా ఉద్దేశం. అగ్రకులం వాడికి ఏ మేనమామో సహాయం చేస్తాడు. ఆ రెండో కుర్రాడు ఊళ్లో చేపలు పట్టుకుంటూ బ్రతకాలి. అదే మేం చూపించాం. ఆ సినిమా అదే పద్దెనిమిది రోజుల్లో షూట్ చేసి దానికోసం ఏవియమ్ చెట్టియార్‌తో మాట్లాడి ముప్ఫై రీళ్లు తీసుకొచ్చి, షూట్ చేసిన దాన్ని మద్రాసు తీసుకెళ్లి మూడునెలలపాటు ఎడిట్ చేసి సినిమా తీసుకొచ్చాను. లక్షా పాతికవేలతో మొదటి కాపీ



*ప్రపంచ యాత్రలో*

ఆయన చేతిలో పెట్టాను. దీనిమీద మూడు లక్షలు సంపాదించాము. సినిమా రిలీజ్ చేయకుండా ఫిలిం క్లబ్బులు వారికి మూడొందలు చొప్పున ఇచ్చాను. నా దగ్గర లిస్టుండేది. లక్ష రూపాయల సబ్సిడీ లభించింది. భవనం వెంకట్రాం గారు ముఖ్యమంత్రి. వారు బాగా తెలుసు మాకు. ఆయన్ని రెండు ప్రింటులు తీసుకోవటానికి ఒప్పించాం. ఆయన 16ఎమ్.ఎమ్. ప్రింటులు కావాలంటే మద్రాసు వెళ్లి తీసుకొచ్చాను. దానికో యాభైవేలు ఇచ్చారు. అయితే 'రేపు' పత్రిక ఆగిపోయింది. ఈ సినిమా తీయటం వలన ఆగిపోలేదు. నేను ఈలోగా రియల్ ఎస్టేట్ వైపు వెళ్లిపోయాను. వారి కుటుంబంలో ఒకదుర్ఘటన జరగటంతో ఆయన హైదరాబాద్ వెళ్లాలని నిర్ణయించుకున్నారు. దాంతో ఆ పత్రిక కథ అలా ముగిసిపోయింది. We parted ways.

***రేపు పత్రిక నడపటంలో ముఖ్యపాత్ర పోషించారు. ట్రావెల్ ఏజెన్సీ నడిపారు. అంతకుముందు సినిమా వ్యాపారం చేశారు. అలా భిన్నరంగాల అనుభవాలతో మీరు నేర్చుకున్నదేమిటి?***

నేను మనుషులను క్షుణ్ణంగా చదివాను. అది నా రచనలకు పనికొచ్చింది. సినిమా వాళ్లు ఎలా ఉంటారు, అలా ఎందుకు తయారయ్యారు, ఎలా మోసం చేస్తారు.. ఒడ్డు నుంచి చూస్తాను కానీ అందులో మునగలేదు నేను. ఆ సినిమారంగంలో అనేక సౌఖ్యాలొస్తాయి కానీ అందులో మునిగి పోకూడదు. నేను అట్లాగే ఉన్నాను. అందుకే ఏ వ్యసనమూ నన్నంటకుండా చూసుకున్నాను. సిద్ధార్థుడికి నాకు అనేక పోలికలు కన్పిస్తాయి. (అక్కడ శ్రమణుడు సిద్ధార్థుడిని వెళ్లకుండా ఆపుతాడు. మంత్రాలను ప్రయోగించి విఫలుడవుతాడు. అలాగే నన్నో హిప్నోటిస్టు నాకు హిప్నోటైజ్ ప్రయత్నం చేస్తానని అడిగాడు. నేను సరేనన్నాను. కానీ అతని హిప్నోసిస్ నా మీద పనిచేయలేదు. మీరు సరెండర్ అయితే చేస్తాను లేకపోతే లేదు. అంటే ఆ స్పృహ ఉన్నవాళ్లని చేయలేరు.) అలా సినిమా వ్యాపారం తర్వాత 'రేపు' పత్రికకు వచ్చాను. సంవత్సరం మాత్రమే ఉన్నాను. రియల్ ఎస్టేట్‌లో జీవిక ఏర్పాటు చేసుకున్నాను. ఆ తర్వాత తిరగటం కోసం ట్రావెల్ ఏజెన్సీ ఏర్పాటు చేసుకున్నాను. పాతికేళ్లు-సిల్వర్ జూబిలీ చేసి ఆపేశాను.

***

***కరోనా కాలంలో చాలా పత్రికలు మూత పడ్డాయి. మిసిమి మాత్రం వస్తూనే ఉన్నట్టుంది.***

కరోనా కాలంలో లాక్‌డౌన్ ఒక నెలలో తప్ప రోజూ వచ్చేవాడిని. కొంతమంది బాపన్న గారికి సలహా కూడా ఇచ్చారు. చాలా పత్రికలు మూత పడ్డాయి కదా. మీరు కూడా మూసేయొచ్చు కదా అని. ఆయన ఆ సలహా వినలేదనుకోండి. ఆ సలహా ఇచ్చారని తెలిసి నేనొక ఎడిటోరియల్ కూడా రాశాను. "కీర్తి కిరీటాలు" అని ఎడిటోరియల్ రాశాను. ఎవరు మిగులుతారు, ఎవరు మిగలరు అని. అదో సాహిత్య చరిత్ర నమూనా!

***పాఠకుల సంఖ్య పెరిగిందా!***

ఖచ్చితంగా పదివేల కాపీలు వేసి పాఠకులకు అందించగలం. కానీ మాకు ఒకొక్క కాపీలో వందరూపాయల నష్టం మిగులుతుంది. అందుకని మా సర్క్యులేషన్ రిస్ట్రిక్ట్ చేసుకుంటుంటాం. మిసిమిలో నాకు బాగా సపోర్టు చేసి నేనడిగింది రాసిచ్చినవారు రావినూతల సత్యనారాయణ గారు. మీరిందాక కరోనా అన్నారు చూశారా ఆ కరోనా కాటుకు బలయిపోయారు. దాదాపు ఏడేళ్లపాటు వారు నేనడిగింది నాకు రాసిపెట్టారు. సాహిత్య అకాడమి పురస్కారం పొందిన వారి గురించి వ్యాసాలు రాశారు. ఎవరికి ఎందుకిచ్చారో మేము చర్చించిన తర్వాత, ఒక పరిశోధన పత్రంలా ఆయన వ్యాసాన్ని రూపుదిద్దేవారు. 'పురస్కార సాహిత్యం' శీర్షికతో పుస్తకరూపంలో వచ్చాయి ఆ వ్యాసాలు. అటువంటి మరో రెండు పుస్తకాలు తెచ్చారు వారు. "వ్యాసమంజూష", మరొకటి "సారస్వత వ్యాసాలు". ఇవికూడా మిసిమిలో వచ్చిన వ్యాసాలే. ఇంకా అవధానం రఘుకుమార్ గారు-వీరు గాంధీ మీద అథారిటీ ఎన్నో వ్యాసాలు రాసారు.

అలాగే ఐపిఎస్ అధికారి కిల్లాడ సత్యనారాయణ

# ‘మిసిమి’తో ప్రయాణం...

***మిసిమి పత్రికకు పుష్కరకాలంగా సంపాదకులుగా ఉన్నారు. మిసిమి పత్రికలో మీ జర్నీ ఎలా మొదలయింది?***

మిసిమి ఎడిటర్ కాకముందు, మిసిమికి నేను రాస్తుండేవాడిని. ఆలపాటి రవీంద్రనాథ్ గారితో నాకు పరిచయముండేది. నన్ను బాగా గౌరవించేవారు. ఆయన చనిపోయినప్పుడు ఆయన స్మృతి సంచిక ఆవిష్కరణకు వచ్చాను. అప్పుడు వెంకటేశ్వర రెడ్డి గారు ఎడిటర్ అయ్యారు. ఐపిఎస్ అధికారి ఆంజనేయరెడ్డి గారికి మిసిమి పత్రిక మీద చాలా ఆసక్తి ఉండేది. ఆయన రవీంద్రనాథ్ గారబ్బాయి బాపన్న గారికి బాగా సన్నిహితులు. ‘మిసిమి’ రూపురేఖలు మారుద్దామని బాపన్న గారికి చెప్పటం. ఆయన సూచనతో ఒక సమావేశాన్ని పెట్టడం జరిగింది. ఆ సమావేశంలో నేను, ఆంజనేయరెడ్డి గారు, బాపన్నగారు, లక్ష్మీరెడ్డి గారు, జితేందర్ గారు, కాండ్రేగుల నాగేశ్వర రావు గారు ఇంతమంది పాల్గొన్నాం. దీనికి ఫుల్ టైం ఎడిటర్ కావాలి. వెంకటేశ్వర రెడ్డి గారు వెళ్లిపోతు న్నారు. మిగిలిన వారందరికీ ఎవరి వ్యాపకాలు వాళ్లకున్నాయి. అందరూ నా వంక చూశారు. “నీకు ఇంతకు ముందు అనుభవం ఉంది కదా” అన్నారు. నేను రెండు కండిషన్స్ పెట్టాను. ఒకటి మిసిమికి విడిగా ఒక ఆఫీసుండడం. నాకు కొంతమంది స్టాఫ్ కావాలి. నేను ఐదారు డమ్మీలు వేస్తాను. మీరు చూడండి. ఏది నచ్చితే దాన్ని సెలక్టు చేద్దామని చెప్పాను. ఒప్పుకున్నారు. ఇలా ఫిబ్రవరిలో ఆ మీటింగ్ జరిగింది. ఫిబ్రవరి నుంచి జూన్ దాకా పది డమ్మీలేశాను. పత్రిక సైజ్ మార్చాలని కూడా అనుకున్నాం. దానికి సంబంధించి టెక్నికల్ టీంను కూడా సంప్రదించాను. అరవై పేజీలకు పెంచాలని కూడా నిర్ణయించాం. ఇక ఎలాంటి వ్యాసాలు వేయాలో కూడా నా ఆలోచన చెప్పాను. అప్పటికి రవీంద్రనాథ్‌గారు వ్యవస్థాపక సంపాదకులుగా సైకాలజీ, ఫిలాసఫీ అంశాలపై వ్యాసాలు వేస్తుండేవారు. ఐరావతీ కార్వే భారతం వేశారు. కథలు, కవితలు వేయకూడదన్న నియమం వారి నుంచి వచ్చింది. ఆ రకమైన ధోరణి పత్రిక సంపాదకులను ఆకర్షించింది. వెంకటేశ్వర రెడ్డి గారు తరువాతి సంపాదకులు. రవీంద్రనాథ్ గారితో ఎంతో సన్నిహితం ఉంది వారికి. అయితే ఆయనకు బౌద్ధం అంటే ఇష్టం ఉన్న కారణంగా పత్రికను బౌద్ధం వైపు మళ్లించడం. బౌద్ధమత ప్రచార పత్రిక అని ముద్ర పడటం ఆ కాలంలో కొంచెం ఇబ్బంది. దానిపై మార్పు తీసుకురావలసిన అవసరం ఏర్పడింది. అప్పుడు నూతన పంథాలో పత్రికను నడపాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. అందుకు సాంఘికచరిత్ర, చరిత్ర, చిత్రకళ సంగీతం, నాట్యం ఇలా ఇలా మిసిమిని ఒక సారస్వత పత్రికగా, ఒక చింతనాత్మక పత్రికగా నడపాల్సిన అవసరాన్ని అందరూ గుర్తించారు. పాఠకుడికి ఆ వ్యాసం అతనిలో ఒక మేల్కొలుపు అవుతుంది. పాఠకుడు అన్వేషణ మొదలుపెడతాడు. పది ముఖ చిత్రాలలో పలు డమ్మీలు వేస్తే ప్రముఖ చిత్రకారులు కాపు రాజయ్య గారి చిత్రం. ముఖచిత్రంగా 2010 జూన్‌లో కొత్త హంగులతో మిసిమి పాఠకులకు చేరింది. నేను ఎడిటర్‌గా చేరినప్పుడు మాకు రచయితలు పరిమితంగా ఉండేవారు. ఈ రచయితలను మిసిమి దృక్పథానికి అనుకూలంగా మార్చుకున్నాం. అట్లా కొంతమంది రచయిత లేర్పడ్డారు. ముక్తవరం పార్థసారథి, పురుషోత్తమాచార్య, లేట్ రావినూతల సత్యనారాయణ గారు, కిల్లాడ సత్యనారాయణ గారు. ప్రొ. లక్ష్మీ అయ్యర్ ఇలా కొంతమంది రచయితలను గుర్తించి వారిని మీరు ఇది రాస్తే బావుంటుందని సూచించటం, వారు అంగీకరించటం జరిగింది. పాత ధోరణిలో నుంచి బయటపడి పత్రికను పునరుజ్జీవింపచేసే




ప్రయత్నం చేశాను. Renaisance of Misimi అని అనవచ్చు (నవ్వు). ఈ పదేళ్ల కాలంలో వందమంది రచయితల్ని నేను గుర్తించగలిగాను. దీనివలన వ్యాసాలకు కొరవలేదు. రచయితలు పెరిగారు. వైవిధ్యత పెరిగింది. రచయితలకు మనమీద నమ్మకం పెరిగింది. పప్పు వేణుగోపాల రావు, పురుషోత్తమాచార్య, ప్రొ. పార్థసారథి, ముంగర జాషువా, ఎందరో రచనలు... పత్రికకు క్వాలిటీ రచయితలే కాదు, క్వాలిటీ పాఠకులుండడం కూడా ముఖ్యం. మిసిమి ఆ ఘనతను సొంతం చేసుకున్నది. అలా ఒక దారికి తీసుకొచ్చాం. మేధోపరమైన శ్రమతోపాటు, వనరులా ఉండాలి. దానికి మేనేజ్‌మెంట్ సపోర్టు, సహకారం లభించాయి. ముఖ్యంగా బాపన్న గారినుంచి దొరికిన సహకారం వెలకట్టలేనిది. నాకు ఏదీ కొరత రానివ్వరు. మిసిమి స్వేచ్ఛాయుత వాతావరణంలో కొనసాగుతున్నది.కావలసిన వనరులు మా బాపన్నగారు సమకూరుస్తున్నారు. స్టాఫ్ ఇద్దరో, ముగ్గురమో ఉన్నా టెక్నికల్ సపోర్ట్ ‘కళాజ్యోతి’ నుంచి లభిస్తోంది. ఇప్పటి వరకు నా ఆధ్వర్యంలో 144 సంచికలు వెలువడ్డాయి. ప్రతి సంచికా నాకు పరీక్షే. పాఠకులే నాకు ఎగ్జామినర్స్. ‘మిసిమి’ పాతికేళ్ల పండగ చేసాం. వందల మంది పాఠకులు 4 గంటల ుగా పాల్గొన్న సభ అది.గొల్లపూడి, బేతవోలు ప్రముఖులు వచ్చారు అది యూట్యూబ్‌లో వుంది చూడండి.

***పాఠకులు ఈ మార్పులను ఎలా రిసీవ్ చేసుకున్నారు.***

చాలా బాగా రిసీవ్ చేసుకున్నారు. మాకు చాలా ఉత్తరాలు వస్తాయి. పాఠకులు కూడా టెక్నాలజీ వాడుకుంటున్నారు. వాట్సాప్ ద్వారా తమ అభిప్రాయలు పంపిస్తున్నారు. మెయిల్‌లో పంపిస్తున్నారు. ఫోన్‌లో అభినందనలు ఎలాగూ ఉన్నాయనుకోండి.



*శ్రీ బాపన్న–మిసిమి కర్త, కర్మ, క్రియ*



*శ్రీ ఆంజనేయరెడ్డి – మిసిమి మెంటర్*



కోడలు సౌ. అర్చన, కొడుకు చి. కళ్యాణ్, భార్య సౌ. జయంతి, మనుమరాలు చి. అనన్యతో



కూతురు సౌ. కవిత, మనుమడు చి. అంకిత్ జామాత చి. సతీష్ బాబు

*నా జీవితంలో... రెండోపార ఏమిటంటే భార్య, సంతానం.. కుటుంబం. నా వ్యాపకాలన్నీ నా మనోధర్మంతో పాటు నడిచాయి. నా మనసుకు ఏది ఇష్టమో అదే చేశాను. ఇష్టంలేని పని ఏనాడు చేయలేదు. ఇన్ని పనులు చేసేందుకు నా కుటుంబం నన్ను అడ్డుకోలేదు. అదిచాలు కదా!*

గారు. వారుకూడా మిసిమికి ఏ వ్యాసాలు కావాలంటే అవి రాస్తారు. వారు చిత్రకూట్ బదిలీమీద వెళ్లారు. చిత్రకూటం మీద వ్యాసాలు రాశారు. వారణాసిలో ఉన్నప్పుడు వారణాసికి సంబంధించి అనేక వ్యాసాలు రాశారు. ఇప్పుడు లక్నోలో ఉన్నారు. లక్నో సంస్కృతి గురించి రాస్తున్నారు. అలాగే లక్ష్మీ అయ్యర్‌గారు రాజస్థాన్ సెంట్రల్ యూనివర్శిటీలో హిందీ ప్రొఫెసర్‌గా ఉన్నారు. వారు మీరాబాయి, కబీర్ మొదలయిన వారి గురించి రాశారు. ఇప్పుడు జైపూర్ చరిత్ర రాస్తున్నారు. ఇవన్నీ ఎవరు రాస్తారు చెప్పండి. ఇప్పుడు రాంబాబు గారు మీరున్నారు మీతో ఇంటర్వ్యూలు రాయించాను. నేను ఇంటర్వ్యూలు చేసినా మీరు రాయకపోతే అవి ప్రచురణకు వచ్చేవి కాదు. ఒక్కోసారి మీరు రాసింది చదివిన తరువాత ఇవి మనం చేసిన ఇంటర్వ్యూలేనా అని ఆశ్చర్యపోతాను. అలా నా అదృష్టమె, పాఠకుల అదృష్టమో మంచి మంచి రచయితలు పాఠకులు మిసిమికి లభించడం మిసిమి ఇంత వర్ణమయంగా ఉండటానికి కారణం మీ అందరి ప్రోత్సాహమే. ఆచార్య పప్పు వేణుగోపాలరావు నాట్యశాస్త్రం– తెలుగుతల్లికి అలంకారం! పురుషోత్తమాచార్యులు మిసిమి కోసం రాసిన రచనలకు జాతీయ పురస్కారం పొందారు (సంగీత విశ్లేషణ).

***సాహిత్యానికి పాఠకుల ఆదరణ తగ్గిపోతోందని కవులు, రచయితలు వాపోతున్నారు కదా. మీ అభిప్రాయమేమిటి?***

మనం సాహిత్యం అని దేనినంటాం. సమాజానికి హితం చేకూర్చేదనే కదా. ప్రతి దానిని సాహిత్యం అంటున్నాం. సినిమా పాటను కూడా సాహిత్యం అని అంటున్నాం. సాహిత్య పత్రికలు ఆగిపోయాయి అంటున్నారు. ఆగిపోయిన పత్రికలలో సాహిత్యం ఏముంది? ఆగిపోయిన పత్రికలు సాహిత్య పత్రికలేనా? అందులో వచ్చే కథలు, నవలలు సాహిత్యమా.

***ఇది రెండు రకాలుగా ఉంటుంది. పాఠకులు తేలికగా ఉండే కథలు, నవలలు చదువుతారు. వాళ్లు సీరియస్ రీడర్స్ కాక పోవచ్చు. కాలక్షేప సాహిత్యం అని పేరు పెట్టారు.***

దాన్ని నేను సాహిత్యంగా ఒప్పుకోను. ప్రతి దానికి ఒక కాల పరిమితి ఉంటుంది. కమ్యూనిస్టు ప్రపంచం డెబ్భై ఏళ్లకు కూలిపోయింది. పత్రికలు ఆగిపోవడం క్రొత్త విషయమేమీ కాదు. ఆంధ్ర పత్రిక ఆగిపోయింది. భారతి ఆగిపోయింది. ఆంధ్రజ్యోతి ఆగిపోయింది. 'యువ' కూడా, చందమామ, అంతకుముందు ఆనందవాణి ఆగిపోయింది. కాబట్టి పత్రికలు ఆగిపోయాయని బాధపడాల్సిన పని లేదు. ఉన్న పత్రికలు ఎలా కాపాడుకోవాలో ఆలోచిద్దాం. ఇది మన భాషే కాదు, అన్నిచోట్ల జరుగుతుంది. రచయితలకు బాధ ఉంటుంది. వారి రచనలకు ఒక వేదిక అందుబాటులో లేదని ఇప్పుడు మిసిమి ఒకటే మిగిలింది. అయితే ఇందులో అందరికీ ప్రవేశం లేదు. ఇప్పుడు తెలుగు ఏదో అయిపోతోంద ని భాషోద్యమం బయల్దేరింది. తెలుగుకు వచ్చిన ఇబ్బందేమీ లేదండి. ప్రజలు మాట్లాడినంత కాలం ఏదో ఒక రూపంలో తెలుగు ఉంటుంది. అయితే మనం కోరుకున్న రూపంలో అది ఉండకపోవచ్చు.

***చదివేవాళ్ల సంఖ్య గురించి ఆలోచించాలి కదా!***

తెలుగు పాఠకులను ఒకసారి విశ్లేషిద్దాం. మీరు అరవై ఏళ్లు వెనక్కి వెళితే, రైల్వేస్టేషన్‌లో కొవ్వలి నవలలు అమ్మేవారు. అర్ధరూపాయికి అమ్మేవారు. ఆయన వెయ్యి నవలలు రాశారు. వాటి పాఠకులు ఎవరు! రైల్లో ప్రయాణించేవారు అంటే సామాన్యులు. మీరు సామాన్యులను చేరితే పాఠకుల ఆదరణ ఉంటుంది. కానీ పండితులకు సామాన్యులు చేరటం ఇష్టముండదు. వాళ్ల పాండిత్యం పోతుందనో, లేకపోతే వీళ్ల పాండిత్యం వాళ్లకు వస్తుందన్న భయమో తెలీదు. అదొదిలేయండి కొవ్వలి తర్వాత పాఠకాదరణ లేదా? ఆ తర్వాత రీడర్‌షిప్ తెలుగు వార పత్రికలకు వచ్చింది. ప్రభ, పత్రిక, జ్యోతి, అందిపుచ్చుకున్నాయి. సీరియల్స్‌ని రచయిత్రులు రాయటం మొదలపెట్టారు. ఆ తర్వాత ఈనాడు దినపత్రిక పాఠకుల సంఖ్యను గణనీయంగా పెంచింది. న్యూస్‌పేపర్ తెలుగు వారికి అలవాటుగా మారింది. ఆరింటికల్లా పేపర్ అందుబాటులోకి వచ్చింది. ఆ తర్వాత స్వాతి సరసమైన కథలతో ఇంకోరకం రీడర్‌షిప్ పెంచింది. మధ్యలో ఆంధ్రభూమి తన సీరియల్స్‌తో ఒక రకమైన రీడర్‌షిప్ పెంచింది. మా రీడర్స్ ఎవరు.. "Senior Serious, Enlightene ఇంకా నేర్చుకోవాలనుకునేవారు. కాబట్టి అన్ని రకాల పాఠకులు మనకున్నారు దాని వలన తెలుగుకు వచ్చిన ఇబ్బంది లేదు.

***చాలామంది చెప్పేదేమిటంటే తెలుగు మీడియంలో పిల్లలు చదవటం లేదు కాబట్టి, తెలుగులో చదవటం, రాయటం అలవాటు తప్పిపోతోందని.***

ఇప్పుడు తెలుగు అవసరం తగ్గిపోయింది. ఇంగ్లీష్ వర్కింగ్ నాలెడ్జ్ వచ్చు కాబట్టి ఇంగ్లీషు వైపే మొగ్గుతున్నాం. ఇంగ్లీషు రానివాళ్లు అంటే చైనా, జపాన్, కొరియా దేశస్థుల భాషలో ఇంగ్లీషు పదమే ఉండదు. వాళ్లు లోకల్ కీ బోర్డ్స్ తయారు చేసుకున్నారు. అదే భాష అంటే వారి భాషే వాడుతున్నారు. మనకు ఇంగ్లీషులో పరిచయం ఉండడం వలన ఇంగ్లీషు కీబోర్డ్స్ వాడుతున్నాం. ఇంగ్లీషు పదాలే

వాడుతున్నాం. దానివలన కొంపలు ముంచుకు పోయేదేమీ లేదు. పదిమందికి ఉద్యోగాలు వస్తే చాలు. దానివలన తెలుగేమీ చచ్చిపోదండీ. దీన్ని మళ్లా తెలుగులోకి మార్చి, ఆదీ రాక, ఇదీ రాక తిప్పలు పడటం ఎందుకు. తెలుగు భాష రెండు వేల సంవత్సరం నుంచి ఉంది. మీరు ముప్పై ఏళ్ల తర్వాత తెలుగు ఉంటుందా అని కంగారుపడితే ఎలా? రెండువేల సంవత్సరాల క్రితం ఇప్పుడున్నట్టు లేదు కదా! అలాగే భవిష్యత్తులో ఇప్పుడున్నట్లు ఉండకపోవచ్చు. అంతే అయితే అప్పటికవసరమయి నట్లు మార్పులు చేసుకుంటారు. కానీ భాషను వదిలిపెట్టరు.

***తెలుగుకి సంబంధించి, తెలుగు సాహిత్యానికి సంబంధించి మరో ప్రశ్న. మన వాళ్లకు తెలుగు సినిమాలు కావాలి. తెలుగు సీరియల్స్ కావాలి. తెలుగు వెబ్‌సిరీస్ కావాలి కానీ తెలుగు పుస్తకాలు అక్కర్లేదు అన్న ధోరణి చాలా ప్రబలంగా ఉందని అందరి అనుమానం.***

మనం పగలంతా పనిచేస్తాం. అలసిపోతాం. ఇంటికి వెళ్లగానే పుస్తకం పట్టుకు కూర్చోం కదా. కాస్త వినోదం కావాలనుకుంటాం. అందులో తప్పులేదు. టీవీ చూస్తారు. క్రికెట్ చూస్తారు. ఫరవాలేదు ఆదివారం వచ్చినప్పుడు పుస్తకం చదువుకోండి. ప్రయాణంలో పుస్తకం చదువుకోండి. కానీ సాయంత్రం వెళ్లగానే పుస్తకం పట్టుకోవలని అనుకోకండి. చదవటం, నోట్సు రాసుకోవటం ఈ స్పీడు యుగంలో తగ్గిపోతున్నాయి. మన శరీరంలో బ్రెయిన్‌లో రిలీజ్ అయ్యే 'డోపమెన్' కష్టపడకు, రిలాక్స్ అవమని సంకేతాలిస్తుంటుంది. అలా ఎవరి డోపమెన్ వారికుంటుంది. దీన్ని Detoxyfy తగ్గింప చేయటానికే పుస్తకాలు వచ్చాయి. ట్రావెల్‌లో మొబైల్ చూడటం కాదు. పుస్తకం చదవండి చాలు. నేనొక సారి ఎడిటోరియల్ రాశాను. ఎక్కువ శాతం మంది సినిమా చూడటానికో, క్రికెట్ వీక్షించటానికో ఇష్టపడుతున్నారు. ఈ రెండు అన్‌ప్రొడక్టివ్. నిజంగా మనం అంత ధనికులమా ఈ రెండు చూసి గడపటానికి. యువత ఎంత పని చేయాలి, ఎంత హుషారుగా ఉండాలి అట్లాంటి యువత సినిమాహాల్ల చుట్టూ, క్రికెట్ స్టేడియం చుట్టూ తిరుగుతూ గడిపేయటం. దేశానికి ఎంత నష్టం. దాన్ని అందరూ ఇంకా ఇంకా అని ప్రోత్సహించటమేమిటి; కేవలం డబ్బు సంపాదనే పరమార్థమా అని ప్రశ్నిస్తూ రాసిన ఎడిటోరియల్ అది. ఓ రష్యన్ అడిగాడు – ప్రొద్దున్నే సినిమాలు ఏమిటని?

***మీలో రచయిత, కవి, పర్యాటకుడు, అనువాదకుడు – ఇలా ఇంతమందున్నారు! మీ జీవిత కాల వ్యాపకాలకు వీటికి సంబంధమున్న దా? ఇంకో ప్రశ్నేమిటంటే మీలోని సృజనకారుడికి, మీలోని వృత్తికారుడికి***

***సామరస్యం కుదిరిందా! వైరుధ్యాలున్నాయా!***

నా రచనా వ్యాసంగం ద్వారా నన్ను నేను వ్యక్తీకరించుకునే ప్రయత్నం చేశాను. నా అనుభవాల ను కథలుగా చెప్పాను. నా గోడు చెప్పుకోవానికి కవిత్వాన్ని ఆసరా చేసుకున్నాను. నేను చూసిన ప్రపంచాన్ని నాతోటివారికి పరిచయం చేసేందుకు యాత్రా రచనలు చేశాను. వీటిల్లోంచి ఏ ఒక్కటి ఎవరిని రంజింప చేసినా నా ప్రయత్నం నెరవేరింది అనుకుంటాను.

ఇక సామరస్యం లేదా వైరుధ్యం గురించి అడిగారు. నేను నా జీవనగమనాన్ని నడపటానికి నాదైన మార్గం ఎంచుకున్నాను అనుకున్నాను. నేనిక్కడిదాకా వచ్చానంటే వైరుధ్యాలుంటే రాలేను. వైరుధ్యాలు లేవు కాని ఘర్షణ ఉంటుంది. ఆ ఘర్షణ ఎక్కడ తగ్గుండాలో నేర్పిస్తుంది. ఎక్కడ నెగ్గాలో చెబుతుంది. మనకున్న సంఘర్షణలోంచే మన శక్తియుక్తులు బయటికి వస్తాయి.

***సుదీర్ఘ మీ జీవనయానం సంతృప్తికరంగా ఉందా? వీటిలో బతికిన క్షణాలు ఎన్ని?***



***యాత్రా రచయిత ఆదినారాయణతో...***

నేను ప్రతిక్షణం ఆనందంతో గడపటానికే ప్రయత్నిస్తాను. గతం గురించి పెద్దగా ఆలోచించను. రేపటి గురించి పెద్దగా ఆందోళన చెందను. ప్రణాళికలుంటాయి గానీ ఎక్కువ మథనపడను. ఈ క్షణంలో ఏం చేయాలన్నదే నాకు ముఖ్యం. ఏం చేస్తే ఇబ్బంది పడతాం అన్న ఎరుకతో, అన్న సమన్వయంతో నడవటమే నాకిష్టం. వర్తమానమే ముఖ్యం. ఒకసారి రాసిన ఎడిటోరియల్‌లో అదే ప్రస్తావించాను. దాని శీర్షిక "మనం వర్తమానంలో జీవిస్తున్నామా" జీవించటం అవసరమని చెప్పటమే నా ఉద్దేశం. కానీ మన సాహిత్యం కానీ, మన కళలు గాని వర్తమానంలో లేవు. గతంలో ఉంటాయి లేదా భవిష్యత్తువైపు చూస్తాయి. ఎందుకలా జరిగిందో / జరుగుతోందో నాకర్థం కాదు. "కథలెందుకు" అనే వ్యాసంలో నేను చెప్పాను. మంచి కథలు దారి చూపుతాయి. కథ వర్తమానంలో ఉంటే అవి హెచ్చరిక చేస్తుంది. రాబోయే పరిస్థితులను ఎదుర్కొనేందుకు కథలు మనలను సిద్ధం చేయాలి. కానీ మనం అలా చేస్తున్నామా! ఇది నా ప్రశ్న.

ఇవాల్టికి భారతం బతికుంది. ఎందుకని వాళ్లెప్పుడో చెప్పారు ఈ పరిస్థితి ఇలా వస్తే ఇలా చేయాలి అని. దాంట్లోని ఉపకథలన్నీ నీతి వాక్యాలే. ఇలా ఉంటే నువ్వు సుఖంగా ఉంటావని చెప్పేవే.

***మీ జీవనయానం బహు ముఖమయింది కదా! మీ స్వీయ చరిత్ర రాశారా! ఆ ప్రయత్నం ఎంతవరకు వచ్చింది?***

ఇన్ని రాసినవాడిని స్వీయచరిత్ర రాయటం పెద్ద కష్టమేమీ కాదు. కానీ ఏ పుస్తకం మనం ప్రచురించినా దాని టార్గెట్ ఆడియన్స్ రీడర్స్ ఎవరో గమనించాలి లేకపోతే ఆ రచన రచయితకే పరిమితం అవుతుంది. బయటికి వెళ్లదు. బయటకు వెళ్లని రచన మనం ఎందుకు చేయాలి, తెలిసి కూడా... సెలబ్రిటీ జీవితాలను చదువుతారు. మనం సామాన్యులం. అది ఎవరికి పనికొస్తుంది. పనికిరావొచ్చు, పనికి రాకపోవచ్చు. కానీ దాని దాకా వెళ్లేదెవరు. ఫలానా అశ్వినీకుమార్ ఆత్మకథ వస్తే ఎగబడి కొనేవాళ్లు ఎవరూ ఉండరక్కడ. సెలబ్రిటీలకు మాత్రమే స్వీయచరిత్రలు పరిమితం అయిపోయా యి. దాంట్లో తప్పుకూడా లేదు. మనం చదివినా కూడా అవే కదా! అందుకని మనం సెలబ్రిటీయో కాదో ప్రశ్న వేసుకోవాలి కదా (నవ్వు). varied life, wide convas లాంటి పడికట్టు పదాలు వాడుతుంటాం. నా జీవితం ఎవరికయినా ఆదర్శ మవుతే వాడు నాలాగా ఆనందంగా బతకగలడు (నవ్వు). ఇప్పటి రోజుల్లో డబ్బు సంపాదించటమో వ్యాపకం. డబ్బు సంపాదించిన తర్వాత అధికారం కావాలి. అధికారముంటే డబ్బు కావాలి అదొక విషియస్ సైకిల్ అందుకే కీర్తి, కనకాల వెంట మనం పరిగెత్తకూడదు. కీర్తి, కనకాలు మన వెనక రావాలి గానీ, మన ముందుండకూడదు. ముఖ్యంగా సృజనకారుల్లో ఈ అవగాహన లేకపోతే నిరాశపడతారు. మనం పని నిబద్ధతతో చేయాలి. అట్లాగే ఆ నిబద్ధత మీరు ఒప్పుకున్న పని చేయటంలో ఉండాలి. సృజనలోను ఉండాలి. నా జీవనయానంలో నేను చాలామంది ప్రముఖులను కలిశాను. రాష్ట్రపతిగా ఉన్నప్పుడు సంజీవరెడ్డిగారిని కలిశాను. వారి ఆతిథ్యం పొందాను. ఎన్.జి. రంగా గారితో వారంరోజులు ఆయన క్వార్టర్‌లో ఉన్నాను. ఆయన లైబ్రరీలో చదువుతూ ఆయనతో గడిపాను. యాభై సంవత్సరలపాటు పార్లమెంట్ సభ్యులుగా ఉన్నారు. మునిరత్నంనాయుడు, రాజగోపాలనాయుడు,

ఎన్.టి. రామారావు, శివాజీ గణేశన్, బి. నాగిరెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణన్, జెమినీ గణేశన్, రాజ్‌కపూర్, హోమీవాడియా, అక్షయకుమార్, బాబీడియోల్, దర్శకుడు వి. మధుసూదన రావు, దాశరథి, నార్ల వెంకటేశ్వర రావు, భానుమతి, కె.ఆర్. విజయ, జమున, భవనం వెంకట్రామ్, యడ్లపాటి వెంకట్రావు, మర్రి చెన్నారెడ్డి, అక్కినేని నాగేశ్వరరావు, మొక్కపాటి వెంకటేశ్వర రావు, వసంత నాగేశ్వర రావు, యలమంచిలి శివాజీ; రేలంగి, రాజబాబు, హరనాథ్, చంద్రమోహన్, బి. నరసింగ రావు, కె.ఎల్.ఎన్. ప్రసాద్, కొత్త సచ్చిదానందమూర్తి, చాట్ల శ్రీరాములు, ఎ.ఆర్. కృష్ణ, హీరో కృష్ణ, ఇక రచయితల్లో కారా మాస్టారు, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, రావిశాస్త్రి, వడ్డెర చండీదాసు, పెద్దిభట్ల, ఛాయాదేవి, నరిశెట్టి ఇన్నయ్య, లత, వాకాటి పాండురంగారావు, మాలతీ చందూర్, ఎన్.ఆర్. చందూర్, కొ.కు. పాలగుమ్మి పద్మరాజు, భమిడిపాటి జగన్నాథరావు, అబ్బూరి ఛాయాదేవి, వి. రాజారామ్మోహన రావు,.. ఇక కవుల్లో కృష్ణశాస్త్రి, వేటూరి, ఆత్రేయ, సినారె, గోపి, కలవడమంటే హలో అని పలకరించటం కాదు వారితో చర్చల్లో పాల్గొన్నాను. ఇంటర్‌యాక్ట్ అయ్యానని అర్థం. నేను కలసిన మేధావులు పన్నాల సుబ్రహ్మణ్య భట్టు, పతంజలి శాస్త్రి, త్రిపుర, సంజీవ దేవ్... వీళ్లందరితో


మనుమరాలు అనన్యతో...

కలగా పులగమై తిరిగాను. దాని ప్రభావం ఖచ్చితంగా జీవితంపై ఉంటుంది. ఇక పండితుల్లో బేతవోలు రామబ్రహ్మం గారు, యార్లగడ్డ బాల గంగాధర రావు గారు.నేను ఆనందంగా ఉండటానికి మానసికంగా సమతుల్యంగా ఉండ టానికి, లౌకిక ప్రపంచం లోటుపాట్లు సరి చూసుకోవటానికి నేను చదివిన పుస్తకాలు నాకు తోడ్పడ్డాయి. నేను కలసిన వ్యక్తుల ప్రభావం లేకపోతే నేను ఇంత బ్యాలన్స్‌డ్‌గా ఉండేవాడిని కాదేమో!

రెండోపార్శ ఏమిటంటే భార్య, సంతానం.. కుటుంబం. నా వ్యాపకాలన్నీ నా మనోధర్మంతో పాటు నడిచాయి. నా మనసుకు ఏది ఇష్టమో అదే చేశాను. ఇష్టంలేని పని ఏనాడు చేయలేదు. ఇన్ని పనులు చేసేందుకు నా కుటుంబం నన్ను అడ్డుకో లేదు. అదిచాలు కదా! అలాగే నేను వాళ్లని ఇబ్బంది పెట్టలేదు. వాళ్లు కూడా నా పరిమితులేమిటో తెలుసుకోగలిగారు. డబ్బు మూటలు ఇవ్వలేదు కానీ ఏ లోటూ రానివ్వలేదు. నా మనోధర్మానికి అను కూలంగా ఉన్న వ్యాపకాలకీ నా జీవితానికి ఎటువంటి సంఘర్షణ లేదు. ఎందుకంటే ఆ రెండు అద్వైతమే (నవ్వు).

***మీరు కేవలం సముద్రాన్ని చూడటానికి రెండు సంవత్సరాలపాటు విశాఖపట్నంలో ఉన్నారని విన్నాను! నిజమేనా?***

ఎడారిదారి అని ఒక పోయం రాశాను. అందులో ఎడారులు, సముద్రాలు, అడవులు, నన్ను ఎంత ఆకట్టుకుంటాయో చెప్పాను. నాకు పదహారేళ్ల వయసప్పుడు కొత్తగూడెం వెళ్లాను. మా అక్క అక్కడుండేది. అప్పటి కొత్తగూడెం, ఇప్పుడు కొత్తగూడెం కాదు. ఏమీలేదిప్పుడు అక్కడ. బెజవాడలో రైలెక్కి డోర్నకల్ చేరి రాత్రి అక్కడుండి మళ్లా అక్కడినుంచి ఇంకో పొగబండెక్కి చేరాలి. అలా నేను కొత్తగూడెం వెళ్లినప్పుడు అక్కడ ఒక అడవిలోకి ప్రయాణించాను. దారి తెలీదు. చెట్లున్నాయి కానీ కారడవి కాదు అలా నడుచుకుంటూ వెళ్లిపోయాను. అక్కడ నాకొక సంఘటన జరిగింది. ఏం జరిగిందో తెలీదు. భౌతికంగా అక్కడ వున్నాను. కానీ దూరంగా ఒక కొండ వుంది. ఆ కొండమీదకు వెళ్లిపోయాను. అక్కడ కొండ కానుకుని మబ్బులున్నాయి. చాలాసేపు అక్కడ కూచుని వచ్చేశాను. అక్కడ ఎటువంటి శబ్దాలు లేవు. నేనక్కడికి ఎలా వెళ్లగలిగాను, మళ్లా కిందకి ఎలా రాగలిగానో అర్థం కాలేదు. ఇది కేవలం అడివే చేసిందా! లేకపోతే నేను భ్రమ పడ్డానా తెలీదు. కానీ నా మీద చాలా ప్రభావం చూపింది. అసలే మానసికంగా నేనో సన్యాసిని. హైస్కూల్‌లో ఉండగానే మానసికంగా సన్యాసినయిపోయాను. లౌకికంగా నాది అందరిలాంటి జీవితమే. ఆ సన్యాసి భావనను ఇలాంటి సంఘటనలు మరింత పెంచాయి. అలాగే నేను హరిద్వార్ వెళ్లినప్పుడు, ఋషికేష్ వెళ్లినప్పుడు గంగలో పాదాలుంచినప్పుడు, నేను గంగలో లేను. ఎక్కడో ఉండేవాడిని. అట్లా నన్ను విడదీసి చూసుకునేవాడిని. అలా చూసుకునే శక్తి, నాకుండేది. నేను నీళ్లలో ఉన్నాను, ఒడ్డునుంచి చూసుకునేవాడిని. అది ఎందుకొచ్చింది ఎలా వచ్చిందో తెలీదు. నాలో ఒక సన్యాసి ఉండడం వలన అలా చూడగలిగాను. ఒక సన్యాసి, ఒక సన్యాసిని చూడగలడు (నవ్వు). ఇలాంటిదే మరో సంఘటన. నేను అరబ్ దేశాలు వెళ్లినప్పుడు ఎడారిలో అలా నడుచుకుంటూ వెళ్లిపోయాను. దారి తప్పాను. దారి చూపేందుకు ఎవరూ మనుషులుండరు. నీళ్లలేవు. పగటిపూట నడిచాను. సూర్యాస్తమయం సమయం... చాలా చిన్నగా ఉన్నాడు సూరీడు. మనకు కనిపించే ఎర్రటి బింబం కాదు చిన్న బింబం.. మనకేమో పెద్దగా కనిపిస్తాడు. చుట్టూ చెట్లు, పెద్దగా ఉన్నాడని భ్రమింపచేస్తాయని తెలిసింది. అక్కడ, ఇక్కడ సూర్యుడి బింబం ఒకటే. పోల్చటానికి ఇక్కడ చెట్లు, ఆకాశంలో పక్షులు, మబ్బులూ ఉన్నాయి. అక్కడేమీ లేవు. ఇంత పెద్ద ప్రపంచంలో మన ఉనికేమిటి అన్న ప్రశ్న వచ్చింది. ఎవరయితే ప్రశ్నించుకుంటారో వారికి అహంకారం ఉండదు. ఇవన్నీ మనం ట్రావెల్ చేస్తే మనకు పోతాయి. ఆ అహంకారం పటాపంచలవుతుంది. అలాంటిది ఇంకో అనుభవం చెబుతాను. నేను దుబాయినుంచి బాంబే క్రూయిజ్‌లో వస్తున్నాను. ఆ క్రూయిజ్‌లో సినీనటులు అక్షయకుమార్, బాబీడియోల్ లాంటి నటులు కూడా ఉన్నారు. అందరం కలిసి ఉండేవాళ్లం. బాంబే వస్తే మారిపోతారు కదా! షిప్‌లో అందరూ ఒకటే. వాళ్లు మామూలు మనుషులే. నేను డెక్‌మీద కూర్చునేవాడిని. ఇద్దరు ముగ్గరమ్మాయిలు పుస్తకాలు పట్టుకుని కూర్చునేవారు. వాళ్లెవరంటే రాత్రిపూట డాన్స్ షోలు ఉండేవి. ఈ పిల్లలు ఆ డాన్స్ షో పిల్లలు. వాళ్లు స్టూడెంట్స్. అదనపు సంపాదన కోసం ఈ డాన్స్‌షోలు ప్రదర్శనలిస్తుండేవారు. వాళ్లతో మాట్లాడుతుంటే బోలెడు కబుర్లు చెప్పేవారు. అది షిప్. ఆ కెప్టెన్ మాకు ఒక రాత్రి డిన్నర్ ఇచ్చాడు. అది ఆనవాయితీ క్రూయిజ్ షిప్పుల్లో. నేను ఆ కెప్టెన్ (గ్రీకు) పక్కనే కూర్చున్నాను. ఆ షిప్ ఒక ద్వీపం అనుకుంటే కెప్టెన్ ఆ ద్వీపానికి రాజులాంటివాడు. షిప్‌లో జైలుంటుంది తెలుసా. మాటల్లో చెప్పాడు. గల్ఫ్ అంతా తిరిగి దుబాయ్ వస్తుందా షిప్. అక్కడ నుంచి బోంబే దుబాయ్‌లో నా భార్య వస్తుంది. నా పర్స్ ఖాళీ అన్నాడు. అతనికి ఇద్దరు ఆడ పిల్లలు. పిల్లలు రాలేదే అంటే వాళ్లమ్మని పంపించారు. అది చాలు అని తమాషాగా నవ్వాడు. డిన్నర్ ముందు ఒక ట్రైనింగ్ సెషన్ పెట్టారు. అది డిన్నర్‌లో. ఉండే ప్రొటోకాల్స్ చెప్పటానికి.

షిప్‌లో రాత్రిపూట బయట కు రానివ్వరు. పొద్దునే లేచి డెక్ మీదకు వెళ్లాను. ఎక్కడ నేల అలకిడి లేదు చుట్టు నీరు. అంటే భూమ్మీద కూడా భూమిలేకుండా ఉంటాం. ఎంత దూరం చూసినా నేల జాడలేదు. అదికూడా ఒక గమ్మత్తైన పరిస్థితే కదా. ఆరు రోజులు నేలను చూడకుండా గడపడం ఒక గొప్ప అనుభూతి! నాలాంటి ఈత రానివాళ్లకి భయం కూడా!

అడవి, నీరు, ఎడారి  మూడు నాకు నేర్పాయి ఇంకోటి చెబుతాను. యూరప్‌లో ఆల్ఫ్స్ పర్వతాల నెక్కాను. హైయస్ట్ పాయింట్ చేరాను. అక్కడికి వెళ్లాలంటే రోప్‌వే ద్వారా వెళ్లాలి. మూడంచెల్లో మారి అక్కడికి చేరాను. చుట్టూ మంచు, మేఘాలు. అక్కడ భోజనం చేశాను. ఆ రెస్టారెంట్ పేరు బోంబే రెస్టారెంట్. ఆలోచించండి జీవితం ఎలా ఉంటుందో. స్విట్జర్లాండ్‌లో ఆల్ప్ పర్వతాల గురించి నేను చెప్పింది. ఈ ప్రపంచ పర్యటన నాకు నేర్పిందేమి టంటే మనలను మనల్ని గుర్తించటానికి, తెలుసుకో వటానికి మనిషి ప్రయాణం చేయాలి అని. మన మెంత బలహీనులో తెలుసుకోవటానికి. మనమెంత మూర్ఖులో తెలుసుకోవటానికి కూడా ఉపయోగ పడుతుంది.

***మళ్లా కాస్త, వెనక్కి వెళదాం. ఇంతకీ మీరు సముద్రం చూడటానికి రెండేళ్ల విశాఖపట్నంలో ఎందుకున్నారు?***

2005లో నా వ్యాపారం తీసేశాను. ఆపేద్దా మని నిశ్చయించుకున్నాను. ఉన్నచోటే ఉండడం నాకిష్టం లేదు. బెజవాడలో సముద్రం లేదు కదా. మా అమ్మాయి వైజాగ్‌లో ఉంటోంది. అందుకని ఆ వంకతో వైజాగ్ వెళ్లాలని నిశ్చయించుకున్నాను. ఇది జరగకముందు వైజాగ్‌లో సముద్రం ముందు ఇల్లుకొని సంవత్సరం ఖాళీగా ఉంచి అమ్మేశాను (నవ్వు). వెళ్లినప్పుడు ఇల్లులేదు. ఆ పక్కనే ఇల్లు అద్దె తీసుకుని రెండు సంవత్సరాల పాటు 24 గంటలు సముద్రాన్ని చూశాను. గంట గంటకు సముద్రం ఎలా ఉంటుందో నీళ్లలో నిలబడి చూశాను. సముద్రం నిద్రపోతుంది. సముద్రం పాట పాడుతుంది. సముద్రం గుసగుస లాడుతుంది. సముద్రం బీభత్సంగా ఉంటుంది. ఇన్నున్నాయి సముద్రంలో. సముద్ర ప్రపంచం చాలామందికి తెలియదు ఈ విషయం. నేను రోజూ ఓ పోయం రాశాను. సముద్రాన్ని చూడటం రావడం అంతే. ఈ రెండు సంవత్సరాలలో వందకి పైగా మిత్రులేర్ప డ్డారు. ప్రొ. ఆదినారాయణ, అయ్యల గోపాలకృష్ణ,   విరియాల లక్ష్మీపతి, సీతగారు, భరద్వాజ, భరద్వాజగారు నాకు ఎన్నో మ్యూజిక్ వీడియోలు ఇచ్చారు. అప్పుడే ఒకసారి రుషికొండపైన ఉన్న కాటేజెస్‌లో (ఇప్పుడు కూల్చేశారు) ఒక కాటేజ్ అద్దెకు తీసుకుని రాత్రంతా సముద్రం చూస్తూ కూర్చున్నాను. మా ఆవిడ భయపడింది. ఏ అఘాయిత్యం తలపెడతానోనని. తుఫాను సమయంలో సముద్రాన్ని చూడాలనుకున్నా ను. కానీ సాధ్యపడలేదు. సూర్యోదయం చూడాలన్న కోరిక ఉండేది. కానీ వీలుపడలేదు. చుట్టూ మబ్బులుండేవి సముద్రం మీద నుంచి పైకిలేచే సూరీడు కానరాలేదు నాకు. అలాగే సూర్యాస్తమయం సమయంలో డాల్ఫిన్ కొండల పక్కకు వెళ్లిపోయేవాడు. సముద్రంతో నా అనుబంధం మద్రాసులో ఉన్నకాలం నుంచీ ఉంది. అప్పుడు నాలుగేళ్లు మద్రాసులో చదువుకున్నా కదా! అప్పుడు రోజు మెరీనా బీచ్‌కు వెళ్లేవాడిని. ప్రపంచంలోనే రెండో పొడవైన బీచ్.

***మీ కథలు చేరవలసినంతగా పాఠకులను చేరాయని అనుకుంటున్నారా! 'అమహ' కథల సంపుటి తెచ్చారు. ఆ తర్వాత పారిజాతం కథల సంపుటి తెచ్చారు. అయితే మీ కథలన్నీ పాఠకుల స్థాయిని మించి ఉంటాయన్న మాట ఉంది.***

పాఠకుల స్థాయి అని నేను చెప్పను గానీ, ఒకటి జరిగింది. తెలుగు కథలు నేను చదివాను. బావుందే అన్న కథ నాకు ఒక్కటి తగల్లేదు. వాటిలో ఉన్న బలహీనతలు చెబుతాను. సస్పెన్స్ ఉండదు. డీటెయిల్స్ ఉండవు. రిలేషన్స్ సరిగ్గా ఎస్టాబ్లిష్ కావు. సంభాషణల కన్నా, ఉపన్యాసాలు ఎక్కువ. ఇవి నా పరిశీలనలు కృతకంగా ఉంటాయి. సందేశమివ్వ టానికి ప్రయత్నిస్తాయి. దినపత్రికలోని వార్తలు– కథావస్తువు ఇవన్నీ నాకు తెలుగు సినిమాలా అన్పిస్తాయి. నా ఉద్దేశంలో కథ అలా ఉండకూడదు కథ పాఠకుడిని చదివించాలి. పాఠకుడిని ఆలోచింపచేయాలి. ఇలా జరగకుండా ఉంటే బావుండేది. ఈ కథ ఇక్కడ ఆగిపోయేందేమిటి ఇంకా ఏం జరిగి ఉంటుంది. ఇన్ని ప్రశ్నలు పాఠకుడికి రావాలి అదే కథ. కథ చదివిన తర్వాత ఆలోచింప చేసేవి కథ. చదివినంతసేపు మిమ్మల్ని ఎంగేజ్ చేసేది కథ. ఈ రెండూ లేకపోతే అది కథకాదు. అదొక అస్తిపంజరం. పుస్తకం పట్టుకుని కథ చదువుతుంటే మంచి కంపెనీ మనచుట్టూ ఉన్నట్లు ఉండాలి. I am sailing with good company అనుకోవాలి. ఆ ఫీలింగ్ రాకపోతే మంచి కథకాదు. నేను ఆ ఉద్దేశంతోటే కథలు రాయటం మొదలు పెట్టాను. కథంటే ఇలా ఉండాలి, ఇలా ఉంటేనే చదువుతారు అన్న కసితోనే మొదలుపెట్టాను. నాకు సంబంధించి ఖచ్చితమైన ప్రణాళిక ఉంది. సబ్జెక్టు, శిల్పం, కథాగమనం అన్నీ ఖచ్చితంగా ఉంటాయి నా కథల్లో. కథ చాలా పకడ్బందీగా ఉండాలి. ముగింపు స్థిరంగా వుండదు. ఓపెన్ ఎండింగ్ అన్నమాట!

***మీ కథలు పాఠకులకు చేరాయా?***

ఎవరి పాఠకులు వారికుంటారు. నా పాఠకులు నాకున్నారు. ఏ రాత్రిపూటో నాకు ఫోనొస్తుంది. రాత్రి మీ కథ గోడ చదివాను. నిజంగా మావూరెళ్లినట్లుంది అంటారు. ఇంతకంటే ఏం కావాలి. బేతవోలు రామబ్రహ్మంగారు పారిజాతం


ఇంటర్వ్యూ చేసిన సి.ఎస్. రాంబాబుతో...

చదివి ముగ్ధులై నాకు కాంప్లిమెంట్ పంపించారు ఆయన అన్నమాట అశ్వనీకుమార్ కథల్లోని వర్ణనలు, సంభాషణలు, కథాశిల్పం, కాల్పనికత, ప్రతీకలు, విదేశీవస్తుజాలం సాంకేతికత పదజాలం, పాత్ర చిత్రణ, మనోవిశ్లేషణ, కథకాలాన్ని తెలిపే క్లూలు. ఇలా చాలా చాలా పార్శ్వాల నుంచి వీరి కథలను ఓపికగా అధ్యయనం చేయాలి. అలాగే స్థానికత అన్న అంశం కూడా పరిశీలనాత్మకం. ఈ విస్తృత ఆధ్యయనశాలిని అంచనా వేయటం ఆచూకీ పట్టడం అసంభవమంత కష్టం! ఇది రామబ్రహ్మం గారి విశ్లేషణ. నా కథలపట్ల నాకు పూర్తి నమ్మకం ఉంది.

***మళ్లీ మీ కవిత్వం వైపు వద్దాం.***

మనం చెప్పలేనివి ఎన్నో మనలో ఉంటాయి. వాటిని వ్యక్తీకరించటానికి ఒక వాహిక కవిత్వం. చెప్పాలన్న తపన మనుషులను కవులను చేస్తుంది. అందులో ఏం చెబుతున్నాడో మనకు అర్థం కాకపోవచ్చు. వచన కవిత్వం రహస్యమే అది. ఏ వచన కవితయినా అర్థమయితే అది కవిత్వం కాదు. మోహనప్రసాద్(మో) నాకు కవిత చూపించేవాడు. అర్థమయిందా అనేవాడు. అర్థమయింది అంటే చింపేసేవాడు. అర్థం కాకూడదు అనేవాడు.

*ఎందుకు రాస్తున్నాను నేను అని మీరెప్పుడన్నా ప్రశ్నవేసుకున్నారా?*

వేసుకోలేదు కానీ సమాధానం చెబుతాను. రైతు పొలం ఎందుకు దున్నుతాడు? పంట పండించాలని. ఉద్యోగం చేసేవారికి కుటుంబ పోషణ ముఖ్యం. వీటికి నిర్దిష్టమైన ఎండ్ యూజ్ ఉంది. ఒక ఫలితం ఉంది. రాయటానికి నిర్దిష్టమైన కారణం చెప్పలేం. నేనే కాదు ఎవరైనా... ఎందుకు రాస్తున్నారు అంటే. మనవెందుకు జీవిస్తున్నాం? సమాధానం చెప్పగలమా ఈ ప్రశ్నకు... చెప్పలేం కదా! ఈ ప్రశ్న కూడా అలాంటిదే. అంటే నేను రాసింది పదిసార్లు చదువుతాను. అలా పదిసార్లు దాన్ని ఇంకా బాగా మార్చటానికి ప్రయత్నిస్తాను. సరిదిద్దిన దాన్ని మళ్లా చదువుతాను. అప్పుడు కలిగిన ఆనందమున్నది చూశారా. అది ఇన్‌వాల్యుబుల్. అందుకని ఎందుకు జీవిస్తున్నామంటే ఏం చెబుతాం! ఎందుకు రాస్తున్నారంటే ఏం చెబుతాం. నా రాతలకు ఏదన్నా ప్రయోజనం ఉందంటే నన్ను నేను మోసం చేసుకోవటమే. ఇక్కడ భవభూతి మాట గుర్తొస్తుంది. మీరు నన్నడిగినట్టే – ఆయన్ను ఎవరో అడిగారు – 'ఇంత కష్టపడి రాస్తున్నావు – ఎవరు చదువుతారు?' అంటే ఆయన అంటారు – "కాలాన్ని దాటిపోలేము – కాని నా రచనలు చదవటానికి ఎప్పుడో–ఎవరో పుడతారు – చదువుతారు" అంటాడు.

*రచనకు ప్రయోజనం ఉండాలా వద్దా?*

ప్రయోజనం అంటే 'సాహిత్యం సమాజ హితం' అన్నారు కదా. అది ఉంటే మంచిదే అంటారు పెద్దవాళ్లు. మరోరకంగా సమాజాన్ని చెడగొట్టకురా అని చెప్పారు. వీలయితే బాగు చేయి లేదంటే అలా ఉంచు. నాకు బాగా నచ్చింది. ప్రభావితం చేసింది నేను చదివిన ఐరోపా సాహిత్యం.... వోల్టేర్ అంటాడు కదా 'ఈ లోకం, ఈ ప్రపంచం నేను రాకముందు ఎట్లా ఉందో, వచ్చాక అలానే ఉంది. నేను వెళ్లిపోయిన తర్వాత అట్లానే ఉంటుంది" అంటాడు కాబట్టి దాన్ని ఏదో చేద్దాం, సంస్కరిద్దాం అనేవి ఉత్తుత్తి మాటలు. సంస్కరణ, సిద్ధాంతాలు – అవన్నీ నమ్మవద్దు మీరు. కొంతమంది తమ పబ్బం గడుపుకోవటానికి ప్రచారం చేస్తారు. నిజం చెప్పుకోవాలంటే ఎవరిని వారు సంస్కరించుకుంటే చాలు. మీ చుట్టూ ఉన్న వాతావరణాన్ని హాయిగా ఉంచగలిగితే బయటవారికి మీరు హెల్ప్ చేసినట్టే కదా. జపాన్ దేశం మీరు చూస్తే వాళ్లు ప్రజలు కాదు ఒక సొసైటీ. మనం అంతా ఒక సంఘం అనుకుంటారు. దానికి పూర్తి భిన్నం అమెరికన్ సమాజం. ఒక్కొక్కడు ఒక ఐలాండ్. మనం మధ్యలో ఉన్నాం.

*నిరంతర రచనా వ్యాసంగంలో వుండే మీకు, భవిష్యత్తు ప్రణాళిక అంటూ ఏమన్నా పెట్టుకున్నారా?*

మూడు పుస్తకాలు పాఠకుల కోసం సిద్ధం చేస్తున్నాను. ఒకటేమో లీలానాయుడు బయోగ్రఫీ. జెర్రీపింటో ఆవిడ చెబుతుండగా ఆయన రాశాడు. దాన్ని అనువాదం చేయటం కోసం పర్మిషన్ లెటర్ రాశాను. లీలానాయుడు బయోగ్రఫీ ఎందుకో చెబుతాను. లీలానాయుడు తండ్రి రామయ్య నాయుడు తెలుగువాడు. బాంబేలో టాటా సైంటిఫిక్ సంస్థలో సైంటిస్ట్‌గా పనిచేసేవాడు (అంతకుముందు మేడమ్ క్యూరీ దగ్గర పరిశోధనలు చేసాడు). ఆయన భార్య ఫ్రెంచ్ యువతి. వారి సంతానం లీలానాయుడు. నా దృష్టిలో ఆవిడొక దేవత. ఒక ఏంజెల్. భూమ్మీద ఎలా పడిందో నాకు తెలియదు. ఆ అమ్మాయి రూపురేఖలు వాళ్ల నాన్నకీ అమ్మకీ సంబంధంలేదు. పైనుంచి దిగివచ్చిన దేవత. హృషీకేశ్ ముఖర్జీ అనూరాధ అనే సినిమాకి




*పారిస్ వీధిలో*

తీసుకున్నాడు. నేచురల్‌గా చేసేసి వెళ్లిపోయింది. తర్వాత రాజ్‌కపూర్ నాలుగు సినిమాలకోసం అడిగాడు. సత్యజిత్‌రే అడిగాడు. సింపుల్‌గా నో చెప్పేసింది. డబ్బుకోసం వెంపర్లాడ లేదు. కీర్తికోసం పరిగెత్తలేదు. అన్నీ ఆవిడ వెనకాలే వచ్చాయి. సినిమా స్టార్స్ గురించి లార్జర్ దేన్ లైఫ్ అని పడికట్టుపదం వాడతాం కదా షి ఈజ్ లార్జర్ దేన్ ది స్క్రీన్. వోగ్ పత్రిక కవర్‌పేజీ మీద ఆవిడ ఫోటో వచ్చింది. 5 Most beautiful women in the world లో ఆవిడకు చోటు దక్కింది. యు ఎన్ ఒ అంబాసిడర్‌గా దేశాలన్నీ తిరిగింది. ఫ్రెంచ్ డైరెక్టర్ రినోయిర్ దగ్గరకు వెళ్లింది, ఎవరో రిఫర్ చేస్తే. ఆయన ఈమెని చూసి స్టన్ అయిపోయాడు. You are born actor అంటాడు, నువ్వు నేర్చుకోవడమేమిటి అంటాడు. Vogue పత్రిక కెమెరామెన్ ఆవిడను చూసి ఫోటోషూట్ చేస్తాడు. అతని పదిహేనుమంది అసిస్టెంట్లు వివిధ యాంగిల్స్ లో ఫోటో తీయబోతే ఎందుకు తీస్తారు. She has no wrong angle అంటాడు. ఆమె జీవితంలో బాధ ఉంది. Pain! ఉంది. ఫ్రెంచ్, హిందీ, ఇంగ్లీషు కొద్దిగా తెలుగు వచ్చు. Highly Independent Woman ఇంగ్లీషు పుస్తకం కంటే కూడా తెలుగు పుస్తకం బావుండబోతోంది. ఆ గ్యారంటీ ఇస్తాను.

ఇక రెండవ పుస్తకం బుద్ధరతనాలు. దాదాపు అయిపోవచ్చింది. మూడవది వీరసావర్కార్ రచించిన ఫస్ట్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్. ఇది నేను బందర్లో డిగ్రీ చదివే రోజుల్లో ఫుట్‌పాత్‌మీద ఐదురూపాయలకు కొని చదివాను. అప్పుడే నాకు వళ్లు గగుర్పొడిచింది. ఇంతవరకు ఎవరు తెలుగు లోకి తేకపోవటం బాధగా ఉంది. నేను చేయాలని నిశ్చయించుకున్నాను. ఇవాళ మనం ఇలా ఉన్నామంటే వాళ్లు చేసిన త్యాగాలే కదా. ఇది నా ప్రణాళిక.

ఇంకొక విషయం చెబుతాను. పుష్కర కాలంగా నేను మిసిమిలో ఉండటానికి ముఖ్య కారణం బాపన్నగారు. వారి సహకారం లేకుంటే ఇది సాధ్యమయ్యేది కాదు. ఎంత స్వేచ్ఛ ఇచ్చారంటే, ఆ స్వేచ్ఛను నేను చాలా పవిత్రంగా చూశాను. మామూలుగా స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తారు. నేను చాలా పవిత్రంగా చూశాను. ఏరోజు నా పనిలో జోక్యం చేసుకోలేదు వారు. దీన్ని ఇంకా ఎట్లా ముందుకు తీసుకువెళ్లాలా అనేది మా ఇద్దరి తపన. కేవలం తండ్రికిచ్చిన మాటకోసం పత్రికను నడుపుతున్నారు ఒక యజ్ఞంలా. ఈ బాధ్యతను నిర్వహిస్తున్నామని మా పాఠకులకు తెలుసు. వాళ్లు ఇంకా పూర్తిగా సపోర్ట్ చేయాలని నా కోరిక. నాతో ఇన్‌ట్రాక్ట్ అయ్యేవారందరికీ ఈ విషయం బాగా తెలుసు. దీన్ని పబ్లిక్‌లో తీసుకెళితే పెట్టుబడి పెట్టడానికి చాలామంది సిద్ధంగా ఉన్నారు. అది బాపన్నగారికి ఇష్టం లేదు. నెలకు లక్షరూపాయలు ఖర్చయినా ఆయన చిరునవ్వుతో ఇలాగే నడుపుదామంటారు. నాకు కొన్ని ప్రణాళికలున్నాయి. మిసిమి తరఫున జ్ఞానపీఠ్ తరహాలో సంవత్సరానికో అవార్డు ఇవ్వాలన్న ఈ స్వప్నం ఉంది. అలాగే మంచి పుస్తకాలు పబ్లిష్ చేయాలి. మిసిమి పబ్లికేషన్ ఆగష్టు మిసిమి సంచికలో "అనంతశయన విష్ణుమూర్తి" కవర్ స్టోరీ వేశాం. భవిష్యత్తు తరాలవారికి పదిహేను వందల సంవత్సరాల టేకు చెట్టును చూపించటమే కదా, వారి లక్ష్యం. ఆశయం. అట్లా భవిష్యత్తరాల వారికి ఇటువంటి పత్రిక నడిచింది అని తెలియాలి. ప్రతీ సంవత్సరం ఇచ్చే అవార్డు ఆలపాటి రవీంద్రనాథ్ గారి లెగసీని ఆ వారసత్వాన్ని ముందుకు తీసుకెళుతుంది. ఇవి మిసిమి గురించి మరికొన్ని అభిప్రాయాలు.

*మిమ్మల్ని ఏ సిద్ధాంతాలు కట్టిపడేయలేదా?*

గురువుల మీద, సిద్ధాంతాల మీద నాకెప్పుడూ

గురి లేదు. అవన్నీ కాలపరిమితికి లోబడి వచ్చి పోయేవే. కళని, సాహిత్యాన్ని ప్రకృతిని ఆస్వాదించ గలిగితే ఏ సిద్ధాంతాలతో పని ఉండదు.

సంస్కరణ, అభ్యుదయం, విప్లవం ఈ నినాదాల న్నీ ప్రాంతీయం. మీకు చిన్న విషయం చెబుతాను వినండి. ఒకసారి పోస్టులో ఒక కార్డు వచ్చింది. రాసినవారు నాకు పరిచయం లేదు. అందులో విషయం "...ముప్ఫై ఏళ్లుగా సిద్ధాంత రాద్ధాంతాల తో దిమ్మెక్కి పోయిన నా మస్తిష్కం రాత్రి మీ పుస్తకం (ఇది నాకెలా వచ్చిందో తెలియదు) నాలో-నేను చదివిన తరువాత సేద తీరింది! "మీరెవరు?" మీ శ్రేయోభిలాషి అని ఉంది. ఆ కార్డు రాసింది విశాఖ పోర్టులో ముప్ఫై ఏళ్లుగా యూనియన్ నడిపిన నాయకుడు. ఇప్పుడు చెప్పండి ఏ సిద్ధాంతాలని నమ్మాలి?

***మీ ఆలోచనలు ఎలా ఉంటాయి? రావిపూడి వెంకటాద్రిని సన్నిహితంగా తెలిసినవారు నాస్తిక కేంద్రం సమరంతో స్నేహం చేసినవారు. దేశం లోని గుళ్లు, చర్చ్‌లు తిరిగి వచ్చినవారు ఇంకా...***

అర్థమయింది – హేతువాదానికి, మానవ వాదానికి సన్నని రేఖ ఉంది. నాస్తికత్వానికి చార్వాకులకు అలాగే రేఖావిభజన ఉంది. ఆధ్యాత్మికతకు-మతానికి అలాంటి రేఖామాత్రపు భేదం ఉంది. వీటన్నింటిని సమర్థించుకోవడానికి ఎవరి తర్కం వారికుంది. ఎవరి అవసరం వారిది. ఈ రహస్యాన్ని తెలుసుకుంటే మనకు గందరగోళం ఉండదు.

***మీ విశ్వాసాలు ఎలా ఉంటాయి?***

మీరడిగేది మత విశ్వాసాలా?

సంస్కృతీపరమైన నమ్మకాలు జన్మత: వస్తుంటా యి. మన విద్య వాటి సమతుల్యాన్ని మూల్యాంకనం చేసుకుంటుంది. ఏ విశ్వాసానికైనా హేతువు వెంటనే దొరకదు. వయసు కూడా వాటిని ప్రభావితం చేస్తుంది. జీవితమంతా రేషనిస్ట్‌గా గడిపిన చాప్లిన్ వయసు మీద పడేసరికి అతను ఎప్పుడూ నమ్మని విశ్వాసానికి లోనవుతాడు. స్వర్గ నరకాలను నమ్మని షెల్లీ, బైరన్‌ల కవిత్వం బైబిల్ కథలతోనే నిండి ఉంది.

రాధాకృష్ణులు లేకుంటే భారతీయ సాహిత్యం, నృత్యకళ, సంగీతం ఎటు పోయేవి? ఈ దేశాన్ని ఒకటిగా ఉంచినది భారత ఇతిహాసం, రామాయణ మహాకావ్యం. అంటే వేల సంవత్సరాల సంస్కృతీ సంప్రదాయాలు మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా ఇది అంగీకరించాలి.

***బౌద్ధం గురించి మీ అభిప్రాయం?***

బౌద్ధ, హిందూ ధర్మాలను మతాలుగా పాశ్చాత్యు లు నామకరణం చేశారు. బౌద్ధం బోధించేది కాదు. ఆచరించేది. జన్ బౌద్ధం తెలుసు కదా? లిఫ్ట్‌లో నిద్రపోతాను. ట్రాఫిక్ సిగ్నల్స్ దగ్గర కునుకు తీస్తాను. ఎప్పుడూ ఏ పనిలో ఉన్నా ధ్యానంలోనే ఉంటాను. మీకు ఇప్పుడు అశ్వినీకుమార్ అపరిచితునిగానే కనపడుతున్నా నేను ఆశ్చర్యపోను.

***ప్రేమ గురించి మీ అభిప్రాయం... ఎన్నో ప్రేమలేఖలు రాశానని చెప్పారు?***

ప్రేమ అనేది ఒక భావన! ప్రేమించటమంటే నిన్ను నువ్వు సమర్పించుకోవటం! సంసారమంటే సర్దుకుపోవటం! స్నేహమంటే భరించటం!

***ఈ జీవితానికి అర్థం ఏమిటి?***

చాప్లిన్ అంటాడు... "ఎన్నోసార్లు అనుకున్నాను. జీవితానికి ఏ అర్థం లేదని". జీవితానికి అర్థాన్ని మనమే ఆపాదించుకోవాలి. అర్థవంతంగా జీవించా లి. అదే జీవితానికి అర్థం.

***మీరు సినిమాలు పెద్దగా చూడరు. కానీ ఎప్పుడూ పాటలు అన్ని భాషలలో వింటారు. ఏమిటి సంగతి? మీ కథల్లో కూడా పాటలని సందర్భోచితంగా సూచిస్తారు.***




అవును. వంద సినిమాలు కూడా చూసి ఉండను అన్ని భాషల్లో.

సినిమా కళ కాదు. అది కేవలం వినోదం. కాని దానిని వ్యాపారం మింగేసింది. సాంఘిక బాధ్యత లేని వ్యాపారులు అర్థంతరంగా డబ్బు సంపాదించిన విద్యాగంధం లేని మూకలు భారతీయ సినిమాను చెరిచారు. వారు మనిషి ఇంద్రియ శక్తులకు ఆహారం వేస్తారు. దీనిని ప్రభుత్వాలు ఆదాయం రావటంతో నియంత్రించవు. పేర్లెల్ సినిమా ఒకటి వచ్చింది. అది నిలబడలేదు. మీ జీవితాన్ని తెరమీద చూడటానికి – పచ్చిగా-ఎలా ఇష్టపడతారు. సినీ విమర్శకులు చాలా మీడియోకోర్. వారు హీరోల వీరోచితాలను హీరోయిన్ అందాలను విశేషణాలతో చెప్పడంతోనే అలసిపోతారు. సినిమా చిత్రాలని ఎప్పుడో వివరంగా రాసాను.



*తనికెళ్ల భరణితో*

ఇక సంగీతం – ప్రకృతిలో సంగీతం ఉంది. మన ప్రతి అడుగులో రిథం ఉంటుంది. ముఖ్యంగా స్త్రీ స్వరంలో మెలోడీ నిండి ఉంటుంది. అవన్నీ గుర్తించే తీరిక లేని పరుగులో ఉన్నాం. బెతోవెన్ సింఫనీ, పావరొట్టి ఒపెరా, ఆంద్రీరూయీ, రోమియో జూలియట్ థీం ఇవన్నీ ఆస్వాదించగలం. హిందీ పాటలెన్నో తెలుగు చేసుకున్నాను. తెలుగు సినిమా సంగీతం ఘంటసాలతోనే ఆగిపోయింది. ఇప్పుడన్నీ శబ్దాలే. ఆ శబ్దాలకే గంతులు వేస్తున్నారు కుర్రకారు.

***చాలా చాలా కృతజ్ఞతలు అశ్వినీకుమార్ గారు ఒక మనిషి ఒకే జీవితంలో ఎన్ని పనులు ఎంత వైవిధ్యంతో, ఎంత ప్రేమతో చేయగలరో మీరు చూపించారు. ఎంత స్వేచ్ఛగా జీవించవచ్చో నిరూపించారు.***

నన్ను మళ్లీ మూల్యాంకన చేసుకునే అవకాశం కల్పించారు. పాలపిట్ట పత్రిక వారు. వారికి కృతజ్ఞతలు.

ఆస్కార్ వైల్డ్ అంటాడు – ఈ ప్రకృతిలో నాకింత చోటు దక్కకపోదు –

ప్రకృతిమాత నాకోసం నక్షత్ర దీపాలను వెలిగిస్తుంది...

ఆ వెలుగులో జాగ్రత్తగానే అడుగులు వేస్తాను...

నా జాడలపై గాలి వీస్తుంది... మరెవ్వరూ నా దారివెంట రాకుండా...

ఆ తల్లి నన్ను పవిత్రజలాలతో పునీతుణ్ణి చేస్తుంది,

చేదు తృణకాష్ఠాలతో కడిగి పరిపూర్ణుడుగా తీర్చిదిద్దుతుంది.

***రాంబాబు సెల్: 8374818961***



# పారిజాత పరిమళాలు నాకేమనిపించిందంటే



– ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

పద్యకావ్యం ఇచ్చి నాలుగు ముక్కలు రాయమంటే నల్లేరుపై బండినడక నాకు, చెడుగుడు ఆడేస్తాను. ఇదేమిటిది – కథా సంపుటి. మనకి అలవాటు లేని ఆపోశన. పైగా ఆత్మీయ మిత్రులు వల్లభనేని అశ్వినికుమార్ గారి రచన. బాగు బాగు అంటే పాఠకులు అలుగుతారు, ఓహో ఓహో అంటే అశ్వినిగారు అలుగుతారు. దీనికి రాయడం కలంమీద సాము. అయితే నాకో వెసులుబాటుంది. కథా సాహిత్యం మీద నా మాటను ఎవరోగానీ పరమ ప్రామాణికంగా స్వీకరించరు. అందుకని ధైర్యంగా రాసేస్తున్నాను.

నేను గమనించిన మేరకు అశ్వినికుమార్ గారిలో ఒక జమీందారున్నాడు – భిక్షువూ ఉన్నాడు. రసికుడున్నాడు – విరాగీ ఉన్నాడు. అధ్యయనశీలి ఉన్నాడు – రచయిత ఉన్నాడు. దేశ దేశాలు తిరిగాడు. ప్రతిచోటు నుంచీ ఒక కథా వస్తువు ముక్కున గరిచి తెచ్చుకున్నాడు. ఇంటిలో కూర్చుని రాసినా, ఆయా దేశాలలో ఈ కథలు జరుగుతున్న అనుభూతిని పాఠకుడికి కలిగించడంలో శతశాతము కృతకృత్యుడయ్యాడు. ఆయా దేశాల్లోని భవనాలు, స్థలాలు, వాహనాలు, పారిభాషికపదాలు, నామధేయాలు, ద్రవాలు – ఉపద్రవాలు, మతాలు – ఆచారాలు, ఒకటేమిటి ఎలా గుర్తుపెట్టుకుంటాడో ఏమో మొత్తం వాతావరణం యథాతథంగా దింపేస్తాడు. ఫోటో వీడియో తీసినట్టు చూపించేస్తాడు. ఇంతకీ ఇప్పుడీ కథా పారిజాతాన్ని రుక్మిణికిస్తే ఒక తంటా, సత్యకిస్తే మరోతంటా అన్నట్టుంది నా పని. అందుకని – వీటిని చదువుతున్నప్పుడు నాకేమనిపించిందో అది కాస్తా చెప్పి ఊరుకుంటాను. వీటిలో చాలా కథలు నాకు పునశ్చరం. అమహా పుస్తకంగా వచ్చినప్పుడు వీటిలో చాలా మటుకు చదివాను. ఈ సంపుటిలో తొలి కథ అదే –

పతివ్రతలు భారతదేశంలోనే కాదు ప్రపంచ దేశాలన్నింటా ఉన్నారు. (అమహా) కథ లేకుండా కూడా కథ రాయవచ్చు, భావుకత దండిగా పండించవచ్చు (పారిజాతం).

భగ్న ప్రేమికుణ్ని తాగుబోతుని చెయ్యకుండా కథ నడిపించలేమా? కాళిదాసుకి లాల్సలామ్! ఈ కథ ముగింపు మరో తరహా మతఛాందసత్వం సత్యం. కానీ చాలా గొప్ప వాక్యం ఒకటి ఈ కథలో నాకు దొరికింది. "ఈ రోగులకు కావలసింది ఏముంది? గౌరవంగా ఈ లౌకిక ప్రపంచం నుంచి నిష్క్రమించడం!" (మాలి).

అచ్చమైన ఆనందం కనిపించినప్పుడే మన కృతకానందం మనకి తెలిసి వస్తుంది. గుండెల్ని దహిస్తుంది – విమ్మీ! (లేమి).

(పంజరం) థిరెటికల్లీ ఇదొక పెర్ఫెక్ట్ షార్ట్ స్టోరీ. క్రైమ్–సెక్స్–సస్పెన్స్–ప్రకృతి–అన్నీ ఉన్నాయి. మరో మూడేళ్ళకి రవి గనక మళ్ళీ అమెరికా వెడితే – ఈ కథ చివరలో మిగిలిన ముగ్గురిలో ఒకరు ఎలిమినేట్ అయిన కథ వింటాడు (పంజరం).

పాఠకులకి గట్టిగా పని చెప్పిన కథ "గోడ". రచయిత అక్కడక్కడ విసిరిన ముత్యాలను ఏరుకుంటే దండ కట్టుకోవచ్చు. నేను కట్టుకున్న దండ చెప్పనా!

ముగింపులో ఉన్నది పెద్ద ముత్యం. కథానాయకుడి పేరు డాక్టర్ రమానంద్. దమయంతిని ద్వితీయం చేసుకుని కుదుటబడ్డాడు. అందుకే పోర్టికోలో కారు ఒంటికి వెలుగు పూసుకుంది. తాను దూకలేకపోయిన గోడ – కవ్వించిన గోడ – ఇప్పుడు ఒక గీతలా మాత్రమే (ఇందులో శ్లేషకూడా ఉందేమో) కనిపించింది. అల్లరిపిల్ల హరిణి ధైర్యంగా "హాయ్ మావయ్యా" అంటూ జాగింగ్‌కి జత కలిసింది.

ఈ అమ్మాయికి అతడిమీద కోరిక లేదు. కొత్తతరం పిల్ల. తెలివైన పిల్ల. అంతవరకే. అందుకే తన కలలోకి చొరబడదామనుకున్న రమానందుని "ఈసారి పరీక్షగా చూస్తాను" అని కొంటెగా– కాదు గడుసుగా వారించింది.

"రమానందు వైద్యం డాక్టరు కాదు. విద్యా డాక్టర్". ఇతడు వాడిన "విద్యాసంవత్సరం" అనే పదం, ఇంటినిండా పుస్తకాలు, యూనివర్శిటీ ప్రస్తావన – ఇవి చిరుముత్యాలు. ఇంగ్లీషు పాటలు వినడం మరో ముత్యం. తెలుగు లెక్చరర్ కాదు. హరిణిని ల్యాబ్‌కి తీసుకుపోలేదు కాబట్టి సైన్సు లెక్చరరూ కాదు. ఇంగ్లీష్ లెక్చరర్ కావచ్చు. డాక్టర్ అనే ఉంచుకున్నాడు. కనుక ఇంకా ప్రొఫెసర్ కాలేదు. నడివయసులో ఉన్నాడు. రీడరై ఉంటాడు.

గేటు పక్కన గోడకి బిగించిన నామ ఫలకాన్ని జేబురుమాలుతో పొద్దున్నే ఆప్యాయంగా తుడిచాడు. అంటే అది కొత్తది. అతడిదే. అది అతడి ఇల్లే.

ఇతడి ఒంటరితనం పెళ్ళి చేసుకోకపోవడం వల్ల కాదు. చేసుకున్నావిడ దురదృష్టవశాత్తు పెందలాడే వెళ్ళిపోవడం వల్ల. ఫోటోముందు నిలబడి హరిణి చేసిన కామెంటు, ఆంటీ చీరలన్నీ ఏం చేశారు అన్న ప్రశ్న, సుజని – వదినను తలుచుకుని కంట తడిపెట్టడం – ఇక్కడి మూడు ముత్యాలు ఆత్మజ్ఞానం ఉన్నవాడే. "మనసు–వయసు–పసిడిమొగ్గ" ఇవి ముత్యాలు.

అంకుల్ కారు కాలవలో పడిపోతే? అనే ప్రశ్న చాలా మంచి ముత్యం హరిణీ! కృష్ణ ఇప్పుడు వరదలా వస్తే? అనే ప్రశ్నకీ, ఐలవ్‌యూ బేబీ సంఘటనకీ, హరిణి మనస్సును అతడు తెలుసుకునే ప్రయత్నానికీ బీజం.

వస్తువు – శిల్పం – కథనం – మూడింటా ఈ "గోడ" నాకు గొప్పగా నచ్చింది.

ఒలుకులు అనేది అసలు కథ – అనిపించలేదు. కాంగీయుడు చేసిన వార్తా కథనం అనిపించింది.

సంకెళ్ళు మంచి నవలకు సరిపోలే వస్తువు. దాన్ని హడావిడిగా బ్యాక్ ప్యాక్‌లో కుక్కి అమెరికా నుంచి తెచ్చి మనకి బహూకరించాడనిపించింది.

''ఇంతకీ రెప్పచాటు లోకం'' కట్టుకథా? పుట్టుకథా? తెలీలేదు అనువాదమా? స్వతంత్రమా? కానీ చాలా ఆర్ద్రంగా కళ్ళు తడిపిన కథ.

సుమారు ఒక దశాబ్దం కిందట – ఇంకా పైమాటేనో – వీరి కథాసంపుటి (అమహా) నేను చదివాను. ఇప్పటిదాక నాకు గుర్తున్నది – సీతక్క పొట్టమీద పచ్చగడ్డి వాసన, పెద్ద చెరువులో కోటిగాడి శవం. ఇప్పుడీ పారిజాతంలో చెరువు శీర్షిక చూడగానే అదే అయ్యుంటుంది అనుకున్నాను. అదే అయ్యింది. ఇంతకాలం నన్ను వెంటాడుతున్న కథ. ఇది గొప్ప కథ అనడానికి ఈ కొలబద్ద చాలదూ!?

పులివేట – ఇదీ ఒక నవలగా రావలిసినంత ఇతివృత్తం. అప్పట్లో నా గుంటూరు డాక్టరు మిత్రులు కూడా ఒకరిద్దరు గల్ఫ్ దేశాలకు కొందరు అల్జీరియా వెళ్ళినట్లు గుర్తు. అయితే మా అందరి అదృష్టమూ బాగుండి వారిలో కొందరు అమెరికా వెళ్ళి స్థిరపడ్డారు. కొందరు ఆంధ్రదేశం వచ్చేసినా రిగ్గులు, బోరింగులూ వేసి గడించారు. ఈ కథలోని అన్యదేశ్యాలు ఒకటి రెండో అప్పట్లో విన్న గుర్తు.

ఎవరు పిలిచేది? – ఇదొక స్టోరీ పజిల్.

భవాని – భావకవితల భాగంలో నవలగా రావలసిన కథ. భాషకూడా అదే. కల్పనలూ అవే. నలభై దాటనివారు చదువుకోవలసిన కథ. నేను ఎలా స్పందించినా అది ఎబ్బెట్టుగానే ఉంటుంది.

కనక - మావుళ్ళయ్య కథలు ఆలోచింపజేస్తాయి. కనకలాంటి కథ ఒకటి ఇరవైయేళ్ళ క్రితం ఒక ప్రముఖ వారపత్రికలో (ఆంధ్రభూమి) చదివినగుర్తు. ఆ తరువాత ఆ కథమీద చాలా చర్చకూడా జరిగింది. రైల్లో ఇద్దరు పసిపిల్లలతో ప్రయాణిస్తున్న తల్లిదండ్రులు. ఒక పిల్ల అదేదో జ్వరంతో చనిపోతుంది. తండ్రి - అసహాయంగా రాత్రిపూట రైల్లోనుంచి విసిరేస్తాడు. తెల్లారి చూస్తే చనిపోయిన కందు బెర్త్‌మీద మిగిలే ఉంది. టూకీగా ఇదీ కథ. సరే - మంచుపెట్టె కథ చదువుతుంటే విజయవాడ నగరదర్శిని అనిపించింది. శ్రీరమాగారి మూడు పేజీల బేడమ్మ కథ గుర్తుకువచ్చింది.

పెళ్ళిచూపులు అర్థమయ్యే కథ. అదిరిపోయే ముగింపు. ఆమెకు డాక్టరే కావాలి దగ్గర్నుంచి ఎన్ని ఊహలకైనా మనకు ఛాయిస్ ఉంది. నాకే నవ్వొచ్చింది. సాహిత్యం ఇలా ఉండాలి. శవపేటికలు- విషాదాంతాలు-పాఠకుల్ని భిక్షువులుగా మార్చే వ్యూహం!

మొజాయిక్ ఫ్లోరింగ్ దగ్గరకి వచ్చేసరికి ఈ ప్రిన్స్ గుర్తుకు వచ్చాడు. చాలాకాలం క్రితం వీరి ఈ కథ చదివాను. చాలా గొప్ప కథ. అహమ్మద్ పాత్ర అశ్వినిగారు సృష్టించిన అద్భుతమైన టీకప్పు.

వేయిపడగలకి - ఆపోజిట్ డైరెక్షన్లో రివర్స్‌గేర్ - షార్ట్ స్టోరీ అనిపించింది. వర్తమాన ప్రమాణాల కన్నా ఉన్నతంగా ఉన్న చరిత్ర శిఖరాలను చూపించే కథలు చాలానే వచ్చాయి. ఏది మొదటిదో ఎలా తెలుస్తాం?! కేతు విశ్వనాథరెడ్డి గారిది కూడా ఇలాంటి కథ ఒకటి ఉండాలి.

కల్యాణి ఇది ఒక ప్రమాణాత్మక కథ అనిపించింది. ఇక్కడే ఒకమాట చెబుతాను. వర్ణనలు, సంభాషణలు-కథనశిల్పం-కాల్పనికత-ప్రతీకలు - విదేశీ వస్తుజాలం - సాంకేతిక పదజాలం - పాత్రచిత్రణ - మనో విశ్లేషణ - కథాకాలాన్ని తెలిపే క్లూలు - ఇలా చాలా పార్శ్వాల నుంచి కోణాలనుంచీ వీరి కథలను ఓపికగా అధ్యయనం చెయ్యాలి. అలాగే స్థానికత అనే అంశం కూడా పరిశీలనార్హం. విస్తృతాధ్యయన శీలిని అంచనా వెయ్యడం - ఆచూకీ పట్టడం అసంభవమన్నంత కష్టం !!

రాణి విశోభ - ఇదీ ఒక నవలకు సరిపోయే కథ. నవలలు రాయవలసినవాడు కథలు రాశాడు. నవలల అనువాదాల మీద పడ్డాడు.

రేణు - ఇదీ విషాదాంతమే. చీకటి శాశ్వతం. వెలుగు క్షణికం - బాబోయ్!! మహాబలి - వ్యక్తిత్వవికాస కోణం నుంచి దీన్ని విశ్లేషిస్తే ఇది విలువైన కథ అవుతుంది.

దొమ్మేరు - పెద్ద కేన్వాసుమీద చిన్న సూరీడు. ఇది ఊరూ పేరూ మార్పుతో ఏదో ఒక దివాణం చరిత్రగా విన్న గుర్తు. చెప్పడానికి మనసొప్పడం



*'పారిజాతం' కథల సంపుటికి గాను తెలుగు విశ్వవిద్యాలయం వారి ఉత్తమ కథకునిగా పురస్కారం అందుకుంటూ*

లేదు. డొక్కలో తన్నినవాడిని రేపు డొక్కలో పొడవనా అంటాడట వీరబాహుడు!!

మరోమజిలీ ఈనాటి పాఠకుడు ఈ ప్రేమకథల్నీ, మామూలు వచనమూ కాని - మహా కవిత్వమూ కాని మహావాక్యం గందరగోళపు శైలినీ ఇష్టపడతాడా అని. అరాయించుకోగలడా అని. అదీ ఒక విషాదమేనేమో!

ఎవరు ముందు? ఇదే భవభూతి చెప్పిన "సుమానుషమ్" జీవితమంత కథని రింగులు తిప్పే రెండు పేజీల "సూత్రం" ఈ కథానిక. భద్రం తస్య.

విపులాచ పృథ్వీ - సంఖ్యాపూరకం.

హొరు - అధివాస్తవిక అవాస్తవికత. వర్తమాన ధ్వంస రచన. అద్దంలో తుఫాను ఘటన.

గూడు వదిలిన పక్షి - శతపోరి పిల్లల్ని అమెరికా పంపే తల్లిదండ్రుల్ని చూపించారు. తల్లడిల్లే తల్లిదండ్రుల్నీ చూపించారు. ఆద్యంతాల కలయిక అమోఘం.

డబ్బయ్యో వడిలో పడ్డాను కదా! అన్నింటినీ ఆస్వాదించలేను. క్షంతవ్యుణ్ణి!! మూడు శ్రేణులకు చెందిన ఇరవై ఎనిమిది కథల్ని చదివే సదవకాశం కలిగించింది ఈ పారిజాతం. ఐ లవ్ యూ బేబీ!!

రచయిత సెల్: 9848169769






# నిండుకుండ అశ్వినీ

– వి. రాజారామమోహనరావు

వల్లభనేని అశ్వినీకుమార్‌తో నా పరిచయం నలభై ఏళ్ళపైనే. ఎప్పుడు, ఎక్కడ మొదటిసారి కలుసుకున్నామో ఖచ్చితంగా గుర్తులేదు. తొలిసారి చూసింది మాత్రం విజయవాడలోనే అని, అదీ 'రేపు' పత్రిక సి. నరసింహారావుతోనని లీలగా జ్ఞాపకం.

ఆ తర్వాత, నేను హైద్రాబాద్ రైల్వేస్టేషన్‌లో ఛీఫ్ రిజర్వేషన్ సూపర్‌వైజర్‌గా పనిచేస్తుండగా, 1980వ దశకం మొదట్లో తనే వచ్చి కలిశాడు. అప్పటికి తన గురించి ఏం తెలియదు.

1984 ప్రాంతంలో మా గురువుగారు కీ.శే. శ్రీ భమిడిపాటి జగన్నాథరావుగారు, అశ్వినీకుమార్ అని ఒకతను కథలు కొత్తగా, బాగా రాస్తున్నాడని, ఆ కథలు అచ్చయిన 'నడుస్తున్న చరిత్ర' పత్రిక ప్రతులు ఇచ్చారు. అవి 'అమహా' తదితర కథలు. నిజం చెప్పాలంటే అప్పుడు ఆ కథలు నన్ను ఏమాత్రం కదలించలేదు.

జగన్నాథరావు గారిలో ఓ గొప్పతనం ఏమిటంటే, కథని కొత్తగా, విభిన్నంగా ఎవరు రాసినా, హంసలా ఆయన పట్టుకునేవారు. ఆయనే, నేను విజయవాడ వెళ్ళినప్పుడు అశ్వినీని పరిచయం చేశారు. తనని చూడగానే 'ఈ అశ్వినీ నాకు తెలుసు' అన్నాను. మంచి స్నేహశీలి. చాలా తక్కువ మాట్లాడటం, ఎక్కువగా చిరునవ్వులు నవ్వటం, అప్పటి అశ్వినీ తీరు. బాగా కలిసిపోయాం. అప్పుడు 'అమహా' కథలు తిరిగి శ్రద్ధగా చదివాను. ఆ రోజుల్లో అందరూ రాస్తున్న వస్తువూ కాదు, తీరూ కాదు. కొత్తగా ఉన్నాయి. విదేశీ అనుభవాలు. అప్పటికే అశ్వనీ చాలాదేశాలు తిరిగాడు. ముందు పెద్దగా పట్టించుకోని నేనే, అమహాకథల్ని సంపుటిగా ప్రచురించటానికి, కవర్‌పేజీ వేయించటానికి కళాజ్యోతి ప్రెస్‌కి వెళ్ళి తోడ్పడటం విచిత్రం.

1985 ప్రాంతంలో దూరదర్శన్‌లో పనిచేసే వోలేటి పార్వతీశం గారికి, హైద్రాబాదు నుంచి విజయవాడ బదిలీ అయింది. ఆయన అలా వెళ్ళిన కొద్ది కాలానికే నేను విజయవాడ వెళ్ళాను. వెళ్ళి పార్వతీశాన్ని, అశ్వినీ, జగన్నాథరావు గారితో జతచేశాను. అంతేకాదు వాళ్ళ కంపెనీ కోసం నేను తరచుగా విజయవాడ వెళ్ళేవాడిని. ఆతిధ్యం అశ్వనీదే. అద్భుతమైన రోజులు, గొప్ప సాహిత్య కాలక్షేపం. అలా కొన్నేళ్ళు గడిపాం. ఆ కాలంలోనే అశ్వనీ దగ్గరగా తెలిశాడు. ఆరోజుల్నే 'పారిజాతం' ఇతర కథలు రాశాడు. నేను చాలా కథలు రాశాను.

అశ్వినీ బయోడేటా ఒకసారి పరికిస్తే, తనకి వివిధ రంగాలలో ఎంత విస్తృత అనుభవం ఉందో తెలుస్తుంది.

అశ్వినీ తొలిస్కూలు సత్యన్నారాయణపురం. ఆ తర్వాత బంటుమిల్లిలో 6–11 (ఎస్.ఎల్.సి) వరకు. 1958 బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో పి.యు.సి. 1961కి బి.ఎస్.సి. డిగ్రీ అయిపోయింది. ఆ తర్వాత మధ్యప్రదేశ్ సాగర్ యూనివర్శిటీలో ఎమ్.ఏ ఇంగ్లీషు కొన్నాళ్ళు. తర్వాత బెనారెసీ హిందూ విశ్వవిద్యాలయంలో అగ్రికల్చరల్ బి.యస్.సి., ఎమ్.ఎస్.సి. తర్వాత మద్రాసులో ఇంజనీరింగ్, పగలు సైన్స్ అసిస్టెంట్‌గా ఉద్యోగం. అలా ఒక సంవత్సరమే గడిచింది. తండ్రి చనిపోవటంతో విజయవాడకి వచ్చేయటం జరిగింది.

చదువుకునే రోజుల్లోనే అశ్విని ఓ విచిత్ర భీష్మ ప్రతిజ్ఞలాంటిది చేసుకున్నాడు. పొట్టకూటి కోసం ఎప్పుడూ ఏ ఉద్యోగం చెయ్యనని.

విజయవాడలో రేడియో, మోటారు సైకిళ్ళ వ్యాపారం కొన్నేళ్ళు. తర్వాత 1979 వరకు దాదాపు పదేళ్ళు సినిమా పంపిణీ వ్యాపారం. బొంబాయి – మద్రాసుల్లో బాగా గడిపాడు. ఎందరో సినీ ప్రముఖులతో దగ్గరి పరిచయం. ఆ వ్యాపారంలో పార్టనర్స్ ఉన్నా 'ఏ' క్లాస్‌గా జీవితం గడిచింది. కొంత డబ్బు నిలవేశాడు.

తరువాత పెళ్ళైంది. కొత్త కాపరం. నున్న రోడ్డులో పది ఎకరాల వ్యవసాయం చేశాడు. అది గిట్టుబాటు కాలేదు. కొన్నాళ్ళు ఇటుకల వ్యాపారం చేశాడు. ఆ తర్వాత లారీ కొని, ఆ ఫీల్డ్‌లో రఫ్‌లైఫ్ అనుభవించాడు.

ఒక సంవత్సరం రేపు నరసింహారావుకి చేదోడుగా ఉన్నాడు. 'హరిజన్' సినిమా నిర్మాణ సహకారిగా ఉన్నాడు. అప్పుడు ఎ.వి.ఎమ్ బెట్టియార్, శివాజీగణేశన్, ఎమ్.జి.ఆర్, నాగిరెడ్డి, విఠలాచార్య, రాజబాబు, హరనాథ్‌లతో కలిసి గడిపాడు.

తరువాత విజయవాడలో కమర్షియల్ బిల్డింగ్ కట్టాడు. కారు కొనటం, ఇంటిమీద మరో ఫ్లోర్ వెయ్యటం జరిగింది. అద్దెలు బాగా వచ్చేవి. పైన పెంట్ హౌస్ వేసి అందులో కాపరం. దరిదాపు పాతికేళ్ళు ట్రావెల్ బిజినెస్‌లో సుఖంగా గడిపారు. అమ్మాయి చదువుకోసం రెండేళ్ళు హైద్రాబాద్ వచ్చారు. అప్పటికే చాలా దేశాలు తిరిగి రావటం జరిగింది.

బెజవాడ–హైద్రాబాద్ మధ్య సంచారం. తిరిగి విజయవాడ రావటం జరిగింది. కొన్నాళ్ళు రాజకీయాలు. మహిపాల్‌రెడ్డి, బి.ఏ.రెడ్డి, భవనం వెంకట్రామ్, వసంత నాగేశ్వరరావు, పాలడగు వెంకట్రావు, వడ్డే శోభనాద్రి, మండలి బుద్ధప్రసాద్‌లతో సహచర్యం.

తర్వాత అమ్మాయి పెళ్ళి జరిగింది. అబ్బాయి చదువుకుంటున్నాడు. ఆ పిల్లడి కోసం ఆ తర్వాత హైద్రాబాద్ మకాం వచ్చారు. వచ్చాక కళాజ్యోతి వారి 'మిసిమి' మాసపత్రిక సంపాదక బాధ్యత తీసుకున్నారు. ఇప్పటికీ అదే వ్యాపకం.

మిసిమి సంపాదకుడయ్యాక, ఎన్నో వ్యాసాలు, సంపాదకీయాలు రాశారు అశ్వినీ. పొయిట్రీ రాశారు. చాప్లిన్, కీట్స్, బైరన్, షెల్లీల బయోగ్రఫీలు అనువదించారు. తన రచనలు దరిదాపు పాతిక పుస్తకాలు ప్రచురించారు. ఎంతో సమర్ధవంతంగా మిసిమిని తీసుకొస్తున్నారు. ఎందరెందరో కొత్తవాళ్ళతో, కలం ముడిచేసిన వాళ్ళతో మిసిమిలో రాయిస్తున్నారు. ఇన్నిచేసినా తిరిగి కథలు రాయలేదు.

అశ్వినీ ఏ సిద్ధాంతపు చిలక్కొయ్యకి తన మేధని తగిలించలేదు. స్వతంత్ర జీవి. అలా అని విప్లవకారుడు కాదు. ప్రపంచంలో జరుగుతున్న అనేకానేక విషయాల్ని గ్రహించి, తనదైన పద్ధతిలో విశ్లేషించుకుని సహజంగా జీవిస్తాడు.

ఎవరికేనా తలవంచటం, ఏదైనా యాచించటం గిట్టనివాడు. అందరితో కలుస్తాడు. వందలమంది పరిచయస్తులు, చాలామంది సన్నిహితులు, స్నేహితులు ఉన్నారు. ఆయనకే తెలియని అభిమానులెందరో – ఎక్కడైనా గుర్తుపట్టి పలకరిస్తే ఆశ్చర్యపోతాడు!

అటు పస్తులూ ఉండగలడు. ఇటు అత్యంత ఖరీదైన విందులూ ఎంజాయ్ చెయ్యగలడు. తామరాకుమీద నీటి బొట్టులాంటివాడు. ప్రపంచాన్ని ప్రేమించాడు. ఎందరినుంచో ఎంతో ప్రేమ పొందాడు. మూడు, నాలుగుసార్లు విస్తృతంగా ప్రపంచదేశాలు చాలా తిరిగాడు. ప్రపంచ సాహిత్యం చాలా చదివాడు. మీరు నమ్మరు – రోల్స్‌రాయిస్ నుంచి రోడ్డు రోలర్ వరకూ నడిపాడు!

వివిధ ప్రదేశాలు చూడటం, పలురంగాల అనుభవం, పలు కళల్లో అభినివేశం అశ్వినీని ఒక విభిన్న వ్యక్తిగా తీర్చిదిద్దాయి.

కార్యసాధనా, పరిస్థితులని సర్దుబాటు చేసుకోవటం తప్ప, అశ్వినీ ఎప్పుడూ దిగులుపట్టం, టెన్షన్ తెచ్చుకోటం నేను చూళ్ళేదు.

మొన్నొకసారి ఫోన్ చేశాను. "ఏం చేస్తున్నారు – ఆదివారం కదా అన్నాను" – ఇప్పుడే కొద్దిగా అంట్లు వుంటే కడిగా. – ఆ తర్వాత ఏం చేద్దామా అని ఆలోచిస్తున్నా" అని నవ్వాడు.

దేన్నీ ఎక్కువగా ఆశించకపోతే, నిరాశ ఉండదన్నది అశ్వినీ నమ్మకం. తను భయస్థుడు కాదు. ధైర్యవంతుడు. చాలా ప్రాక్టికల్. కూతురు విశాఖలో కాపరం. హైద్రాబాద్‌లో కొడుకు, కోడలు, మనవరాలు ఉన్నారు. అయినా వాళ్ళకి తమ ఇబ్బంది ఉండకూడదని, సి.ఆర్. ఫౌండేషన్ హోమ్‌లో భార్యతో కలిసి ఉంటున్నాడు. ఆదివారాల్లో కొడుకు ఇంటికి వెళ్ళి వస్తారు అనన్యతో ఆడుకోవటానికి.. ఎంతటి ప్రాక్టికల్ అంటే తన మరణానంతర ఏర్పాట్లు చేసేశాడు. సాధారణంగా ఉండే మరణభయం లేదు. ఇటువంటి వ్యక్తి తిరిగి కథలు రాయటమే కాక, ఆటోబయోగ్రఫీ రాస్తే ఎందరికో ఉపయోగం అని నా గాఢ నమ్మకం.

రచయిత సెల్ : 9394738805



రాజాతో వోలేటి, అశ్విని,
శివారెడ్డి, జగన్నాథరావు, శ్రీకాంత్ శర్మ

# సం'భవాని'

ఉత్తమ పురుషలో అందరూ కథలు వ్రాయరు. దానివల్ల ఇబ్బందులూ, సబ్బందులూ ఉంటాయి. అయితే కొందరు ఉత్తమ పురుషలోనే బాగా వ్రాయగలుగుతారు. భావావేశం చిక్కబడి, ఘనీభవించి ఒత్తిడి తీవ్రతకు చిట్లి, పగిలి, పేలి రంగుల శకలాల అనంతాకాశమై విస్తరించుకున్న పుడు వికలమైన శకలాలను ఏరుకుంటూ, రంగుల్ని రసరూపాల్లో గుర్తుపడుతూ, నిరాకారాలకు ఆకారాల్ని ఆపాదించుకుంటూ, వసంతాల కలల రంగుల్ని అద్దుకుంటూ అబద్ధాలు చెప్పలేని అద్దాల అనలు హృదయాల్ని వెతుక్కుంటూ, ఆ ప్రయత్నంలో అప్రయత్నంగా స్ఫురించే కవిత్వాలు, తత్త్వాలు, దారాల్లేకుండా అల్లబడ్డ హారాలై, మారుతాల రుతాల్లో కొట్టుకుపోయి ఏ పదపీఠాన అర్పితమో!

అంతరంగ మథనానికి వ్యధార్తి రూపం ఇవ్వాలంటే కవితా సతి చేలాంచలాల కోసం తడువుకోక తప్పదు. భావం క్లిష్టమైనప్పుడు భాష చిక్కబడి కవితారూపం తీసుకుంటుంది. జీవితం సంచలనాత్మక సంఘటనల సమాహారమైనప్పుడు జీవితంలో అన్నీ తొందరగా జరిగిపోతున్న భావన కలుగుతుంది. ప్రేమైకజీవితానికి మరీను. ప్రేమ ఒక తత్త్వంగా జీవితాన్ని ఆవరించుకున్నప్పుడు ఇంకాను. మొదటి అనాటమీ క్లాసులో తొట్టెలో ఫార్మాల్డిహైడ్ ద్రవంలో తన రహస్యాలను కనుక్కోమని ఆహ్వానిస్తున్నట్టనిపించిన జీవరహిత శరీరం. ఎడిమా ఎఫెక్టుతో, హఠాత్తుగా, అనుకోకుండా బెజవాడ బారేజీమీద, కారు వెనుక సీట్లో, తన ఒళ్లో కళ్ల వెలుగు ఆరిపోయిన తన భర్త స్వరూపం. జాలంలాంటి కాలం తన ఋతు సమాహార హారాలతో జీవన వృక్షానికి మరల వసంత శోభను అద్దినపుడు, రసరంగుల హేల బేల హృదయాన్ని ఉక్కిరిబిక్కిరి చేసినపుడు, సాంత్వనతో హృదయ పీఠాన్ని జాజులతో రోజాలతో అలంకరించి అధినాథుని కోసం అనవరతం నిరీక్షణే జీవితం అయినప్పుడు...

అక్షరాల ఆలాపనల్లో అంతరంగ స్వరూపుణ్ణి గుర్తుపట్టే ప్రయత్నంలో. ఎప్పుడో... ఎక్కడో.. జాడల నీడల్ని వట్టుకుని, హృదయువ్పళ్లెంలో పంచభక్ష్యపరమాన్నాల ప్రేమవిందును అందుకోమని అర్థించినపుడు, అంతనిస్సంకోచంగా, నిర్మలంగా అందించిన అర్పణను అందుకోవాలంటే ఎంత ధైర్యంకావాలీ! అక్షరాల అక్షయ హృదయాన్ని ఆలంబనగా చేసుకుని ఆవలి హృదయాంతఃకరణను అర్థం చేసుకునే ప్రయత్నంలో, అక్షరాలే కాదు – ప్రకృతీ సహకరిస్తుంది.

Nature sympathises with man అన్నాడు కదా ప్రకృతి ఆరాధకుడు వర్డ్సువర్త్! జీవితంలో అన్నీ



రెడ్ బుల్

తొందరగా జరిగిపోయినట్టనిపించినా, అనుభూతుల ఆనందాల బరువును మోయవలసి వచ్చినప్పుడు, ఆనందాల సందోహాల సందేహాల్లో కాలం అడుగులు తడబడినపుడు వేగం ఆగిపోతుంది. ఆదివారం రావడానికి అంత ఆలస్యం! మరి! ప్రేమ ఆవరించిన కనుల్లోంచి ప్రియమైనవాళ్లని చూసినప్పుడు, అవతలివాళ్ల ప్రెజెంటేషన్ అలా ఉంచితే మన పెరసెప్షన్

ఓ రూపాన్నిచ్చుకుంటుంది. 'తన ప్రేమమూర్తిని కలిసిన మర్నాటి ఉదయం, ఎంత ఉల్లాసంగా ఉంది.. ముంగిట ముగ్గుల దగ్గర్నుంచి, తూర్పున బంగారు దుమ్మువరకు, లేమావి చిగుళ్ళు, మామిడి పిందెలు, లేని అతణ్ణి సృజించడానికీ... చుక్కల వెలుతురూ చివరికి దిగంతాన కాషాయ విషాదం – అన్ని ఆమె హృదయ సంక్షోభాన్ని ఆవిష్కరించేవే– రాని అతణ్ణి రప్పించడానికీ' ప్రేమ ప్రవాహపు పరవళ్లు సృజన శక్తులు విత్తనాన్ని ముంచెత్తి, ప్రతిసృష్టికి సంకేతించినపుడు వసంతం వెల్లివిరిస్తుంది! ఈ కథనంలో ఒక రహస్యం ఉంది మనం గమనిస్తే – రచయిత కథన సంకేతాలను ఎంతో మార్మికంగా ఆవిష్కరించారు. కథానాయిక భావుకురాలని మొదట వాక్యంలోనే సూచనలున్నాయి. అతని (శివ) జుత్తు పెరగదో, పెరగనివ్వడో, ఇది అతని 'న్యూరో' బాధకు సంకేతం. ఫార్మాల్డ్ హైడ్ తొట్టెలోని 'కట్టె' కథలోని విషాదానికి సంకేతం. ఆమె ప్రేమస్వరూపుడు 'దాదాపు నా వయస్సే. పల్చబడుతున్న జుట్టు' – ఇదీ అతని హెమటోమాకి సంకేతమే! కథనంలో మారుతున్న రుతువులన్నీ కథానాయిక మానసిక స్థితికి ప్రతిబింబాలే. కానీ, ప్రతి జీవిత కథకూ విధి తనదైన మలుపునూ, ముగింపునూ ఇస్తుంది. Hematoma Burr hole evacuation జీవితాన్ని హరిత లతానికుంజాల నుండి సమాధుల పెనం మీదికి విసిరేసినప్పుడు హృదయ దిగంతాలు కాషాయ దుఃఖంలో ముంచివేయబడతాయి. ప్రాణదీపాన్ని నిలపడం కోసం ప్రేమపాశాలు తెగిపోతాయి! జీవన వలయం మళ్లీ మొదటికొస్తుంది. "ప్రతి జీవితమూ భగవంతుడు స్వయంగా వ్రాసిన చిత్రమైన కథ" అన్నారెవరో! అవుననడానికీ, కాదనడానికీ మనమెవరం??

**– బి.వి. రామిరెడ్డి**

# నక్షత్ర కాంతి 'రజ్జు సర్ప భ్రాంతి'

ప్రొఫెసర్ పార్థసారధి

జీవితంలో అతి సరళమయిన విషయాలే అత్యంత అసాధారణ విషయాలవుతాయని పాలోకోయిలా 'పరుసవేది'లో చెప్పినట్లు, రజ్జు సర్ప భ్రాంతి పుస్తకాన్ని అశ్వినీకుమార్ నాకిచ్చి అభిప్రాయం తెలియజేయమన్నప్పుడు ఏదో సాధారణ పుస్తక అనువాదమని అనుకున్న నా భావం తలక్రిందులయింది. నక్షత్ర కాంతి వెలుగులో తడిసిపోయిన అనుభవంలాంటి అనిర్వచనీయమైన ఆనందాన్ని కల్గించింది. భావసౌందర్యం, భౌతిక విషయ అనుభూతి, సత్య చారిత్రక విశ్లేషణను తాత్విక స్రవంతుల ద్వారా కలగలపే ఇంద్రచాపాన్ని ఆవిష్కరించింది.

ప్రాక్పశ్చిమ జీవితానుభవాల ఆధారంగా భారతీయ ఆంగ్లరచయిత రాజారావు రచించిన 'ది సర్పెంట్ అండ్ ది రోప్' పుస్తకాన్ని అశ్వినీకుమార్ తెలుగులో 'రజ్జు సర్ప భ్రాంతి'గా మనకందించారు. ఇది అనువాదం కాదు. అనుసరణ అసలే కాదు. రాజారావు స్వచ్ఛంగా తెలుగులో రాసిన పుస్తకమనే భ్రాంతిని కల్గించి అశ్వినీకుమార్ పుస్తక నామకాన్ని పరిపుష్టం చేశారు. వివిధ సంస్కృతులతో పెనవేసుకున్న రాజారావు జీవితానుభవాల ఆధారంగా రచింపబడిన ఈ నవల భారతీయ తాత్వికచింతనా ధోరణి నుండి పాశ్చాత్య తాత్వికతను, పాశ్చాత్య తాత్విక పార్శ్వాల నుండి భారతీయ తత్వాన్ని జీవితాల ఆధారంగా దర్శించి, కథ రూపంలో మనముందుంచడం, సహజసిద్ధమైన మేధావులకు తప్ప ఇతరులకు సాధ్యం కాదు. సులభంగా తెలుగులో దానిని అందించడం విశ్వయాత్రికుడైనందువల్ల మాత్రమే అశ్వినీకుమార్ చేయగలిగారు. నేను వెలిబుస్తున్న అభిప్రాయాలు తెలుగు పుస్తకం చదవడం ద్వారా మాత్రమేనని గుర్తుంచుకోవాలి.

## మతం - మనోవికాసం

ఉపనిషత్తులసారమైన బ్రహ్మజ్ఞానాన్ని, వైరుధ్యాన్ని అంగీకరించని శంకరుడు గోవిందపాద ఆచార్యుని ముందు వెల్లడించిన చిదానందరూప అద్వైతాన్ని, జ్ఞానవైరాగ్య సిద్ధికోసం శంకరప్రాణ వల్లభి అయిన అన్నపూర్ణను ఆరాధించడం, జ్ఞానముక్తి సాధన కోసం కాళభైరవం భజే అంటూ మంత్రోచ్చారణ చేయటం, ఏసు దైవరూపం తప్ప మానవ శరీరం అనటం భ్రాంతి అని చెప్పే డొసిటిజం, ప్రకృతి అంతా దైవసృష్టి తప్ప దేవుడు ఈ ప్రకృతిలో భాగం కాదనే క్యాథలిక్కులు, భౌతిక ప్రపంచంలో ఉన్న భూమి, సంపద, మతకర్మలు, మతాధిపతులు అంతా పాపకూపమే అనే దివ్యజ్ఞానులు కాథర్లు, ప్రతి మనిషిలో దేవుడు అంతర్గతంగా ఉంటాడు కాబట్టి ప్రార్థనాకూటములుకాక నిశ్శబ్ద ప్రార్థనలు జరుపుకోవాలనే వరమకాంతులు క్యాకర్లు, మతకర్మలు, సంస్కారాలన్నీ ఏసుచేతే స్థాపించబడ్డా యనే ప్రొటెస్టెంట్లు, ఒక శతాబ్ద కాలంలో ఒక్క హత్యానేరం కూడా ఆరోపించబడని నిష్ఠ నైతికతగల పార్సీలు, సృష్టిలో అన్ని నశిస్తాయి కాని జ్ఞానానికి పునర్భవం లేదు, అన్వేషణ ముగుస్తుంది, అదే సత్యం అని చెప్పిన బౌద్ధం, అష్ట సహస్రిక ప్రజ్ఞా పారమిత సూత్ర ఆధారిత జ్ఞానమార్గం బోధించే మహాయానం, శాక్యమునిచే చెప్పబడినట్లు చేసే రహస్య, మంత్ర, తంత్రాలతో కూడిన వజ్రయానం, నిరాడంబరత్వం, ఓపిక, దయ సామరస్యాలతో ప్రతి వ్యక్తి తనను తాను సంస్కరించుకోవాలనే టావోయిజం, చైనీయుల బుద్ధిజంగా పిలువబడే జెనిజం, క్రైస్తవం - బౌద్ధం - తావోయిజంలను పోలిన మనికేయిజం, కుళ్లి కృశించి నశించిపోయే భౌతిక ప్రపంచాన్ని శాశ్వతం చేయాలని ప్రయత్నించిన అరవిందుడు - జ్ఞానప్రకాశ ధ్యానంలో ఉన్న బోధిసత్వుని రూపంలో మనల్ని ఈ పుస్తకంలో పలకరిస్తుంటారు.

ఈ సంఘర్షణ ఘోష అంతా జీవనసూత్రం గురించే.

## స్త్రీ - ప్రేమ

జ్ఞానమధుపాశమే ప్రేమ. దానిని తెలుసుకోవడంలోనే మాధుర్యం ఉంది. అదే స్త్రీమూర్తి. స్త్రీని పూజించడమంటే ప్రపంచాన్ని పొందటమే. ప్రేమ అంటే ఇవ్వడం. బంధమే ఆడవారి గమ్యం. మగవానికి స్త్రీయే సారాంశం. స్త్రీత్వ వ్యక్తీకరణే అతని అస్తిత్వం. ఒకరు లేకపోతే మరొకరికి అర్థమే ఉం డదు. స్త్రీలో విశేషమేమిటంటే ఉన్నప్పుడు మన కంతగా ఉన్నట్టుండదు. ఆమె లేకపోతే అంతా వెలితి, శూన్యం. స్త్రీ సేవలోని 'సేద' బాధలున్న పురుషునికి ఒక వరం. ఓ కరస్పర్శ. ఓ కంటిచూపు, కరుణ చూపడం, కోటు అందివ్వడం, పడిపోతుంటే చేయి అందివ్వటం, ఇవన్నీ కష్టంలో ఉన్న మగవానికి ఎంత ఊరట కలిగిస్తాయి. ప్రేమ ఎప్పుడూ యౌవనంలో ఉంటుంది. ప్రేమ ఏమీ అడగదు, మాట్లాడదు. ఆ విశాల నేత్రాలు ఏవో చీకట్లను దాస్తుంటాయి. మరోజన్మ రహస్యంలా మార్మికంగా ఉంటాయి.

భారతీయులు స్త్రీలకు అందమైన పేర్లు పెడతారు. మాళవిక, సరోజ, శకుంతల, అవంతిక - అన్నీ పూలే. వీరి ముందు పురుషులు మోకరిల్ల వలసిందే. ఆదిమ మానవులు తమ నేలను పంటకు సిద్ధపరిచేటప్పుడు స్త్రీ ఋతురక్తాన్ని సమర్పించేవారు. ఇప్పటికీ కొన్ని జాతులలో ఈ ఆచారం ఉంది. జీవితమంటే స్త్రీమూర్తి. మగవాడు ఈ ప్రపంచానికి చెందడు. ఈ భూమి మీద అపరిచితుడు. మగ వాళ్లంతా యాత్రికులే! ప్రపంచానికి పరిచయంలేని తీర్థయాత్రికులే. ఆడవారు ప్రపంచాన్ని సృష్టిస్తారు. ప్రేమ పొత్తిళ్లతో లాలిస్తారు.

స్త్రీ దుఃఖం మగవాని అశక్తత, షండత. స్త్రీ దుఃఖానికి కారణం మగవాని నపుంసకత్వమే. మగవాళ్లు చిన్నపిల్లలకంటే బలహీనులే. స్త్రీ ఎంతటివాడినైనా మగసిరి దోచేసి సముద్రంలోకి తోయగలదు. అది ఆమె భౌతిక శక్తి. స్త్రీ పురుషులు ఒకటైతేనే ఈ ప్రపంచం జన్మిస్తుంది. బిడ్డ జన్మించ డమంటే ప్రపంచాన్ని సృష్టించడమే. పునరుత్పత్తిని నిరాకరించిన మతాలు నిర్వాణం చెందాయి.

ఈ పుస్తకం అలా మనల్ని ప్రేమ పొత్తిళ్ళతో లాలిస్తుంది.

## దుఃఖం - సత్యదర్శనం

సృష్టిలోని విషాదమే దుఃఖం. బాధాకరమైన బాధలోని బాధ. జీవితం అంటే ఒక బిందువు నుండి మరో మజిలీకి ప్రయాణించడమే. ఆ జ్ఞానం, ఎరుక కలిగి ఉండటమే ఆనందం. దీనంతటికీ మూలం దుఃఖం. మన అనుభవంలోని క్షణాలన్నీ కరిగి పోయేవే, మారిపోయేవే. అదీ విచారకరమే. జీవితం అంటే దుఃఖమే. ఆనందం ఎక్కడుంది? బంధ విముక్తులవడంలోనే దుఃఖనివారణ ఉంది. శబ్దం నిశ్శబ్దంలో నుండి జనిస్తుంది. నది ఖాళీ ప్రదేశం నుండి ఏర్పడుతుంది. నదిపై వారధి ఉంటుంది కాని నదికి వారధి ఉండదు. దుఃఖం ఒక నీడ లాంటిది. మనం ముందుకు చూడవచ్చు. అసలు వెలుగు రెండు కళ్ల నడుమ సదా నివసిస్తుంది. అది తెలుసుకోవడమే ఆనందం. దుఃఖితులంతా వంతెనల గురించి ఆలోచిస్తారు. వాటినే ప్రేమిస్తారు.

ఆనందం మరో తీరంలో ఉంది. ఈ వారధి ఆ తీరానికి దారి అనుకుంటారు. దుఃఖాన్ని అంగీకరించినప్పుడే సత్యదర్శనం జరుగుతుంది. దుఃఖంలోనే శరీరం పునీతమవుతుంది. నిశ్శబ్దం నుండే కదా శబ్దం, సంగీతం ఉద్భవించేది.

మనం చూసే స్థితి నుండి సత్యం కనిపిస్తుంది. అసంభవమైనది అందంగా కనిపిస్తుంది. మన మూలాలు మనల్ని వదలవు. మతం సహజమైనదే. మనోవికాసమైనదే. ఒక అభివ్యక్తం. మౌఢ్యం కూడా. కానీ దీనిలో చాలా శక్తి ఉంటుంది. ఆ శక్తి అసాధ్యాన్ని సాధిస్తున్న భ్రమ కలిగిస్తుంది. పడిపోతామనే భయం లేకుండా కొండలు ఎక్కిస్తుంది. కాని సత్యం చాలా సాధారణంగా, సహజంగా ఉంటుంది. నీవేమీ పొందలేవు అన్నప్పుడు నీకు సత్యమంటే ఏమిటో తెలుస్తుంది. నిన్ను నీవు గుర్తించటమే సత్యం. నీ జీవితంలోకి నీవు చూడగలగాలి. వివాహం కాని, మాతృత్వం కాని, బాధకాని, ప్రేమ పాశం కాని, ప్రేమ విజయం కాని ఇవన్నీ నిన్ను నీలోకి నడిపేవే. ఈ మునకలన్నీ గంగలో ముంచి తేల్చేవే, ముడులన్నీ విడిపోవలసిందే. సత్యానికి చరిత్ర ఉండదు. నిరంతరతే. ఈ సత్యదర్శనాన్ని ఈ పుస్తకంలోని ప్రతి అధ్యాయం కలిగిస్తుంది.

## జ్ఞాన సౌందర్యం

మనిషి ఆనందంగా ఉన్నప్పుడు అతని సౌందర్యాన్ని చూడలేం. బాధలో ముఖం మీద ముడుతలు చూసినప్పుడు అసలైన అంతఃసౌందర్యం గమనించవచ్చు. శిలువ మీద ఉన్న క్రీస్తు ముఖంలో ఉన్న వేదనలోని వెలుగు ఆయన గలీలికి బోధించి నపుడు కనపడదు. చెడు చాలా మనోహరంగా ఉంటుంది. ఆలోచనను అధిగమించడం అసాధ్యం. దానిని దాని నేపథ్యంలో మాత్రమే విలీనం చేయగలం. దుష్టత్వాన్ని నాశనం చేయలేము కాని అది ఏ రూపంలో ఆవిర్భవించిందో దానిలోనే విలీనం చేయగలం.

తర్కానికి అతీతమైంది సత్యం. సత్యాన్ని గీటురాయిగా తీసుకున్నప్పుడు ఎవరి పక్షం వహిస్తామనే సందేహం రాదు. యోధుడైన కర్ణుడు, భీరువైన ఉత్తరుడు ఇద్దరూ మహాభారతంలో ఉన్నారు. సత్యం కఠినమైనది కాదు. అత్యంత సులభమైనది కూడా కావచ్చు. మనం మతంతో మిళితం కావడం ద్వారా పవిత్రం కాలేము. కాని పవిత్రంగా మారాలి. పవిత్రత ఉంటే అదే నువ్వు. అదే ఇందులోని తిరకాసు – మెలిక. ఇక్కడ సహజ జ్ఞానం ముఖ్యం. క్రైస్తవము, ఇస్లాం కూడా ఈ తిరకాసును అధిగమించలేకపోయాయి. హైందవం పరిష్కరించలేని అంశాలకు జవాబు ఇచ్చిన బౌద్ధం, బౌద్ధాన్ని వ్యతిరేకించిన హిందూ మతం బౌద్ధ నైతికతను నిర్వీర్యం చేసి, దానిని తనలో లీనం చేసుకుంది. బౌద్ధ మహాయానం వేదాంతంగా మారిపోయింది. తాంత్రిక, మాంత్రిక పద్ధతులను ఆకళింపు చేసుకున్న వజ్రయానం మరో రూపం తీసుకుని శాక్యముని బోధనలపైనే మీమాంసను కల్పించింది. క్రైస్తవంలోని పరమ కాంతులు, దివ్యజ్ఞానులవంటి కాథార్లు, క్వేకర్లను అంతం చేయబోయిన క్యాథలిజం ప్రొటెస్టంట్లను ఆపలేకపోయింది. ఆదర్శవంతులు ధైర్యవంతులుగా ఫ్రెంచి ప్రజ మారాలని కోరుకున్న హెన్రీ IV క్యాథలిక్కు నుండి ప్రొటెస్టంటుగా మారి, ప్రొటెస్టంట్లంతా వడ్డీ వ్యాపారులగా మారడాన్ని చూసి సహించలేక తిరిగి క్యాథలిక్‌గా మారిపోయాడు. మనలోని మంచితనమే దేవుడు. మంచి అనేది సత్యం. సత్యమంటే అంతరంతరం. దైవభావన – సత్యభావన. భగవద్గీత చెప్పినట్లు అన్ని మార్గాలు అనంత సత్యంలోకే దారితీస్తాయి. మనిషి శారీరక మానసిక పవిత్రత కోసం కాదు తపించవలసింది. తనే పవిత్రంగా మారిపోవాలి. తీపిని రుచి చూడాలని అనుకోకూడదు. తీపి తీపిలో లేదు. నీవు తీపిగా మారిపో. అదే వేదాంతి దర్శనం. నీ జిహ్వలోనే తీపి తెలుసుకోవడం ఉంది. చక్కెర ఒకసారి నాలుకకు తాకితే అది తీయగా ఉందంటావు. అది మరణించినవాని నాలుకపై కాని నిద్రిస్తున్న పాప నోట్లో కాని పెట్టు. వాళ్లు లేచి తియ్యగా ఉందని చెప్పరు. అంటే నాలుక కదలాలి. లాలాజలం ఊరాలి. అందులో ఉన్న ఘన, ద్రవ పదార్థాలు నీ గొంతు చేరాలి. అప్పుడే అది తీపి అని తెలుస్తుంది. అది నీలోకి ప్రవేశించి నిన్ను అంతర్గతంగా ఆనందపరచినప్పుడే దాని రుచి తెలుస్తుంది. అందుకని తీపి నాలుక – జిహ్వ. పదార్థం ద్వారా అనుభవం వస్తుంది. నీ అనుభవంలో పదార్థం లేదు. అనుభవమే ఉంటుంది. అనుభవం పూర్తయిన తర్వాత జ్ఞానం ఉదయిస్తుంది. జ్ఞానంలో ఏ పదార్థం ఉండదు. అలాంటప్పుడు ఈ జ్ఞానం ఎవరిదని నేను అనవచ్చు. అంటే నాకు జ్ఞానం ఉందని నాకు తెలుస్తూ ఉంటుంది. అంటే జ్ఞానం ద్వారా జ్ఞానం కలుగుతుంది. చక్కెర తీయగా ఉండదు. తీపే చక్కెర.

అశ్వినీకుమార్ మనిషి కాదు. మనిషే అశ్వినీకుమార్. ఈ మధుర భౌతిక భావాన్ని పుస్తకంలో దర్శించగలం.

## గురువు

విద్యాలయాలు దాతల దానాలతోకాక విద్యార్థుల జ్ఞానతృష్ణతో, మనిషి జిజ్ఞాసతో వెలుగుతుంటాయి. గురువులు జ్ఞానజ్యోతి వెలిగే చంద్రునిలాగా ప్రపంచాన్ని మరింత జ్ఞానవంతం చేస్తుంటారు. కామ్ నదిపై క్లార్‌హాల్ నుంచి వంతెన కట్టాలని ఒక అభ్యర్థనను సాధువులు పంపారు. నది రెండోప్రక్కన ఉన్న పచ్చికబయలులో గుర్రాలు గడ్డి మేయడానికి ఉపయోగపడుతుందని. తదనంతరకాలంలో జిజ్ఞాసతో, జ్ఞానతృష్ణతో అది ప్రపంచ మేటి విశ్వవిద్యాలయంగా రూపాంతరం చెందింది కేంబ్రిడ్జి యూనివర్శిటీ (కామ్+బ్రిడ్జి) Cambridge!

గురువు జననమరణాల శృంఖలాన్ని అంతమొందిస్తాడు. ఒక యాజ్ఞవల్క్యుడు – ఒక నాగార్జునుడు – ఒక పీటర్ ఎబెలార్డ్. విషయ విజ్ఞానాన్ని చూడగలిగే చక్షువును తేజోవంతం చేస్తాడు. మానవ పరిణామ క్రమంలో నాగరికత, అది ప్యూరిస్ట్ లేక ప్రొటెస్టెంట్, బౌద్ధం, జైనం ఇవన్నీ స్వీయనాశనానికే దారితీస్తాయి. నైతిక ప్రపంచం భౌతిక ప్రపంచ అస్తిత్వాన్ని తెలియజేస్తుంది.

ఈ ప్రపంచం సత్యమా – అసత్యమా – ఏదైనప్పటికీ సర్పమా – తాడా రెండింటి మధ్య మరొకటి లేదు. నీవు సర్పాన్ని అనుకుంటావు. కాని తాడు కావచ్చు. ఈ ప్రపంచం సత్యమా? భ్రమా? మనకు తెలిసింది కలా? నిజమా? ఈ భయంతోనే కలిగిన బాధకు దుఃఖిస్తావు.

భయంతో చూసే కళ్లకు పాము కనిపిస్తుంది. అది నీవే అనుకుంటావు. పారిపోయి అలసిపోయి పడిపోతావు. అప్పుడు గురువు దీపం తీసుకు వస్తాడు. నీకు మార్గం కనిపిస్తుంది. అది త్రాడు మాత్రమే అని చూపిస్తాడు. నీ కళ్లు నులుముకుని చూసి సర్పం ఎప్పుడూ లేదని తెలుసుకుంటావు. తాడును చూసి భ్రమపడి పామై, సర్పం కళ్ల నుండి తాడును చూస్తూ, తదనంతరం యోగిగా మారి, అదే స్వర్గం, అక్కడే రుషులు, అవతారాలు, దేవుళ్ళంతా కథానాయకులు అనుకుని బోధలు చేస్తావు. నీ యోగం సత్యవంతం కాదు. కేవలం తాడే పాములా కనిపించిన పాము కాదు, తాడే. ఈ ప్రపంచం ఒక దర్పణం.

అంతర్ముఖుడై తనను తాను తెలుసుకున్న ధీరుడు తనిక్కడే ఉన్నానని, ఎక్కడికీ వెళ్ళలేదని, వెళ్ళేందుకు ఏమీ లేదని గుర్తిస్తాడు. ఈ అందమైన సత్యాన్ని నీవు గుర్తించాలి. అప్పుడే నీకు నీవు తెలుస్తావు. 'ఎరుక' కలుగుతుంది. ఈ ప్రపంచం భౌతికమైనది, మానసికమైనదేకాక అంతకు మించినది.

సహజమైన అంతర్దృష్టి పరిశోధనా పరిశ్రమలో సహజంగా వృద్ధి చెందుతుంది. అప్పుడు ఏ గ్రంథాన్ని చూసినా మనకు కావలసిన విషయం ఏ పుటలో ఉంటుందో ఈ అంతర్దృష్టి దారిచూపుతుంది. అది తప్పకుండా ఆ ప్రాంతంలోనే ఉంటుంది. అనుభవ భారంతో అహంకారాన్ని కూడగట్టుకొని విశ్వవిద్యాలయాలలో పాతుకు పోయిన వానిని సంతృప్తి పరచడం చాలా కష్టసాధ్యం.

ఈ అనుభవాలన్నీ మనకు అనునిత్యం జరిగేవే. ఎన్నిసార్లు వాటిని తరచి చూస్తున్నాం. ఈ పుస్తకం ద్వారా మనోచక్షువు చైతన్యవంతమవుతుంది.

## కథ

కథాకాలం 1950. మైసూర్ రాష్ట్రంలోని హసన్ ప్రాంతంలోని హరిహరపుర అగ్రహారానికి చెందిన రామస్వామి హైదరాబాద్‌లో ఉన్నత విద్య అనంతరం ప్రభుత్వ ఉపకారవేతనంతో అల్బీజెన్సియన్ నాస్తికత (కాథార్లు)పై డాక్టరేట్ సిద్ధాంత వ్యాసం కోసం ఫ్రాన్స్ వెళతాడు.

హైందవ మత మూలాల పట్ల ప్రగాఢ అభినివేశం ఉన్న రామస్వామికి ఫ్రెంచి భాష, సంస్కృతి అంతా అపరిచితంగా ఉంటుంది. ఈ క్రమంలో తనకు పరిచయం అయిన ఫ్రెంచి వనిత మెదలినాను వివాహం చేసుకుంటాడు. ప్రతి విషయాన్ని తరచి చూసే లక్షణమున్న కథానాయకుడు భారతీయ తాత్విక కోణం నుండి అక్కడి మతాలు, సంస్కృతిని పరిశీలించి తన భావాలతో తనతో ఉన్న వివిధ మత దృక్పథాలున్న వారివారి ఆలోచనా విధానాలపై తీవ్ర ప్రభావం కలిగిస్తాడు. తండ్రి మరణంతో భార్యను ఫ్రాన్స్‌లోనే వదలి భారతదేశానికి తిరిగి వచ్చిన రామస్వామి వారణాసిలో తండ్రి శ్రాద్ధకర్మలను పూర్తిచేసి ఫ్రాన్స్ చేరుకున్న అనంతరం తనలో తెలియని అగాథం ఏర్పడుతోందని గుర్తిస్తాడు. మెదలీనాకు జన్మించిన ఇద్దరు పిల్లలు మరణించడం, ఆమెలో తెలియని క్రిస్టియన్ ప్రదేశం ఉన్నా తన కోసం వారిని విమర్శిస్తోందని, అలాగే తాను క్రిస్టియన్ కాలేకపోవడానికి ఏర్పడుతున్న సమస్యలను ఇతరులతో చర్చల ద్వారా మనకు వివరిస్తాడు. తన గురించి తనకు అంతర్దర్శనం అవుతున్న సమయంలో భారతదేశంలో పరిచయం అయి కేంబ్రిడ్జి వచ్చిన సావిత్రి పట్ల ఆకర్షితుడవుతాడు. తన వివాహం నిశ్చయమైనప్పటికీ, ఆ వ్యక్తిపట్ల తనకేమాత్రం ఇష్టంలేదని చెప్పి రామస్వామి పట్ల గాఢ ప్రేమను సావిత్రి వ్యక్తపరుస్తుంది. తమ వంశానుగతంగా కోడలికి ఇవ్వవలసిన కాలి మెట్టెలను సావిత్రికి ఇచ్చివేస్తాడు. ఆమెను విడిచి ఉండలేని ప్రేమ ఉన్నప్పటికీ, విరహంతో జ్వలిస్తాడు తప్ప, ఆమె ఎంతగా ప్రాధేయపడినా ఆమెకు దగ్గర కాలేకపోతాడు. సావిత్రి తన ఇష్టానికి వ్యతిరేకంగా ప్రతాప్‌ను వివాహం చేసుకుంటుంది.

ఇద్దరు పిల్లల మరణం, భర్తకు భౌతికంగా దగ్గరయినా, మానసికంగా దగ్గర కాలేకపోవడానికి గ్రహించిన మెదలీనా బౌద్ధంవైపు ఆకర్షితురాలై వజ్రయాన పద్ధతులు పాటించి, విరాగిగా భౌతిక ప్రపంచం నుండి, భర్త నుండి దూరమై విడాకులిస్తుంది. తాను ప్రేమించిన సావిత్రిని వదులుకున్న రామస్వామి, తన జీవిత గమనాన్ని, పరిశోధనా వ్యాసం కోసం చేస్తున్న కృషి సమయంలో వివిధ చింతనల ద్వారా విశ్లేషించుకుని మరొకరికి ఆనందం కల్పించడంలోనే ప్రేమ ఉందని భావించుకుని, తన వేదనలో ఆ ఆనందాన్ని గుర్తిస్తాడు. ఈ అంతర్మథనం నుండి బైటపడడానికి, అవసరమైన సత్యాన్వేషణకు మార్గం చూపకలిగేది గురువు మాత్రమేనని నిశ్చయించుకుని గురువు కోసం తిరువనంతపురంవైపు దృష్టి సారిస్తాడు.

వారణాసిలో మొదలైన కథ పారిస్, లండన్‌ల మీదుగా తిరువనంతపురం వైపు తిరుగుతుంది. సంక్షిప్తంగా కథ ఇది అయినప్పటికీ, కథనంలో కీలకమైనవి తాత్విక చర్చలు, మతప్రభావ వాదోపవాదాలు, ఉపకథలు, వేదాంత దర్శనాలు, స్థలప్రాధాన్యతలు, ఉపనిషత్తులు ఇతర గ్రంథాలను సులభ సాధ్యంగా మార్చి మనముందుంచుతాయి. పర్వతం పైనుండి దేనినో చూడటంగాక మనలోని పర్వతాన్ని గుర్తింపజేసే ప్రయత్నం ఆశ్చర్యకరంగా, సులభంగా, సంగ్రహంగా, సరళంగా ఉంటుంది. హిట్లర్, స్టాలిన్, హెన్రీ, నెపోలియన్‌వంటి 'సూపర్ మ్యాన్' సిద్ధాంతం మానవాళికి మేలు చేయలేదని చెప్పిన రామస్వామి సాధారణ మానవులలాగే బాధ, వేదన, దుఃఖం, విరహం, ఆనందం అన్నింటినీ అనుభవిస్తూ తాత్విక విశ్లేషణ ద్వారా తన జ్ఞానసిద్ధి కోసం కృషి చేస్తాడు.

శంకరుని అద్వైత భావనలను రాధాకృష్ణుల ప్రేమ స్పందనలతోను, రాజపుత్ర కన్య మీరా, కృష్ణుణ్ణి రాథోడ్ రూపంలోనే చూస్తుందనే భౌతిక పదార్థ చైతన్యాన్ని పంచదళదీప కాంతిలా వెలువరించిన పవిత్ర భావవ్యక్తీకరణ – రచయితకు భాషపై, భావంపై, తత్వంపై ఉన్న పట్టు, పరిణతిని తెలియపరుస్తుంది. ఈ పుస్తకం తెలుగులో రావటం తెలుగు పాఠకుల అదృష్టం. అశ్వినీకుమార్ కృషి చిరస్మరణీయం.

* * *

*పవిత్ర భిక్షాపాత్ర (Holy grail) వెదజల్లే కాంతి నోట్రడామ్ చర్చిని వెలుగుతో నింపుతుంది.*

*అస్థికలు నిక్షిప్త సంపదగా మారిన భారతదేశంలో ఎండ వెలుగు తగ్గిన తర్వాత అస్థికల కాంతి అక్కడ ప్రకాశిస్తుంది.*

* * *

*అదిగో హరిశ్చంద్ర ఘాట్ మెట్ల మీద కూర్చున్నది ఎవరు? ఆ ప్రక్కన మూట ఏమిటి?*

*అమ్మా గంగమ్మ తల్లీ – ఎందుకమ్మా మా పాపాలన్నీ నీవు మూటగట్టుకుంటావు?*

* * *

***అన్నపూర్ణే – సదాపూర్ణే / శంకర ప్రాణవల్లభే***

* * *

***శోక, మోహ, లోభ, దైన్య, కోప, తాప నాశనం కాశికాపురాధినాథ కాలభైరవం భజే***

"నేను మంచి సమాధానాల కోసం కాక మంచి ప్రశ్నల కోసం వెతుకుతాను" పాలోకోయిలా

ఈ పుస్తకంలోని ప్రశ్నలు, సమాధానాలతోపాటు మనను వెంటాడి వేధిస్తాయి. తిరిగి ప్రశ్నలను సంధిస్తాయి.

**– రచయిత సెల్ : 9000438090**




# ఏరియల్‌పై స్పందన

ఇంగ్లీషు తెలియని నాకు షెల్లీని చదివే భాగ్యం కల్గించినందుకు పరి పరిదండాలు. రాత్రి 7 గంటలకు మొదలు పెట్టి ఇప్పుడే పూర్తి చేశాను. కళ్ళుతడుస్తున్నాయి... మాట్లాడలేను...

**– జూకంటి జగన్నాథం**

షెల్లీ గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. తను నమ్మిన సిద్ధాంతం కోసం ఎన్నో కష్టాల పాలయిన షెల్లీని కళ్ల ముందు ఆవిష్కరించారు. కన్నీరుతెప్పించారు. మీ రచనా శైలి అద్భుతం...

**– అంపశయ్య నవీన్**

ఇప్పుడే చదవటం పూర్తయింది. మీ వచనంలో ఏదో మాయ ఉంది.చదివిస్తుంది. మళ్లీ చదవ మంటుంది. పుస్తకం మూసిన తరువాత వెంబడిస్తుంది...

**– ముకుంద రామారావు**

మీ ఏరియల్ సౌందర్యం షెల్లీ వ్యక్తిత్వంలా కడిగిన ముత్యం.వచనం సరళం. స్కాట్ సెలయేటి ప్రవాహం...

**– బేతవోలు రామబ్రహ్మం**

ఏ గొప్ప జీవితమైనా, త్యాగమూర్తి జీవితమైనా ఈ తరానికి అవి పాతాలే...షెల్లీ జీవితం ఏరియల్ లో చదివితే అది ఎంతో స్ఫూర్తిదాయకం...షెల్లీ అనీ, ఏరియల్ అనీ లేకపోతే ఇది అచ్చ తెలుగు రచనే.

**– సి.యస్.రావు**

ఏరియల్ చదివాను – మీరు అది వ్రాయలేదు. ఒక శిల్పి చెక్కినట్లు ప్రతి అక్షరాన్ని, వాక్యాన్ని మలిచి అద్భుతమైన శిల్పాన్ని కళ్లముందు పెట్టారు. చివరికి ఆ కళ్ళు కూడా నీటిపొరతో నింపారు.

**– డా. అద్దంకి శ్రీనివాస్**

పూర్తిగా చదివి మిమ్మల్ని అభినందిస్తున్నాను. చాలా శ్రమ చేసినట్లు తెలుస్తుంది. అప్పటి యాంబియెన్సు మరింతగా వుంటే బాగుండేది. ఇక చివరిలో దుఃఖం ఆగలేదు.

**– ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు**

# వల్లభనేని అశ్వినీకుమార్ బయోడేటా.... కొన్ని పుస్తకాలు



వరల్డ్ ట్రేడ్ సెంటర్ ట్విన్ టవర్స్ పైన.... ఈస్ట్ రివర్‌పై బ్రిడ్జిలు, దూరంగా సెంట్రల్ పార్క్, ఆ వెనుక బ్రాంక్స్







































అచ్చయిన మొదటి కథ : అమాహ
పుట్టిన తేదీ : *27 మే*
తల్లిదండ్రులు :
సీతా మహాలక్ష్మి–సింహాద్రి అప్పారావు
భార్య : *జయంతి*
అమ్మాయి : *కవిత*
అల్లుడు : *సతీష్*
మనుమడు : *అంకిత్*
అబ్బాయి : *కళ్యాణ్*
కోడలు : *అర్చన మీనన్*
మనుమరాలు : *అనన్య*
ఇష్టమైన పనులు : *సంగీతం వినడం, స్నేహితులతో సత్సంగం,*
ఇష్టం లేని పని : *ఇంకొకర్ని నొప్పించటం*
రచనలు : *అమాహ,*
*దూరతీరాలలో (ట్రావెలోగ్), అంతర్వీక్షణం (వ్యాసాలు),*
*'సిద్ధార్థ' తెలుగు సేత,*
*'ప్రముఖులతో పదినిమిషాలు',*
*ఓ ఖైదీ వీరగాథ, ఎడోనిస్ (ఎలిజీ),*
*కీట్స్ జీవిత కథ,*
*చార్లీచాప్లిన్ నా కథ,*
*ఏరియల్ (షెల్లీ – ప్రేమ విషాదం),*
*బైరన్ జీవిత కథ,*
*అగాధం (De profundis) ఆస్కార్‌వైల్డ్,*
*దూరదర్శన్ ఇంటర్వ్యూలు,*
*ప్రొమిథియస్ అన్‌బౌండ్ (షెల్లి డ్రామా)*
***మిసిమి*** *సంపాదకీయాలు, మరిన్ని వ్యాసాలు*

స్వీయగతం (స్వగతాలు) :
*కవితలు...... నాలో నేను, అనంతరంగం*
పూర్తి కావలసిన కథలు :
*రోజ్‌మేరి, నయాగరా*

నవల : *దీవి*

నిరంతరం నన్ను వెన్నాడేవి :
*నా బాల్యం, నా యాత్రలు, నా పాత్రలు*

**ప్రస్తుతం 'మిసిమి' సంపాదకులుగా ఉన్న అశ్వినీకుమార్ సెల్: *93934 36969***



# గుండెలోతుల్లోని జ్ఞాపకాలకు కరుణ రసాత్మక రూపం

– ప్రొ. అనుమాండ్ల భూమయ్య

ఒక చెట్టు. చెట్టు మీద రెండు పక్షులు. రెంటికి మంచి మైత్రి. అందులో ఒకటి ఆ చెట్టు అనుభవిస్తుంది. రెండవ పక్షి ఆ తింటున్న పక్షిని చూస్తుంది. తాను తినటం లేదు. ఒక పక్షి జీవుడు. మరొక పక్షి ఈశ్వరుడు ఈ విషయం శ్వేతాశ్వతర ఉపనిషత్తులో తెలుపబడింది.

**"ద్వా సుపర్ణా సయుజా సఖాయ,**
**సమానం వృక్షం పరిషస్వజాతే**
**తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్య**
**నశ్నన్నన్యో అభిచాకశీతి"**

దేహం; దేహంలో ఆత్మ. నేను అని సాధారణంగా మనం వాడుతుండే నేను, దేహానికి సంబంధించే. దేహంలో ఉండే అంతరాత్మను 'నేను' అంటారని, ఇదే నిజమైన 'నే'నని వేదం చెబుతుంది.

**"పరిపూర్ణః పరుత్మాస్మిన్**
**దేహే విద్యాకారిణి**
**బుద్ధేః సాక్షితయా స్థిత్వా**
**స్ఫురన్నహమితీర్యతే"**

మన ఈ దేహంలో పరిపూర్ణుడైన పరమాత్మ, బుద్ధికి సాక్షీభూతుడై యుండి ప్రకాశిస్తున్నవాడు 'నేను' అని చెప్పబడుతున్నాడు.

భగవాన్ రమణ మహర్షి ఈ 'నేను'ను తెలుసుకొమ్మన్నాడు. 'నే' నెవరన్నది తెలుసుకోవటం ముఖ్యం. ఈ ఒక్క 'నేను' తెలిస్తే చాలు. అన్నీ తెలిసినట్టె అన్నారు. 'నేనెవరు?' అని ప్రశ్నించుకోవటాన్ని ఒక సాధనగా రమణులు తెలిపారు.

ఆత్మ, పరమాత్మ ఒక్కటే అని అద్వైత సిద్ధాంతాన్ని శంకరులు ప్రతిపాదించారు. రెండు వేరు వేరన్నారు మధ్వాచార్యులు. విశిష్టమైన దని విశిష్టాద్వైతాన్ని రామానుజాచార్యులు తెలిపారు.

ఈ విషయాలు, వల్లభనేని అశ్వినీకుమార్ గారి 'నాలో నేను' కవితా సంపుటిని చూసినపుడు మనసులో మెదిలాయి. ఇందులో, నీతో నేను, నాలో నువ్వు, నీలో నేను, నాలో నేను అనే విభాగాలున్నాయి. ఒకటి నేను. మరొకటి నీవు. నేను, నీవు అనే మాటల తో ఇలాంటి కవితలు సాగినాయి.

'మీతో...' అని చెప్పిన తన మాట నొకటి ఇట్లా చెప్పారు.

"సృజన ఏదైనా రసోత్పత్తి ప్రధానమే, అందునా కరుణకే పెద్దపీట" అని అన్నారు. 'ఏణ్వరసః కరుణ ఏవ' అన్న భవభూతి మాటను ఇది గుర్తు తెస్తుంది. 'రసాత్మకమైన వాక్యము కావ్య' మన్నాడు విశ్వనాథుడు. రస ప్రధానమైంది కవిత. తన ఈ కవితలు కరుణరసాత్మకములని ఈ కవి తెలియజేశాడు. ఈ కవితాలు కవి హృదయంలో పుట్టినవే. పూర్వకథ లాధారంగా రాసినవి కావు.

**"మీ ముందుంచిన వచన 'కవిత'లు**
**గుండెలోతుల్లోంచి, జ్ఞాపకాల**
**లోయల్లోంచి ఊరినవే."**

'నీ నుంచి నువ్వు....' అనే కవితా లోని ప్రారంభ వాక్యాల్లో శరీరం, హృదయం అని రెంటిని పేర్కొని ఈ "రెంటి నుంచి వెళ్లిపో" అంటాడు కవి. ఎక్కడికి వెళ్ళాలి? "నీ నుంచి నీలోకి, నువ్వు నుంచి నీలోకి". నీవు, నీలోపల అనే మాటలు రెండున్నాయి. క్రమక్రమంగా అంతరంగంలోకి ఆత్మలోనికి కదలి పొమ్మంటున్నాడు. సుఖాల అసత్యపు ఆనంద హేల నుంచి దుఃఖాల సంబద్ధపు అంధకారం నుంచి వెళ్ళిపో... నీ నుంచి నువ్వు!

నీ నుంచి నీలోకి.

సుఖ దుఃఖాల కతీతమైన చోటికి వెళ్ళి పొమ్మంటున్నాడు. ఈ చోటు హృదయాంతరంగం. సుఖదుఃఖాది ద్వంద్వాలకు గురి కాకుండ జీవించాలన్నది వేదాంతం.

**"జితాత్మనః ప్రశాంతస్య**
**పరమాత్మా సమాహితః**
**శీతోష్ణ సుఖ దుఃఖేషు**
**తథా మానావ మానయోః** (–గీత. 6–7)

సుఖం ఆనందాన్నిస్తుంది. కాని అది 'అసత్య' మైందంటాడు. దుఃఖం అంధకారం వంటిది. కాని, అది 'అసంబద్ధ' మైందంటాడు. అందు వల్ల ఈ సుఖదుఃఖాల నుండి దూరంగా – నీలోకి వెళ్ళుమని ఒక కారణాన్ని చూపిస్తున్నాడు కవి. అనుబంధాల బంధాల గుండె పంజరం వదలి" నీలోకి వెళ్ళు మంటున్నాడు. అందుకే కవి, మొదట "ఈ హృదయం ఓ ఉచ్చు" అని ప్రకటించాడు.

"రత్యనంతర నిర్వేదంపు నిట్టూర్పుల బారి నుంచి "అన్న మాట" శరీరానికి సంబంధించిన విషయం. అందుకే "ఈ శరీరం రొచ్చు" అని మొదట చెప్పాడు.

శరీరం, హృదయం నుంచి లోలోనికి ఎందుకు వెళ్ళాలో చెప్పిన కవి, ఈ బాహ్య ప్రపంచం నుంచి 'నీలోకి' వెళ్ళుమని చెప్పాడు –

"అర్థంకాని ఆర్థిక నిత్యావసర హత్యల నుంచి"
"ఎలక్షన్ మాస్క్ రాక్షసి రాజ్యం నుంచి"
"పేరుకున్న అజ్ఞానపు పర్వతాల నుంచి,
పరచుకొన్న ఎడారుల మత మౌఢ్యాల నుంచి"
"ప్రపంచ పేదరికపు గుండె గోడల నుంచి,
సిద్ధాంతాల అంతాల మొండి గోడలు దాటి",

ఆ తరువాత చెప్తున్నాడు, 'గతం నుంచి' వెళ్ళి పొమ్మంటున్నాడు. ఇక్కడ 'గతానికి' వెలుగు రవ్వలను పొదిగాడు కవి – "గుండె లోతుల్లో ఎప్పుడూ గళం విప్పే గతం నుంచి" అని. గత మెప్పుడూ వర్తమానం లోకి చొచ్చుక వచ్చి ఒక ఇబ్బంది పెడుతూనే ఉంటుంది.

ఆయా వాటి నుంచి 'నీలోకి నువ్వు' ఎట్లా కదిలి పోవాలో చెపుతున్నాడు –

**"ఎక్కడో – ఓ మబ్బు తునకలో చినుకులా, ఎక్కడో – ఓ లేత ఆకు కొసలో బిందువులా, ఏదో కొలనులో చిరుగాలికి కదిలే అలలా, ఎక్కడైనా, వెన్నెలతో కురిసే మంచు తడిలా మారిపో నీ నుంచి నీలోకి, నీలోకి నువ్వు."**

మబ్బులోని చినుకు, ఆకు కొస మీది నీటి బిందువు, గాలికి కదిలే కొలని నీటి అల, మంచుతడి – ఇలా ప్రకృతికి సంబంధించిన అంశాలు. ద్రవ రూపాలు. 'అనుబంధాల బంధాలు' మొదలైన వాటి నుండి విడి వడి లోలోనికి వెళ్ళటానికి ప్రకృతిలో మమేకం కావటాన్ని ఒక మార్గంగా చూపుతున్నాడు కవి. కృత్రిమమైన వాటి నుండి దూర మవటానికి ఆశ్రయింపదగింది సహజమైన ప్రకృతి మాత్రమే నంటున్నాడు. మనిషి తన సహజ స్థితిని పొందటానికి ప్రకృతి తోడ్పడు తుందంటున్నాడు. ఈ విషయాన్ని ఎకార్ట్‌టోలే తన మాటల్లో ఇట్లా అన్నాడు –

"We depend on nature not only for our physical survival. We also need nature to show us the way home, the way out of the prison of our minds"

(Stillness Speaks)

కవిత ముగింపులో చెప్పబడిన వాక్యాల్లో ప్రకృతిని దృశ్యమానం చేయటం గమనించ దగింది. "మబ్బు తునకలో చినుకు." చిన్ని మబ్బు. ఆ మబ్బులోంచి రాలి పడుతున్న ఒకే ఒక చినుకు. చినుకు వెనుక చినుకు కురియటం కాదు. మబ్బులోంచి రాలి పడుతున్న చినుకు మీద మన దృష్టిని నిలుపుతున్నాడు.

"లేత ఆకు కొసలో బిందువు" నీటి బిందువు ఒక్కటే. అది ఆకు కొసమీద నిలిచి ఉంది. ఏ క్షణంలో నైనా రాలి పడటానికి సిద్ధంగా ఉన్న నీటి బిందువు. 'ఆకు' అని ముందుకు సాగలేదు. లేత' ను వెనుక మోసుకొస్తున్నాడు.

అల అది కదిలే అల. అది గాలికి కదలుతుంది. అది ఏదో గాలి కాదు. 'చిరుగాలి'. ఈ అల ఒక 'కొలను' లోని దని చెప్తున్నాడు. ఎంత సుకుమార్యం. 'తడి' అది ఏ వర్షపు నీటి తడియో కాదు. 'మంచు' తడి. మంచు ఏ ఉదయ వేళనో కురిసింది కాదు. 'వెన్నెలతో' కురిసింది. ఎంతటి కళాత్మక చిత్రణ. ముగ్ధ మనోహరం. పరమ సుకుమార సుందర ప్రకృతి చిత్రణ ఇది. చినుకు, చిందులే, అల. నీటికి రూపముంది. తడికి ఆ విధమైన రూపం లేదు. రూపం లేని స్థితిని పొందితే తప్ప తాను తన లోలోనికి వెళ్ళి పోలేడన్నది కవి భావన.

'నాలో నువ్వు' విభాగంలోని ఒక కవిత 'ప్రకృతి', వెన్నెల, మల్లెలు ప్రకృతి సంబంధమైనవి, ఇవి ఆనందాన్నిస్తాయి. కాని, అవి వ్యక్తి మానసిక స్థితిని బట్టి మాత్రమే. మనసు బాగా లేనప్పుడు అవి ఆనందాన్నివ్వలేదు. ఇతడు ఆనందాన్ని పొందలేడు. మనసు బాగా లేకపోవటానికి కారణాలనేకం. వాటిలో ఒకటి, తనకు మిక్కిలి ఇష్టులైనవారు, ప్రాణంలో ప్రాణమైన వారు తనను కూడి ఉండ నప్పుడు. స్త్రీకి పురుషుడు, పురుషుడు స్త్రీకి మిక్కిలి ఇష్టమైన వారు. ప్రేయసీ ప్రియులు. ఇది శృంగార సంబంధమైన విషయం. కావ్యంలో వీరు నాయికా నాయకులుగా చెప్పబడుతుంటారు. వీరిరువురి ప్రేమను అధికం చేసేవి, ఒకరి పట్ల ఒకరికి ఆకర్షణను పెంచే కొన్నిటిలో వెన్నెల, మల్లెలు ఒకటి. వీటిని ఆలంకారికులు ఉద్దీపన విభావాలుగా పేర్కొంటున్నారు. నాయికా నాయకులు కలసి ఉన్నపుడు ఆనందాన్ని కలిగించే ఈ ఉద్దీపక విభావాలు వారు కలసి లేనపుడు, వియోగావస్థలో ఉన్నపుడు ఆనందాన్ని కలిగించలేవు. బాధను కలిగిస్తాయి. ఈ కవితలో కవి, నాయికా నాయకులు ఈ వియోగావస్థలో ఉన్నప్పటి స్థితిని వర్ణిస్తున్నాడు. కరుణ రసాత్మకాగానే కవి, కవితలు రాయదలచుకొన్నాడు కాబట్టి.

వెన్నెల కురుస్తుంది అందంగా కాని నీవు లేవు. పూచిన మల్లెలు పరిమళాలను వెదజల్లుతున్నాయి – మత్తెక్కిస్తున్నాయి. కాని నీవు నా ప్రక్కన లేవు. నా కానందంగా లేదంటున్నాడు –

"చల్లని ఈ రాత్రి వెన్నెల కురుస్తుంది."

ఈ వెన్నెల తన ప్రియురాలినే తలపింప జేస్తుంది. ఎందుకు? ఈ వెన్నెల తన ప్రియురాలు చిన్నగా నవ్వినట్లుగా ఉన్నందుకు. "నువ్వు నా చెంత చేరి చిరునవ్వులు ఒలక బోస్తావు చూడు – అలా!" అని అంటున్నాడు. ఈ వెన్నెల కురుస్తుండటాన్ని తన ప్రియురాలికి వర్ణించి చెపుతున్నట్లుగానే ఉంది ఈ



***పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ఆచార్య టి. కిషన్‌రావుతో...***

ఉపమానం. ఈ వెన్నెల నీవు నవ్వు తున్నట్లుగానే ఉంది 'చూడు' అంటున్నాడు. ఆ ప్రియురాలు తన చెంత నున్నట్లుగానే భావించి చెపుతున్నాడు.

"ఈ మల్లెల పరిమళాలు మత్తెక్కిస్తున్నాయి." అన్నది తన అనుభవ వర్ణన. తన ప్రియురాలి వెచ్చని ఊపిరిని అనుభవించిన వాడు. అది మత్తెక్కించేదిగా ఉంది. ఈ పరిమళం నీ 'వెచ్చని ఊపిరి'లా ఉందని వర్ణించి చెపుతున్నాడు. "నువ్వు నా ఎదపై వాలి గుసగుసలాడే వెచ్చని నీ ఊపిరిలా!" ఈ ఉపమానానికి ప్రేమ రంగు లలతు న్నాడు కవి. ఈ వెచ్చని ఊపిరి ఎప్పటిదో వివరిస్తున్నాడు. తన 'ఎదపై వాలి 'ఏదో' గుసగుసలు చెప్తున్నప్పటి ప్రియురాలి వెచ్చన ఊపిరులట. ఊపిరికి వెచ్చని పదం చేర్చి




సంయోగావస్థను భావింప చేస్తున్నాడు. కవి కావ్యారంభం లోనే చెప్పినట్లు, "గత జ్ఞాపకాల వెతలే" ఇవి.

వెన్నెల, మల్లెల నిట్లాచెప్పి, 'ఆహ్లాదకరర' మైన ప్రకృతినంతా ఒక్క మాటగా చెప్తున్నాడు." నా చుట్టూ ఉన్న ఈ ప్రకృతి ఎంతో ఆహ్లాదకరంగా విరబూనస్తాంది'' దీనికి ఒక ఉపమానాన్ని జోడిస్తున్నాడు కవి. అది "గత జ్ఞాపకమే" నన్ను చుట్టు కున్నప్పుడు ఆనందాతిరేకంతో నీవు విచ్చుకుంటావు అలా!" తనను చుట్టి పట్టుకోవటానికి – గాఢంగా దానికి, "ఆనందాతిరేకంతో" అని చెప్పి ఆ ప్రియురాలని ప్రత్యక్షం చేస్తున్నాడు. ఉపమాన ప్రయోగం ఈ కవితలోని ఒక సొగసు.

'నీలో నేను' విభాగం లోని మొదటి కవిత 'పిలుపు'. ఈ పిలుపు 'ప్రాణ మిత్రుని'ది. ఇది సూర్యుడుదయిస్తున్నప్పటిది. సూర్యోదయం వేళ ప్రకృతి ఎట్లా ఉందో వర్ణిస్తున్నాడు. 'తూరుపు వెలుగు'. ఈ వెలుగు చీకటిని తొలగిస్తుంది. రాత్రి కురిసిన మంచు బిందువుల మీద ఈ వెలుగు పడిందే. అవి రతనాలంటున్నాడు.

"రాత్రి కురిసిన మంచులో – ఎన్ని రతనాలు"? ఇదొక దృశ్యం. మరొకటి బారులుగా సాగి పోతున్న పక్షలు. ఇవి నదికి పోతున్నాయట. నదికి స్నానానికి వెళుతున్న వారిని తలపింప చేస్తున్నాడు. "నదికి వెళ్ళే పక్షులు బారులు బారులు". ఇవి "ముసుగు తీసిన ఆకాశంలో" కెళుతున్నాయన్నాడు. నిద్ర లేచిన వ్యక్తులను తలపిస్తుంది ఈ మాట. నిద్రలేచిన తరువాత చేయదగిన పని స్నానం. స్నానానంతరం భోజనం.

"పందిట్లో కంకులు తింటూ పిచ్చుకలు". పిచ్చుకల కోసం ఇంటి ముందర పందిట్లో వరి గొలుసులు వేయటం. తెలుగిండ్లలో కనిపించే దృశ్యం. ఇది భూతదయ, బయటి దృశ్యాలను

మొదట వర్ణించి, పిదప, ఇంట్లోకి వస్తున్నాడు కవి. ఇంటి వాతావరణ చిత్రణ. కాఫీ వాసన, రేడియోలో సన్నాయి పాట.

“ఇంట్లోనించి ఘాటయిన కమ్మని కాఫీ వాసన / రేడియోలో సన్నాయి నివేదన.” సన్నాయి పాట వింటూ కాఫీ సేవించటం. ఘాటయిన కమ్మని కాఫీ వాసనకు ఈ పాట క్రొత్త సువాసనలను అందుతున్నది. కాఫీ దేహానికి, పాట మనసుకు. రెండు మార్గాల్లో కలుగుతున్న ఆనందమిది. ఆ తరువాత జంట పక్షులను ప్రవేశపెట్టి దాంపత్య జీవితాన్ని స్ఫురింప జేస్తున్నాడు.

రెండు రామ చిలుకలు – బద్ధకంగా నిద్రలేచి – కాసేపు విలాసపు నడక!

ఇప్పుడు వినిపించింది ‘ప్రాణ మిత్రుని పిలుపు’ దూర తీరాల నుంచి. ఈ మిత్రుడు అతిథికి సూచన. ప్రకృతి, ఇల్లు, దంపతులు. వీరి భూత దయ. ఇటువంటి ఇంటికి రాబోతున్న ఒక అతిథి ఒక గృహస్థు జీవితాన్ని చిత్రిస్తున్న కవిత ఇది. రమణీయ దృశ్య చిత్రణ. ఇంతటిని తీసుకొని పోయి కవి, దు:ఖంలో ముంచి కరుణ రసాత్మకం చేస్తున్నాడు –

**“ఈ మౌన దు:ఖ మథనంలోంచి ఒకే ఒక అమృతాశ్రువు”**

పాల సముద్ర మథనం లోంచి అమృత కలశం వెలువడిన కథాంశాన్ని ఎత్తు కున్నాడు. ఇక్కడ ఈ కవిది దు:ఖ సముద్రం. మౌన దు:ఖ సముద్రం. వెలువడింది కన్నీటి బిందువు. ‘అమృతాశ్రువు’ అమృతం వంటి అశ్రువు. అమరమైన అశ్రువు. తొలగిపోని దు:ఖాన్ని సూచిస్తున్న మాట. గుండె లోతుల్లోంచి, జ్ఞాపకాల లోయల్లోంచి ఊరిన కవిత ఇది. కరుణరసాత్మకం. ఈ అశ్రువును తనలోని ప్రేయసికి అంకితం చేస్తున్నాడు.

‘నాలో నేను’ లోని ఒక కవిత ‘ఇప్పుడు’. దు:ఖమే తప్ప సుఖమెరుగని తన స్థితికి అద్దం పడుతున్నాడు కవి.

**“సుఖ మొక గగన కుసమం దు:ఖం తీరని వ్యసనం”**

దు:ఖానికి కళారూపాన్నిస్తే అది ఆనందాన్నే ఇస్తుంది. పాత్రలు టీ.వీ.ల్లో ఏడుస్తుంటే ఆనందం. విషాదాన్ని ఆనందిస్తాం. ఏడుపు పాటల్నే పాడించు కొని వింటూ ఆనందిస్తాం. దు:ఖం రసస్థితిని పొందిన దశ ఇది. కాని, దు:ఖం తనకు కలిగితే మాత్రం దు:ఖమే. సుఖం లేదు. రెంటిని ఒక్క చోట కలిపి వర్ణిస్తున్నాడు. భేదాన్ని తెలియ జేస్తున్నాడు.

“పది మంది కూర్చుని, ఏడుపు పాటల్ని పాడించుకుంటూ సంతోషపడతాం” ఇది దు:ఖం రసస్థితిని పొందిన దశ.

**“ఇప్పుడు జీవితాలలో దు:ఖం పర్మనెంటు....**
**ఇప్పుడు బ్రతుకులో దు:ఖం ఓ విషాద గీతం!”**

మరి సుఖం గగన కుసుమం.

కరుణ రసానికి ఈ దు:ఖం స్థాయీభావం. ‘ఇప్పుడు’ తనకు మిగిలింది ఈ నిత్య దు:ఖమే బ్రతుకంతా విషాద గీతమే. నిత్య దు:ఖితునికి సుఖం “శూన్యంలో విరబూసే పారిజాతమే”.

‘యాత్ర’ అని ఒక కవిత ఉంది. ఇది వ్యక్తి యొక్క అంతిమ యాత్ర. చచ్చిన వాడిని నలుగురు మోస్తు శ్మశానంలోకి తీసుకు పోవటం. నీటి కుండకు మూడు చిల్లులు చేసి, ఆ పిదప చితికి నిప్పు పెట్టటం. కపాల మోక్ష మయేంత వరకు, ఆ మరణించిన వ్యక్తికి సంబంధించిన వారు ఆ శ్మశానంలోనే చితి జ్వాలలను చూస్తూ ఉండటం, ఆ పిదప ఇళ్ళకు పోయి కాస్త ఎంగిలి పడట మనే విషయాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు కవి. ఆ వాతావరణాన్ని భయం కొలిపే విధంగానే చిత్రించాడు –

**“దిగులుతో మబ్బులు నేలకు దిగినాయి**
**మందమైన మంచు తెరలు ముందు**
**దారి మూసినాయి.”**
**“ఇంకా ఊరు నిద్రలేవ లేదు**
**ఎక్కడా చప్పుడు లేదు**
**ప్రక్కగా గొల్లగూడెం పెడగా ఈత చెట్లు**
**పెరగని తాటి చెట్లు వల్లకాటికి కాపలా.”**

బ్రతుకు ఒక యాత్ర. పుట్టినప్పుడు మొదలైన మనిషి యాత్ర చచ్చి శ్మశానంలో కాలటంతో ముగుస్తుంది. ఈ మధ్య కాలంలో బ్రతుకులో ఎన్నో మలుపులు.

“ఎప్పుడో ఎక్కడో మొదలైన యాత్ర ఎన్ని మలుపులు, ఎన్ని మజిలీలు తిరిగి, ఆగి ఎన్ని అనుభూతులు – ఎన్ని అనుబంధాలు పెంచుకుని, తెంచుకుని, తనను మోయటానికే అన్నట్లు నలుగురిని కనిపెంచి.”

చితిలో కాలిపోతున్న శవాన్ని చూస్తున్నప్పుడు దు:ఖం కలిగినా ఏడుపు రాని స్థితిని వర్ణిస్తున్నాడు కవి.

**“అయ్యో, ఏడుపురాదే?**
**దు:ఖం గూడు కట్టిన గుండెల్లోంచి,**
**రక్తం చిందదే?**
**ఎర్రబారిన కన్నుల్లోంచి నీళ్ళు రాలవే?”**

దు:ఖాన్ని ప్రార్థిస్తున్నాడు. తనను దయ చూపుమని –

**“శోకమా! గుండె గూడు తడుముతున్నా కాస్త తలుపు తియ్యి**
**నీ చీకటి గూటిలో కాసేపు సేద తీరనీయి కాస్త తలుపుతీయి!**
**దు:ఖమా! దయచూపు”.**

దు:ఖానికి పతాకస్థాయి ఇది. దు:ఖంతో మొరపెట్టుకోవటం. గుండెలోతుల్లోని జ్ఞాపకాలకు కవి ఇస్తున్న కరుణ రసాత్మక రూపమిది.

ఇది వల్లభనేని అశ్వినీకుమార్ గారి ‘నాలో నేను’ కావ్యం చదివితే కలిగిన భావం. ❋

**రచయిత సెల్: 8897073999**

# అందరి వల్లభుడు ఈ అశ్వినీకుమారుడు

– *ఐ.వి. రామరాజు*



– ఐ.వి. రామరాజు

ఆసాంతం (అంతా) ప్రశాంతం, మరింత వసంతం! మన మంతా భ్రాంతి – కాదు కొంత విభ్రాంతి (పరవశత), జగత్ మిధ్య –కాదు మరో మనో విద్య యని తెలియాలంటే–మాయా బజార్ ఫర్ సేల్–2023 వెబ్ సిరీస్ –ఈ కాలపు చలన చిత్రపు మార్పు విన్యాసం కొంచెం భరించి, 1957–58 ‘మాయాబజారు’ చలనచిత్రంలో ‘శశికళ’గా ప్రసరించిన మహానటి సావిత్రి ‘అహ నా పెళ్ళి అట’ ఆట–పాటతో, విశ్వ నటచక్రవర్తి యస్.వి.ఆర్ వివాహ భోజనంబు రుచులతో– ‘క్విట్ ఇండియా’1942–మా నవ భారత్ స్వేచ్ఛా నాదానికి పదహారేళ్ళ యవ్వనపు భావాల అలలు ఆరంబం అన్నట్లుగా – అది మనం చదువు తున్న– అందీ అందని మనందరి – ఈ మినిమివల్లభుడు అశ్వినీ దేవతలాశీస్సులు కాబోలుగా, మన “వల్లభనేని అశ్వినీ కుమారుల” జీవనగమనం.

ఏ తరపు తారతమ్యాలు లేకుండా – అన్ని ప్రాంతాల తెనుగు కళా పదాల పదునును అయస్కాంతం లా హత్తుకొని,అక్షరాల మల్లెల మాటల మూటలను తన పదహారు–హొరు తనువు తరించిన– గుడివాడ మందుతున్న వేసవి కాలువ లో వదిలిన–ఓ ప్రౌఢత్త –పారిజాత పుష్పం (పారిజాతం కథలు– తరాల తీయని కాలపుకదిలే బాధలు)–ప్రతితరపు క్రొత్తనీటి కాలువ కెరటాలలో వయ్యారంగా ఎదురు వస్తూ ఉన్నట్లుగా తరింపజేస్తుంది.

ఆ మధ్య గూగుల్ గుండం (డూడుల్) లో ఓ సారి జారినపుడు– ‘జరీనాహష్మి’ (1936–2020) మన ఆలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయపు అమ్మాయి (దేశవిభజన రేఖలు తన చివరి శ్వాసవరకూ ఆగని కేకలుగావింటూ) మరియు ‘నందనూరి కృష్ణమూర్తి’ (1925–2018)– ఋషివ్యాలీ–శాంతినికేతన్ (జిడ్డు కృష్ణమూర్తి– విశ్వకవి రవీంద్రుల) రసమయపు చిత్తూరబ్బాయి పారిస్ ప్రథమ ఆర్ట్ వర్క్ షాప్ Atelier 17 లో నిత్య కళా సహోదరీ–దరులుగా అరువది వసంతాలు పరిమళించారు – స్వదేశాన్ని వదిలినా –విదేశీ గడ్డపై వాలని (విత్తువదలని) విహంగాలలా వీక్షిస్తూ తమ తమ ప్రవృత్తులే –

ఏదో వృత్తులుగా – న్యూయార్క్ పట్టణపు వీధులలో కొంచెం కళా క్రొవ్వుత్తులుగా వెలిగి తమ క్రొత్త ముద్రలను (with Innovative Drawing, printmaking, and sculptures) వదిలినారు.ఇద్దరూ తమ భారతీయత– అదే స్వదేశితనం వదలలేనితనం తమ అమెరికన్ చివరి గడియల జీవనరేఖలను గీచే వరకు కనబరచారు. ఇదంతా ఎందుకంటే – అశ్వినీ కుమారులు తమ రచనలలో స్వదేశాన్ని వదిలి వడులుపోతున్న భాగ్యుల–అభాగ్యుల వినపడని ప్రవాసుల గావుకేకలను వినిపించారు( నేను–వ్యాసకర్త కూడా ఒకప్పటి ప్రవాసపు పక్షిగా వాపు పడ్డవాడినే!).

ప్రవాసులుగా దేశాన్ని కాదు ,తను పుట్టి–పెరిగిన ఏ ప్రాంతం వదిలి మనుగడ అంటూ ఎంత ఎదిగినా (ఈ తరం మన హైదరబాద్ (ఏ ప్రాంతమైన) వాసులబ్రతుకుల కొట్టుకొన్న శిలువ మేకులు కూడా)– ఏదో లోపం గా ఒదగ వలసినదే! అశ్వినీ గారు జీవించి –రచించి జీవిస్తూ–తన చుట్టు వారిని ఆర్యపు అతిథేయిులుగా రుచింప గావిస్తున్నారు: 'అమాహ' లో కథానాయిక 'లీ'– తన రాని భర్త కోసం– ఎదురు చూపులు – మా అక్కను 19 సంవత్సారాల వయస్సు లో, 1981 లో – నిండు శకుంతలను చేసి ఊరు వదిలిన మా బావ ఇంకనూ రాలేదు– తనను వితంతువు గా ఈ నలభై ఏళ్ళు మేమెవరూ తలంచలేదుమా బావకై ఇంకా ఎదురు చూపులతో – అశ్వినీ గారి "అమాహ" భావం లా– ప్రోషిత భర్తృక తన భర్త కోసం ఎప్పుడూ ఎదురు చూసే భార్యగా, నుదుట బొట్టు కరిగిపోనీయకుండా 'శ్రీగరికపాటి' ప్రవచనపుల మనో ధైర్యపుప్రహరీ కాపుతో గోదారి కాటను కాలువ గట్టు వాకిట నుండి ఇప్పటికీ చూస్తూనే ఉంటుంది.

'చెరువు కథలో'– ఎంతటి అచ్చెరవు! వెన్నల రోజుల్లో వెలుగు విరగపూసేది, ఇళ్ళల్లో గుడ్డిదీపాలు ఏడుస్తూ పొగచూరేవి! – ఇది మా గోదారోళ్ళ వెటకారం, కాదు–మాదీ ఒకప్పటి కృష్ణాతీరమే కదా! చీమమండల లోతు పర్రలు–కొన్ని వందల ఎకరాలు గా–మైళ్ళ దూరానా చీకటిలో దాగున్న సముద్రపు ఘోష, అబ్బ! తలచుకొంటేనే అప్పటి తాటి చెట్లు రహదారికిటు–అటు,లెక్కపెట్టినా– లెక్క తప్పడం! ఇదే పకృతి అటు కొల్లేరు దాటి భీమవరం ఉప్పుటేరు దాటి ఉండవచ్చు! ఇప్పుడన్నీ చేపల–రొయ్యల చెరువుల వికృతి –కుళ్ళే!

అదిగో అవేకళ్ళు, అశ్వినీ గారి చెరువు కథలో ఓ కరిగిపోయే బాలుడు, ఓ పదహారు సీతక్క– ఓ ఇరువది వయస్సు పాలేరు కోటి గాడు – వీరితో 'ఫ్రాయిడ్'– 'జంగ్'– మధ్యన కుమారి' సెబీనాల' త్రయంగా తరాలుగా తెలియని ఆకలి –అవసరాల అవధానం వారితో అశ్వినీ గారు గావించారు. కథలో కోటిగాడు సీతక్కల వెచ్చని తెలియని కాషాయ–కషాయ–కసాయపు పరిస్థితులు – అచ్చు అరుంధతీ రాయ్ – గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్ ('రాహెల్/ ఈస్తా కవలలు', 'అమ్ము'– మధ్య పాలేరు 'వేలుతా' శవం) –ముప్పై ఏళ్ళు ముందే అశ్వినీ గారు గుడ్లవల్లేరు–చెరువు లో 'కొట్టాయం కుట్టి' కంటే ముందుగా ముంచి తెనుగున తేల్చినట్లుగా తలంపు వచ్చు!

అశ్వినీ కుమారుల రచనల్లో ఆంగ్ల కవుల అనువాదపు జీవిత చరిత్రలు ఎన్నిక మన అదృష్టం గా కొత్త కోణంలో ఆస్వాదించవచ్చు, ముఖ్యంగా 'భైరన్' జీవితం కాల భైరవుని కాంతి పుంజం లా ప్రజ్వలిస్తుంది, 'ఆస్కార్ వైల్డ్'ను చదివిన పిదప మన అగాధంలో నుండి ఇప్పుడిప్పుడే ఎక్కి బ్రతికనట్లుగా స్ఫురింప జేసి– సిద్దార్ధ్ నవలతో తెగిన వల నుండి బయటపడ్డ చేపలుగా మన జీవననదుల పై తిరిగి పయనిస్తాం.

'మిసిమి' ఎడిటర్‌గా నేను వ్యక్తిగతంగా అక్షరపు అర్హత లేకున్నా పలుసార్లు ఆయన ఆతిథ్యపు సమావేశాలలో పాల్గొనే అవకాశం దొరికింది. ముఖ్యంగా ముక్త వరపు పార్థసారధి గారు, కోడూరి పుల్లా రెడ్డి గారు ఆయన అనేకసాహిత్యపు సన్నిహితులంతా–మాలాంటి కొత్త వారికి కూడా చేసేస్తారు– మిత్రులంతగా! నిజం గా ఎవరి బాక్ గ్రౌండ్ చూడని ఇప్పుడే–ఇక్కడే నవ్వుతో పువ్వులా నడిచే దార్శినికుడు. నా 25 సం వయస్సులో తుమ్మపూడిలో ఓ నాలుగు సార్లు 'శ్రీ సంజీవదేవ్' గారిని దర్శించాను, అదే కాలం లో శ్రీమతి 'పపుల్ జయకర్' ను బొంబాయ్ లో కలసి జిడ్డు కృష్ణమూర్తి విశేషాలు పులకింతతో పంచుకొన్నాను ఆ మహాతల్లి – నేను ఓ సిమ్మెంట్ కర్మాగారపు కార్మికుని గా భావింపక తన ఐ.ఏ .యస్ సెక్రటరీ తో మర్యాద చేయిస్తూ తన మలబార్ హిల్ సుగంధపు సౌధం లో ఓ గంట గడిపే అవకాశయి కేవలం నా పోస్ట్ కార్డ్ లో కృష్ణాజి భావాల తలంపుకు ఇట్టే అనుమతి గా ఇచ్చేసింది. ఈ ఆండ్రాయిడ్ కాలం లో అదే అయస్కాంతపు ఆవేశపు అవకాశపు ఆకాశపు పై నుండి అన్నట్లు ఈ అశ్వనీకుమారులతో అప్పుడప్పుడు కలవడం నా కళావిహీనపు ఎడారి కనులకు ఆయన ఆశీస్సుల ఆక్సిజన్ అందించడంలా ఈ నిజాముల నగరంలో, ఓ వెన్నెలజాములా, మరల నాది ఓ నవాబు భోగవుపంటగా ప్రతి మిసిమి క్రొత్త నెలవంక కాంతులతో కనిపిస్తుంది.

కలకాలం క్రొత్త తెలుగువెలుగులా –అశ్వినీ కుమారుల పుష్కర సేవాయజ్ఞపు హోమం ఆరాధనతో ఆరంభించిన ఆ "ఆలపాటి రవీంద్రుల" కనుల కళాజ్యోతులుగా ప్రతినెల తెనుగునేల ఎల్లలన్నీ వీచి వికసించగలదని ఆకాంక్షిస్తూ– శ్రీ అశ్వినీ కుమారుడు– అందరి మదిలో వదిగే–వదలని ఓ ఏకైక వల్లభుడు/ప్రియుడు– వల్లభనేని అశ్వినీకుమారుడుగా–యువతరాలకు ఆదర్శప్రాయుడు.

***– ఐ.వి.రామరాజు, 9912644386***

## తెలుగు కథకు వెలుగు మలుపు

ఈ పారిజాతం కథలు ఇంతవరకూ తెలుగులో రాని అనుభవాల జీవిత శకలాలు. అంతేకాదు, ప్రపంచంలో ఎన్నో దేశాలలో సంచరించిన రచయిత సేకరించిన కథావస్తువులు, కథన శైలి, తెలుగు కథకు వెలుగు మలుపు తిప్పాయి. విదేశాల, ప్రదేశాల యాంబియన్స్‌ను ఎంత ఆథెంటిక్‌గా రూపుకట్టించారో అంతే నిర్దుష్టంగా పల్లెటూరి బ్రతుకులు, వ్యవసాయ వ్యవహారాలు, మానవ సంబంధాలు కథాతోరణాలుగా అందించారు. వీరి కథనంలో మ్యాజిక్ రియలిజం కూడా చోటు చేసుకుంది.

– అవసరాల రామకృష్ణారావు

(ఇండియా టుడే, తెలుగు)

" మీ కథాపారిజాతం ఓ మరీచిక. ఓ అందమైన ఆరాధన. పారిజాతం రాత్రి పూచి తెల్లవారేవరకూ చెట్టుమీద ఉండదు కదా! కథలన్నీ చదువుతూపోయాను.. దారి పొడవునా నవ పారిజాతాలే.. దాటుకుంటూ దాటుకుంటూ 'విపులాచ పృథ్వీ' దగ్గర ఆగాను. అది నాబోటివారి కథ కదా! అందుకని. 'మాలి' కదిలించింది. అందమైన హిమాలీ బొమ్మ గుండె తరుక్కుపోయింది. 'అమాహ'లోని ఎదురు చూపులు కలచివేసింది. 'భవాని' గురించి ఇంక చెప్పేదేముంది... నేను చూడ నోచని హాంకాంగ్, డాన్ ముయాంగ్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్ట్, థాయ్‌లాండ్‌లో బహొద్ధారామాలు, భూగర్భ రైలు, శాన్‌ఫ్రాన్సిస్కో మాన్‌మేడ్ ఫారెస్ట్‌లు, గోల్డెన్ గేట్ బ్రిడ్జి చూసి ఆనందించాను. మిమ్మిల్ని మనసారా అభినందిస్తున్నాను.

– దేవులపల్లి కృష్ణమూర్తి, నకిరేకల్

" పారిజాతం... చిన్నత్త పాత్ర ఎలా సృష్టించారు? ఇప్పటికీ మూడుసార్లు చదివాను. పారిజాతం నన్ను హాంట్ చేస్తోంది. వచన కవిత్వంలో కవిత్వం వెతుక్కోవలసివస్తున్న ఈ రోజుల్లో మీ వచనమంతా కవిత్వమే..."

– ప్రొ. వి.ఆర్. రాసాని

"... ఏరియల్ ఏకబిగిన చదివాను. మీరు షెల్లీని ఆవాహన చేసుకొని అద్భుతంగా తెలుగులో చెప్పారు. హృదయం ఆర్ద్రమైపోయింది, కన్నీరు తెప్పించింది.

– నారాయణ బాబు

(నాటక రచయిత)


డా. అవధానం రఘుకుమార్

# అశ్వినికుమార్ రచనలపై ఓ విహంగ వీక్షణం

– డా. అవధానం రఘుకుమార్

"గగనం గగనాకారం, సాగరస్సాగ రోపమః" అన్నాడట వాల్మీకి. ఆకాశాన్ని, సముద్రాన్ని వర్ణించుటకు ఉపమానాలు లేవు. అందుకే "ఆకాశం ఎలా వుంది?" అని అడిగితే అచ్చం ఆకాశంలానే వుంది అని, "సముద్రం ఎలా వుంది?" అంటే అచ్చం సముద్రంలా వుంది అని మాత్రమే చెప్పగలం. ''అనంతరంగం''లో ఆయనే ప్రతిపాదించినట్టుగా – "మనం అపరిచితులుగానే కలుద్దాం!" నా ఈ ఆలోచనలన్నీ తెలియని వ్యక్తి గురించి తెలియనట్టుగా రాసే ప్రయత్నం.

ఓ మూడేళ్ళ క్రితం అశ్వినీకుమార్ గారు నాతో ఫోన్లో మాట్లాడారు. ఇలా డా॥ నాగసూరి వేణుగోపాల్ గారు మీ గురించి చెప్పారు, మీరు గాంధీ మీద చాలా పరిశోధన చేశారట, మా "మిసిమి"కి ఒక వ్యాసం రాసివ్వండి అని. నిజానికి నా తాత్విక ప్రయాణం అనేక ఒడుదుడుకులతో కూడు కుంది. తొలుత విపరీతమైన భక్తి, ఆ తరువాత విపరీతమైన నాస్తికత్వం, ఒకపరి అభ్యుదయం వైపు అడుగులు. మరోవైపు సాంప్రదాయపు సౌందర్యం గురించిన స్పందనలు. మార్క్స్, గాంధీ లోహియాలు. గాంధీపై ఈ మధ్య పెరిగిన శ్రద్ధ ఒక పునరాగమనమే! "ఇప్పటి దాకా చాలానే రాసేశారు గాంధీ పై. ఎవరికీ పెద్దగా తెలియని విషయం వుంటే రాయండి!'' అని అంతిమాదేశం. గాంధీ ఒక సముద్రం.

పరిచయపు మొదటి, రెండు నెలలోనే అశ్వినీకుమార్ గారు ఆయన రాసిన ఓ నాలుగు పుస్తకాలు ఇచ్చారు. నేను ఏ పుస్తకాన్నీ పూర్తిగా చదవలేను. చాలా పుస్తకాల విషయంలో మొదటి పేజీలలో వచ్చిన ఏదో ప్రస్తావనలోనే ఆగిపోతాను. ఇక పుస్తకం బల్ల మీద వుంటుందే కానీ, నేను మాత్రం ఆతొలి ప్రతిపాదనలలో నన్ను కట్టివేసిన అంశంలో మునగ లేక, తేలలేక, ఈదుతూనే వుంటాను. అలా నేను – "ఆలోలము లాలోచన లేవేవో నా లోపల ప్రాలేయచ్ఛాయల వలె తారాడగ, కోరాడగ" శ్రీశ్రీ గారి సదసత్సంశయంలో ఉండి పోయిన పుస్తకం – "రజ్జు సర్ప భ్రాంతి"

''రజ్జు సర్ప భ్రాంతి'' రాజారావు గారు ఇంగ్లీషులో రచించిన – "ది సర్పెంట్ అండ్ ది రోప్" కు అశ్వినీ వారి తెలుగు సేత. ఇది రాజారావు గారి రెండో నవల. ఆది శంకరులు తన అద్వైతాన్ని వివరించడానికి తీసుకున్న ఒక ఉపమానం. ఈ నవల ఆత్మ కథాత్మకం. మూడు నెలలో తర్జుమా చేయడం అయిపోయింది అన్నారు అశ్వినీకుమార్ గారు. నాకు మూడేండ్లు అయినా చదవడం పూర్తి కాలేదు ఈ తెలుగు అనువాదాన్ని. మూడేండ్ల క్రిందట 43వ పేజీలో ఆగిపోయాను. కథా నాయకుడి నాన్నకు ఎపోప్లెక్సీ వచ్చిందని టెలిగ్రామ్. నిజానికి ఈయనకు – వీరి నాన్నకు నిరంతర ఘర్షణే వున్నట్టుగా కథ మొదటి నుండే పాఠకునికి అర్థం అవుతూనే వుంటుంది. "నాన్న అంటే నాకు ప్రేమ లేక పోయినా దు:ఖం గొంతులోకి వచ్చింది. ఈ భూమ్మీద నా అస్తిత్వ మూలాలు ఒక్కొక్కటే చెరిగి పోతున్నాయి'' అనుకుంటాడు. ''మళ్ళీ నేను అనాథనైపోతాను". అని కూడా అనుకుంటాడు.

అనువాదం అత్యంత కష్టమైన సాహిత్య ప్రక్రియ. అనువాదకుడు తనని తాను ప్రక్కన పెట్టి, లేదా వెనక్కి నెట్టి, మూల రచయిత మూలాలు స్పృశించి, పాఠకులకు దాని సౌందర్యం, శిల్పం, గమనం, రూపం చెడిపోకుండా అందించాలి. ఒకటి రెండు సార్లు ఈ మధ్య నాకూ కొన్ని ఆలోచనలను అనువదించ వలసిన పని పడ్డది. రెండు పేజీల తెలుగు రచనను ఇంగ్లీషులోకి అనువదించడానికి మూడు రోజు పట్టింది. కానీ "గంగిశెట్టి స్మారక ఉత్తమఅనువాదక పురస్కార స్వీకర్త" అయిన వీరు "అనువాదం–అనుభవాలు" అనే చిన్ని పొత్తంలో ఇలా అంటారు – "అయితే ఇది నాకు చాలా సరదాగా – ఫుట్‌బాల్ గ్రౌండులో రెండు వైపులా గోల్స్ చేసినట్లుండేది"

అప్పటికి ఇంకా ఈ రజ్జు సర్ప భ్రాంతి అనువాదం చెసినట్టు లేదు. అందుకే చివర్లో ఇచ్చిన పట్టికలో ఇది లేదు. సిద్ధార్థ (హెర్మన్ హెస్ నవలకు అనువాదం) ప్రస్తావనవుంది. సిద్ధార్థను మాత్రం నేను చాలా వేగంగా చదవగలిగాను. అశ్వినీకుమార్ గారు కూడా ఈ ఇంగ్లీషు పుస్తకం చేతికి వచ్చిన వెంటనే చదివి "ఆ రాత్రి గంతులు వేశాను. కళ్ళు తెరచి నిద్రపోయాను. నాలో సిద్ధార్థ నిద్రలేచాడు." అన్నారు. అనువాద సమస్యల గురించి ప్రస్తావిస్తూ నెవిట్ ఎర్గిన్ అనే పాశ్చాత్య అనువాదకుడు చెప్పిన మాటలు ప్రస్తావించారు. – "ఏ అనువాదకుడికైనా ఉండ వలసిన లక్షణాలు ముఖ్యంగా రెండు. మూల రచనను తాను ప్రేమించి ఆనందించగలగాలి. అట్లా ప్రేమించి, ఆనందించగలిగిన రచనను తాను సొంతం చేసుకుని, తన ఆనందాన్నీ ఆ మూల భాషతో పరిచయం లేని వారితో పంచుకోవాలనే సద్బుద్ధి, సహృదయం కలిగి వుండాలి. పదాన్ని ఆశ్రయించుకొని కాక భావాన్ని ఆలంబన చేసుకొని ఉన్నదే నిజమైన అనువాదం. పద్యంలోని ప్రతి పదార్థం కొరకు నిఘంటువు వెతికితే సరిపోతుంది. భావార్థం కోసం మూల రచయిత హృదయం గాలించాలి."

అశ్వినీకుమార్ గారి అనువాదాల పట్టిక దాదాపు స్వతంత్ర రచలన పట్టికతో సమానంగావుంది. సిద్ధార్థ (హెర్మన్ హెస్ నవల), అగాధం (ఆస్కార్ వైల్డ్ ది (పొఫొండీ), ఓ ఖైదీవీరగాథ (ఆస్కార వైల్డ్ బాలాడ్), ఛార్లీ ఛాప్లిన్ (ఆత్మకథ), ఏరియల్ (షెల్లీ రొమాన్స్), అడొనాయిస్ (షెల్లీ ఎలిజీ), బైరన్ (జీవిత కథ), కీట్స్ (జీవిత కథ), రజ్జు సర్ప భ్రాంతి (ది సర్పంట్ అండ్ ది రోప్, రాజారావు నవల)

ఆయన స్వతంత్ర రచనలలో అవూహ (కథానికల సంపుటి), దూర తీరాలు (యాత్రా చరిత్ర), అంతర్వీక్షణం (వ్యాసాలు), పారిజాతం (కథానికలు), నాలో నేను (కవిత్వం), అనంతరంగం (కవిత్వం), దీవి (నవల).... ఇలా ఎన్నో వున్నట్టు అర్థం అవుతోంది. "అనంతరంగం" లో ఒక తొలి ప్రశ్న – "జీవితం మొదలవుతోందా – చివరకు చేరిందా" అన్నది. అయితే అసలు నిజం – "ఇవేవీ నావి కావు, వెలుగు, ఉల్కలు, అలలూ, చీకటి... అన్నీ పరాయివే..." "ఇక్కడ తీరంలో ఏ వాస్తవమూ నిలవదు."

"ఏ దేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వ కారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం. నరజాతి చరిత్ర సమస్తం పరస్పరాహణోద్యోగం, నరజాతి చరిత్ర సమస్తం రణరక్త ప్రవాహసిక్తం'' అంటాడు శ్రీశ్రీ ''దేశ చరిత్రలు"లో. నిజానికి ఒక యువకుడిగా ఈ కవిత చదివి నేను ఊగిపోయినా, అనుభవాలు, జీవితం ముందుకు సాగాక ఈ శ్రీశ్రీ కవితని అంతగా ఆనందించ లేక పోయాను. మానవ చరిత్ర అంతంఘోరంగానూ, దుర్మార్గంగాను మాత్రమే వుంటే నేడు భూమిపై మనుషులు మిగిలి వుండే వారు కాదు. భూమి నిర్జీవ గోళంలా విశ్వంలో భ్రమిస్తూ వుండేది. అనేక విప్లవ సాహితీకారులలో భరించలేని "నిహిలిజం" "నిరాశవాదం" చారిత్రక వాస్తవాలను కప్పి వేస్తాయి. ప్రపంచ చరిత్రకు ప్రధాన చోదక శక్తి ప్రేమ, సహజీవనం! అశ్వినీకుమార్ కూడా – చరిత్రలో "తెగలు తెగలుగా తెగిన మానవ గణాలు... తెరలు తెరలుగా చిరిగిన చరిత్ర పుటలు" అన్నప్పుడు నేను ఎందుకో కొంచెం ఆగిపోయాను.

కానీ వెంటనే "సీతాకోకచిలుకల రెక్కల చప్పుడు" విన్నాడని తెలియగానే ఆనందించాను. "నీ జ్ఞాపకాల గ్రావిటితో నన్ను క్రిందికి లాగబోకు... సత్యాన్వేషణ లో ప్రస్థానం చేయబోతున్నా..." అన్నప్పుడు గతపు అసత్యపు గాలుల ప్రభావం నుండి తనను తాను తప్పించుకోడానికి కవిలో జరిగే ఘర్షణ కనబడు

తుంది. అంతిమంగా "నువ్వూ నేను అద్వైతమని" తెలుసుకోడం, "ఎక్కడో చుక్కల లోకంలో బయలు దేరి, ఇక్కడ మొక్కల మట్టిలో కలిసి పోతున్నా..." మనే వాస్తవం ఎంతో ఆనందాన్నే ఇస్తుంది.

ఆస్కార్ వైల్డ్ (1854-1900) ఐర్లాండకు చెందిన ఒక రచయిత. విక్టోరియన్ ఇంగ్లాండ్ అనేది యూరోప్ చరిత్రలో ఒక స్వర్ణయుగం. ఆయన రాసిన "ది ఫిక్చర్ ఆఫ్ డోరెయిన్ గ్రే" నవలా సాహిత్యంలో ఓ ఆణిముత్యం. అయితే స్వలింగ సంపర్కం పై భయంకరమైన ఆగ్రహం ఉన్న సమయం అది. ఆ ఆరోపణలపై శిక్ష అనుభవిస్తూ జైలులో ఉన్నప్పుడు రాసిన నిరాశ, నిస్పృహలతో కూడిన అంతరాళపు నివేదన - "దె ప్రొఫండీస్". అశ్వినీకుమార్ దీన్ని "అగాధం" అనే పేరుతో అనువదించారు. ఇది ఒక కన్ఫెషనల్ స్టేట్‌మెంట్ లాంటిది. ఇలాంటివి అనువదించాలి అంటే మనలోను ఏదో తెలియని బాధ, నిర్వేదం ఆవహించాలి. "జైలు జీవితం ఎవరికైనా బయట వ్యక్తుల్ని, వ్యవహారాలని నిజాయితీగా పరిశీలించ డానికి అవకాశం కల్పిస్తుంది.'' ఒక రకంగా ఆలోచిస్తే ఈ భావన ప్లాటో రచన "అల్లెగోరి ఆఫ్ ది కేవ్" కు విలోమం. "మనం నిర్మించుకున్న ఈ సమాజంలో నాకు స్థానం లేదు. అది స్థానం కల్పించ లేదు కూడా. కానీ ఈ ప్రకృతిలో నాకు సాంత్వన దొరుకుతుంది..."

కానీ ఆధునికత అభివృద్ధి పేరుతో ప్రకృతి విధ్వంసం అవుతూంటే 19 వ శతాబ్దపు భావకవులు విహ్వలంగా చలించి పోయారు. అపారమైన వేదన కు గురి అయ్యారు. తిరుగుబాటు చేశారు. నిజానికి ఆ తరువాత ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఇతర సాహిత్య రూపాలు - అభ్యుదయం, విప్లవం, అధి వాస్తికత, ఎక్జిస్టెన్షియలిజం... లాంటి వాటి అన్నింటి కంటే అత్యంత తీవ్ర స్పందన ఈ భావకవిత్వ కాలపు కవులూ, రచయితలది. ఆనాటి యూరోప్‌లో వచ్చిన "రొమాంటిసిజం" అనే సాహిత్య ధోరణికి, మన తెలుగులో వాడిన భావ వాదానికి విషయ పరంగా కానీ, తీవ్రత పరంగా కానీ పోలిక లేదు.

ఆంద్రీ మార్వా అనే ఫ్రెంచి రచయిత షెల్లీ పై రాసిన గ్రంథం - "ఏరియల్ - ఏ షెల్లీ రొమాన్స్." ఈ పుస్తకాన్ని అశ్వినీకుమార్ "ఏరియల్" అనే అదే పేరుతో తెలుగులో అనువాదం చేశారు. "ఎటువంటి కవి??" ఈ పెర్సీ బేష్ షెల్లీ? "గహనాంతర సీమల్లో విహరిస్తూ గ్రహాలను తన సున్నితమైన చేతులతో బంతులాడిన వాడు - స్వర్గ ద్వారాలను తరచూ తట్టిన వాడు, ధ్వంసమైన స్వర్గంలో దారి తప్పిన దేవత వాడు." అందమంటే ఆరాధన, ప్రకృతి పట్ల ప్రేమ కలవాడు... దయ, కరుణ, వేదనామయ హృదయంతో విశ్వాంతరాళం రంగస్థలిగా కవితా ఝరి వెలువరించిన వాడు అంటాడు - అశ్వినీకుమార్. "నల్లని వాడు, పద్మనయనంబువాడు, కృపారసంబు పై జల్లెడు వాడు..." లా అనిపిస్తోంది కదా?

కానీ "షెల్లీని నాటి సమాజం నిరసించింది. దేశం నుండి వెలివేసింది. చివరికి కాందిశీకునిగా ఇటలీ పర్వత సానువుల్లో సముద్ర తీరాల వెంట పయనించి ఆ కవి, స్వాప్నికుడు, సాహసి, మూడు పదులు నిండకనే మున్నీట పాలయ్యాడు." అన్న వాస్తవం కూడా చెప్పారు.

"అతని సమకాలీనుడు - బైరన్." అంటూ "బైరన్" అనువాదం మొదలవుతుంది. అదే ఆంద్రీ మార్వా రచించిన బైరన్ జీవన చిత్రం. "మనం అంతగా పట్టించుకోని విషయాలే మన జీవితాలలో గొప్ప సంఘటనకు దారితీస్తాయి. మన మాటలలో పనుల్లో ఎంతగా లీనమైపోతామంటే ఎంతో సున్నితమైన చిక్కుల్లోపడి చివరికి, ఒక దారి, బైటపడడానికి ఒకే ఒక ద్వారం తెరచి వుంటుంది. ఇక తప్పని సరిగా మన సిద్ధాంతాల కోసం మన జీవితాలను ఫణంగా పెట్టాల్సి వస్తుంది."

"గొప్ప వాళ్ళంతా ఇలాంటి దారిలోనే నడవ వలసి వచ్చింది. ఆత్మ బలిదానానికి శారీరకంగా సిద్ధపడటమే శూరత్వం అంటే."

*"గులక రాళ్ళకు కూడా బోధిస్తాను -*
*నేల మీద నిరంకుశులకు వ్యతిరేకంగా*
*నిలబడమని!"* అంటాడు బైరన్.

బైరన్‌ను అపార్థం చేసుకోవటం తేలికే - అతన్ని అర్థం చేసుకోడానికి హృదయానికి హృదయం కావాలి అంటారు అశ్విన్.

అశ్విన్ గారి రచనలు ఇంకా చాలావున్నాయి. పారిజాతం (కథల మాలిక), నా కథ - చార్లీ చాప్లిన్ (అనువాదం). అయితే నేను అన్నీ చదవలేదు. నిజానికి నన్నూ కాలం వెనకనించి లాగుతోంది. 2005 నాటికి ప్రపంచం బాగా చిన్నగా అయ్యింది. "క్లాష్ ఆఫ్ సివిలిజేషన్స్" అండ్ ది రి - మేకింగ్ ఆఫ్ వర్ల్డ్ ఆర్డరు" అనే పుస్తకంలో సామ్యుయేల్ హంటింగ్‌టన్ అనే అమెరికా రాజకీయ శాస్త్ర నిపుణుడు, సంస్కృతీ, సాంస్కృతిక ప్రతీకలు, ప్రపంచపు కలయిక, విడతీత, ఘర్షణలను నిర్వచిస్తున్నాయి అంటాడు. నిజానికి ప్రపంచీకరణ రెండవ దశ షుమారు 20వ శతాబ్దపు చివరి రోజులలో ప్రారంభం అయ్యింది. అప్పటి దాకా ప్రపంచీకరణ అగ్రరాజ్యాల అవసరం అనుకుంటే ఇప్పుడు అది రెండవ ప్రపంచపు అవసరం, అవకాశంగా మారింది. గ్లోబలైజేషన్ అనే పదం గ్లోకలైజేషన్‌గా రూపాంతరం చెందుతోంది. దాన్ని నడిపించే, నిర్ధారించే శక్తులూ మారాయి. ఈ నేపథ్యంలో అనేక అంశాలను ప్రస్తావిస్తూ విస్తృత నూతన సాహిత్యం వచ్చింది. అదే సమయంలో "ది ఎండ్ ఆఫ్ హిస్టరీ అండ్ ది లాస్ట్ మ్యాన్" అనే ఫ్రాన్సిస్ ఫుకుయామా రచన కూడా వచ్చింది. ఈ నూతన ప్రపంచం గురించి ధనాత్మకంగా, వ్యతిరేకంగా ఎందరో ఆలోచించారు. రాశారు.

అశ్వినీకుమార్ "అంతర్వీక్షణం" ఆ సమయం



*తమసోమా జ్యోతిర్గమయ...*

లోదే. "సంస్కృతుల సంఘర్షణ" అనే వ్యాసంలో ''ఒక విశ్వమానవ సంస్కృతి'' ఆవిష్కారం జరుగుతున్నదా? అనే ప్రశ్నతో ప్రారంభం అయ్యి, పాశ్చాత్యులు ప్రపంచంలో పరిఢవిల్లుతూన్న అనేక సంస్కృతుల, సమాజాల విషయలలో జోక్యం చేసుకోవటం ప్రపంచ శాంతికి, సుస్థిరతకు ఎంతో ప్రమాదం అని గ్రహించాలి అన్న హెచ్చరిక తో ముగుస్తుంది. మళ్ళీ "క్రొంగ్రొత్త నాగరకత - సమాజ నిర్మాణం!" లోనూ అదే చర్చ. అయితే ఇందులో ముఖ్య గమనిక ''వేగం''. ప్రతి సంఘటనా త్వరత్వరగా జరిగి పోతోంది అన్న గుర్తింపు. మరో అంశం - ఇంతకు పూర్వం, సంస్కృతీ పరంగా తమ అస్థిత్వాన్ని కాపాడుకోవాలనుకున్న సమాజాలు - ఇప్పుడు ఏకీకరణకే మొగ్గు చూపుతున్నయి అంటారు. అన్ని వ్యాసలలో చాలా గాఢమైన చర్చలూ, విశ్లేషణలు, తార్కికలు, సందేహాలు, సూచనలూ. అశ్వినీకుమార్ రచనలలో ఈ వేగం ఉక్కిరి బిక్కిరి చేస్తది. నేను ఏదైన రచనను, పుస్తకాన్ని చాలా నింపాదిగా, రిఫ్లెక్టివ్‌గా, ఇంటెన్స్‌గా (తీవ్రంగా అనవచ్చా?) చదువుతాను. ప్రతీ పేజీకి, ప్రతి కొత్త ఆలోచనకు ఆగిపోతాను. ఒకే పేజీలో ఒక అయిదారు సంచలనాలు వుంటే - ఇక ముందుకు కదలలేను.

అశ్వినులు పురాణ పురుషులు. వీరి సోదరి ఉష. ఆమె వీరిని ప్రతిరోజూ బ్రహ్మ ముహూర్తంలో మేల్కొల్పుతుంది. ఇక వారు తమ రథాన్ని అధిరోహించి, తమ సోదరిని రథంలో ముందు కూర్చోబెట్టుకొని తూర్పు దిక్కు నుండి పడమటి దిక్కుకు అత్యంత వేగంగా ప్రయాణిస్తారని పురాణ కథ. ఆ రథం పేరు "హిరణ్య వర్తం". అది వాయు వేగ మనో వేగాలతో ప్రయాణిస్తుంది. ఆ రథానికి మూడు గుర్రాలు వుంటాయి. అధ్వరాశ్వాలు అనే ఆ గుర్రాలు తెల్లగా, నున్నగా ఎల్లప్పుడూ

యవ్వనోత్సాహంతో వుంటాయి. చిత్రమైన ఈ రథానికి చక్రాలు మూడే. ఆ రథంలో ఒక వైపు ధనం, మరొక వైపు తేనే, సోమరసం. వీరికి వైద్యము కూడా బాగా తెలుసు.

ఋగ్వేదంలో వీరిని స్తోత్రం చేస్తూ అగస్త్యుడు అంటూన్నాడు.

''అశ్వినులారా! శుభగమనముగల మీ అశ్వములు మిమ్ముకోరిన స్థలమునకు చేర్చినపుడు మీ బంగారు రథపు ఇరుసు అభీష్ట ప్రదాత అగును. కావున ఉష: కాలము నందే సోమపానము చేయుచు యజ్ఞనమునకు విచ్చేయుడు.

అశ్వినులారా! మీ అనుగ్రహమున మేము అంధకారమును దాటగలము''

అశ్వినీకుమార్ రచనా ప్రపంచం విస్తృత మైనది. అందులో ఆయన స్పృశించే, సృజించే విషయం కూడా విస్తారమైనది. ఇందులో నేను విహంగ వీక్షణం చేశాను. ఇదే నేను చేయగలిగింది. ఒక విశ్వ మానవుణ్ణి ఒక ప్రాంతీయ మానవుడు పరిచయం చేయగలడా? ఒక నిరంతర చలన శీలిని, అసలు కదలికలు ఇష్టపడని ఒక స్థిర నివాసి ఎలా అర్థం చేసుకోగలడు. కొండ అద్దమందు కొంచెమై ఉండదా? అంటే వాస్తవంలో కొండ కొండే! అద్దం అద్దమే! రస్సెల్ ఒక చోట అంటాడు ఒక గొప్పవ్యక్తి గురించి ఒక సాధారణ వ్యక్తి రచన ద్వారా తెలుసు కోవద్దని మీరే చదవండి, తెలుసుకోండి. అశ్వినీకుమార్ రచనల ఆ వేగంలో వీగిపోయినా, ఆగిపోయినా బాధ్యత మీదే సుమా!

❋

*రచయిత సెల్: 9441015709*

---

## షెల్లీ ప్రేమ విషాదం

పి.బి. షెల్లీ స్వప్న విషాదం 'ఏరియల్' పుస్తకం చదివి అతిసామాన్య పాఠకురాలినైన నేను ఏదో ఒక అనిర్వచనీయ అనుభూతికి లోనైనాను.




'ఏరియల్' పుస్తకమంతా ఒక ఎత్తైతే, ఎ.కె. గారి 'ఎటువంటి కవి' కవిత ఒక ఎత్తనిపించింది. ఏమైనా ఈ పుస్తకాన్ని మిసిమి పాతికేండ్ల సందర్భంగా బేతవోలు రామబ్రహ్మం గారు పరిచయం చేయగా మిసిమి ద్వారా తెప్పించుకొని చదివాను. ఇంత మంచి పుస్తకం చదవడానికి కారణభూతులైన బేతవోలు రామబ్రహ్మం గారికి, రచయితకి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభినందనలు.

**– యస్. కృష్ణవేణి,** విజయనగరం



*మానవ జీవిత అనుభవాలను తెలియజెప్పటం, తెలుసుకోవటం, ఆ అనుభవాల వెలుగు నీడలలో తమ జీవితాలను పరామర్శించుకుని జీవిత పరమార్థమేమిటని సమీక్షించుకోవట మనేది కథా రచన, పఠనాలకున్న ప్రధాన ప్రయోజనం అనుకుంటే ఈ 'పారిజాతం' సంపుటిలోని కథలు ఆ ప్రయోజనాన్ని నెరవేర్చాయి అని చెబుతున్నారు* **– ఓల్గా**

# భావుకత, తాత్త్వికతా, భాషా పాటవం కలగలిసిన పారిజాతం

వల్లభనేని అశ్వినీకుమార్ గారి పారిజాతం కథల సంపుటం 28 విభిన్నమైన కథల సమాహారం. ఈ కథలు మన గ్రామీణ వాతావరణంలోని సహజత్వాన్ని, క్రూరత్వాన్నీ, ప్రపంచంలోని అనేక దేశాల నగరాలలోని పరాయీకరణనూ, ఆ పరాయీకరణ చెందే క్రమంలో మనిషి అనుభవించే హింసను, మానసికంగా అనుభవించే ఒత్తిడిని, కర్కశంగా మారే ప్రకృతిని, చివరి పరిణామాన్నీ బహు చక్కని భాషలో మనకు పరిచయం చేస్తాయి.

"మన జీవితాలను ఆశలు ఆవేశ పెడతాయి
ఆశయాలు ఆలోచింపజేస్తాయి.
ఆదర్శాలు దారి చూపుతాయి
మన విశ్వాసాలు తరతరాల సంస్కృతీ వాసనలతో అలరారుతుంటాయి.
మన జీవనం వర్తమాన పరిస్థితుల ప్రభావంతో
పరుగులిడు తుంటుంది.
ఈ సంస్కృతుల వైవిధ్యంలో – జీవితాల సంగమంలో ఎవరి అనుభవాలు వారివి – ఎవరి గమ్యం వారిది!"

"మాలి" అనే కథలో రచయిత రాసిన ముగింపు వాక్యాలు ఈ కథా సంపుటి సారాంశాన్నంతా ఒడిసి పట్టుకుని మనకు తేటతెల్లం చేస్తాయి.

కథలు ఎందుకు రాస్తారు? లేదా చెబుతారు? పాఠకులు ఎందుకు చదువుతారు? ఎందుకు వింటారు?

మానవ జీవిత అనుభవాలను తెలియజెప్పటం, తెలుసుకోవటం, ఆ అనుభవాల వెలుగు నీడలలో తమ జీవితాలను పరామర్శించుకుని జీవిత పరమార్థమేమిటని సమీక్షించుకోవట మనేది కథా రచన, పఠనాలకున్న ప్రధాన ప్రయోజనం అనుకుంటే ఈ 'పారిజాతం' సంపుటిలోని కథలు ఆ ప్రయోజనాన్ని నెరవేర్చాయి. ఈ సంపుటిలో ప్రతి కథా ఒక వైవిధ్య భరితమైన అనుభవం. హాంకాంగ్ నగరంలో భర్త కోసం ఎదురుచూసే ప్రోషిత భర్తృక (అమాహ) నుండీ, దొమ్మేరులో భూస్వామ్య అహంకారంలో నలిగి మరణించిన ఒక భార్య వరకూ, ఈ కథలు అనేక గాథలను మనకు పరిచయం చేస్తాయి. ప్రపంచ దేశాలన్నిటిలో మానవ విషాదం రూపాలలో, నేపథ్యాలలో ఉండే తేడా తప్ప ఒకటేనని చెబుతాయి.

'పారిజాతం' కథలో సౌందర్యం, సున్నితత్త్వం, అవి మొద్దుబారే క్రమం, దానిని భరించలేని వ్యక్తి తిరుగుబాటు ఇది కథాంశమైంది. ఆ వ్యక్తి స్త్రీ. మనోభావాల వ్యక్తీకరణకు చోటు లేదు. అది ఆమె స్వభావమూ కాదు. ఆమె జీవితానికి సాక్షి ఎడోలసెంట్ కౌమారం నుంచి యౌవనంలోకి ప్రవేశించే ఒక కుర్రవాడు. ఎవరూ మాట్లాడరు పెద్దగా. వ్యవసాయపు పనులు, మారే ఋతువులు, వచ్చే పండగలు, జీవితంలో మార్పు వస్తుందనే ఆశలు, నిరాశలతో నిష్క్రమణ. ఎక్కడికనేది అనవసరం. చెప్పే కథ కంటే చెప్పని కథ ఎక్కువ ఉండేలా చూసుకోవటం వల్లభనేని అశ్వినీకుమార్ గారి కథలలోని శైలీ స్వభావం. ఆ కథలోని క్లుప్తత, గాఢత, గ్రామీణ జీవితంలోని సౌందర్యాన్నీ,

కర్కశత్వాన్నీ – మొదటిదాన్ని సవివరంగా రెండవదాన్ని మౌనంగా చూపించిన తీరు చాలా ప్రత్యేకం. సౌందర్యం వద్దన్నా కనపడుతుంది. కరుడు గట్టిన మొరటుతనం దాగి ఉంటుంది దానిని చూసి అర్థం చేసుకోటానికి సున్నితత్వం ఒకటే చాలదు. చైతన్యం కావాలి. ఆ చైతన్యం గ్రామాలలోకి ఇంకా రాని, రానివ్వని రోజుల కథ పారిజాతం. ఐనా కథలో ఒక తిరుగుబాటు బావుటా ఎగిరింది. కర్కశత్వం మీద నిరసనో ఆగ్రహమో ప్రదర్శించింది. ఫలితాల గురించి, పరిణామాల గురించి రచయిత మాట్లాడడు. మాట్లాడాల్సిన అవసరమూ లేదు. అవి ఒక రకంగా ఉండవు. ఆ "చిన్నత్త" ఎక్కిన పడవ, ఏ తీరమైనా చేరవచ్చు. ఏ తీరమూ రాకముందే సుడిగుండాలలో పడిపోవచ్చు. ఒక సున్నితమైన స్త్రీ జీవితం కర్కశంగా నలపబడటాన్ని చిత్రించిన కథలు తెలుగు సాహిత్యంలో అనేకం ఉన్నాయి వాటిలో "పారిజాతం" చాలా ప్రత్యేకంగా నిలబడగల సత్తా ఉన్న కథ.

శాన్‌ఫ్రాన్సిస్కో, అట్లాంటాలు ప్రపంచంలో పెద్ద నగరాలు. కోలాహల పూరిత జీవితం. విభిన్న నాగరికతల సమ్మేళన జీవనాలు. కానీ అక్కడ కూడా గడ్డ కట్టిన జీవితాన్ని, హత్యలకు ప్రేరేపించే జీవిత విధానాన్నీ రచయిత చూపుకు కనిపించాయి. నగరాలకు దగ్గరయ్యే కొద్దీ పరాయీకరణ, ఏదో తెలియని సంకెళ్ళకు బందీలై స్వేచ్ఛనూ, జీవితాన్నీ కోల్పోతున్న భారతీయ వలస జీవితాలు! – పైకి అంతా వెలుతురే – లోపల చీకటి కమ్ముకుంటుంది (నరసయ్య మామ చుట్టూపనివాళ్లతో ఊడల దిగిన మర్రి చెట్టులా వున్నాడు!) తెలియకుండానే. ఏదో ఒక హఠాత్ సంఘటనతో, విపత్కర పరిణామంతో ఆ చీకటి వెలుగులోకి వచ్చినపుడు ప్రతిభావంతుడైన రచయిత దానిని గుర్తించ గలుగుతాడు. అలా గుర్తించిన రచయిత వల్లభనేని అశ్వినీకుమార్.

'పులివేట' ఈ సంకలనంలో విభిన్నమైన కథ. మిగిలిన కథల కంటే వేరుగా కనిపించే కథ. మిగిలిన కథలలో భావుకత, భాష చాలా వరకు ఒక మంచు తెరలా కప్పుకుని అవతలి విషయం విషాదమైనా అస్పష్ట రామణీయకతతో చూపిస్తుంది. ఈ కథలో మంచుతెరలేదు. మైక్రోస్కోపు కూడా లేదు. దృశ్యం వాస్తవంగా కనిపిస్తుంది. పులివేట సంకేతనామం అని తెలిసిపోతుంది. పులివేట సరదాకు కాకుండా సీరియస్‌గా, తన జీవిత లక్ష్యంగా చేసుకున్న వారికి మరణం తప్పదు. మరణం ఎవరికైనా తప్పదు. కానీ మనం దేనికోసం వెంటబడుతున్నామో, దేని వెంట బడుతున్నామో అదే మృత్యుహేతు వవుతుంది. పులి డబ్బుకి సంకేత నామమైనపుడు జరిగేదేమిగో అందరికీ తెలిసిన విషయమే. అయినా దానిని ఇరాన్, ఇరాక్, గల్ఫ్ దేశాల నేపథ్యంలోని ఒక భారతీయ డాక్టర్ పరంగా చెప్పటంతో వేట, పులి అన్నీ మరింత బీభత్సం. వేట ఎలా మొదలై, ఎలా అలవాటై ఎలా జీవిత లక్ష్యం అవుతుందో చాలా బాగా చెప్పిన కథ.

'ప్రిన్స్' కథ అంతరించిన రాజరికాలు, అంతరించని రాజసాలకు సంబంధించిన కథ. సత్యజిత్ రే 'జల్సాఘర్' ను గుర్తుకు తెచ్చే కథ. ఒక చారిత్రక విషాదం. వర్తమాన వాస్తవాన్నీ, మారిన సమాజాన్నీ గుర్తించకుండా గతంలో కూరుకుపోయిన జీవితాలు ఇపుడు చూస్తే విషాదంగా కనపడతాయి. కానీ వారు విషాదంలో పడటం అనివార్య మని గమనించలేని రాజరిక భూస్వామ్య భావజాలం చాలా భయంకరం! ఆ భవనాలు, ఆ ఫ్లోరింగ్‌లు అన్నీ ప్రజలను దోచుకుంటే వచ్చాయని గమనించలేని ఒక మానసిక సోమరి ప్రపంచంలో గౌరవం, పరువు, ప్రతిష్టలనే భ్రమా ప్రపంచంలో బతికేవారి విషాదాలు – విషాదాలే – కానీ మనం విడిగా వాటిని చూడగలగాలి. చూడగలిగిన అశ్వినీకుమార్ ''ఇజ్జత్ ఇనపగేట్లనే" మాటతో అదంతా పాఠకులకు అర్థం చేయించే ప్రయత్నం చేశారు. ఈ సంకలనంలో ఇదొక ప్రత్యేకమైన కథ భావుకత కంటే వాస్తవికతకు ఎక్కువ చోటిచ్చిన కథ.

ఈ సంకలనంలో చిన్న, చిన్న కథలు – అంటే నిడివిలో చిన్న కథలు దాదాపు పది ఉన్నాయి. అవి నిడివిలో చిన్నవే గానీ విషయంలో పెద్దవే. ఒక కథలో పెళ్ళికి సిద్ధమైన అమ్మాయి ప్రశ్నతో కథ ముగుస్తుంది. "నాకు మరో ఛాయిస్ ఉందా?" ఛాయిస్ అనేది ఎంత ముఖ్యమైనదో, ఎంత పెద్ద విషయమో ఆలోచించుకోమంటుంది ఆ ప్రశ్న క్రమంగా మరో ఛాయిస్ లేని ప్రపంచంలోకి మనందరం తరమబడుతున్నాం. "మరో ఛాయిస్ ఉందా?" అనే ప్రశ్న వద్ద ఆపుతారు అశ్వనీ కుమార్ గారు. అది ఆయన రచనా తత్త్వమూ, జీవన తత్త్వమూ కూడా కావచ్చు. ఎందుకంటే అనేక కథలు ఈ ప్రశ్న అడగకపోయినప్పటికీ, ఈ ప్రశ్నకు లోబడే ఉంటాయి. పాత్రలు తమకున్న ఒక్క ఛాయిస్‌లో కొట్టుమిట్టాడుతాయి. మరో ఛాయిస్ కోసం అన్వేషించటం, పోరాడటం, మరో ఛాయిస్‌తో జీవించటం అనే పనికి పూనుకోవు. అలా పూనుకోకపోవటం ద్వారా విషాదమైన తమ జీవితాన్ని స్పష్టాస్పష్టంగా చూపించి పాఠకులను ఛాయిస్ తీసుకోమంటాయి.

అశ్వినీకుమార్ కథలలో తాత్త్వికత, భావుకత కలగలిసి ఉన్నాయి. ఈ తాత్త్వికత ప్రధానంగా మరణం తప్పని మనిషి గురించి, ఏదో ఒక నిరీక్షణ తప్పని జీవితాల గురించి అవటం వలన కథలన్నిటికి ఒక గాఢత వచ్చింది. అందుకు అశ్వినీకుమార్ భాష ఎంతో చక్కగా అమిరింది.

*రచయిత సెల్: 98490 38926*




# 'పారిజాతం' స్పందనలు

ఈ 'పారిజాతం' సంపుటిలో వున్న కథలు –, పంజరం, గోడ, సంకెళ్ళు, చెరువు, పులివేట, భవాని, మంచుపెట్టె, ప్రిన్స్, రాణి విరోబా మొదలగు కథలు అన్నీ రచయిత పట్టుదలతో, సహనంతో, పవిత్రత అనే జీవిత సత్యాల ఆధారంగా రచించా రన్నది సుస్పష్టం. మరో సుగుణం, ప్రతికథ పాఠకుని మనస్సులో స్థానంపొంది పదే పదే ఆలోచనలకు గురిచేస్తుంది. నేను హిందీ కథాసంకలనాలు దాదావు పాతిక చూచాను. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ప్రతి సంకలనంలోనూ ఒకే కథ చోటుచేసుకోవడం. 'ఉస్ నే కహా థా' – దీని రచియిత చంద్రధర్ శర్మ గులేరి. ఆయన వ్రాసిన కథలన్నీ ఒక డజనుకు మించిలేవు. ఇపుడు తెలుగులో వివిధ రచయితల కథాసంకలనాలు వస్తున్నాయి. వీటిలో ఈ సంపుటి లోవి ఏదో ఒక కథ ప్రతి సంపుటిలో సంకలిం చబడిననాడే రచయిత ఆశయం – నలుగురికీ విజ్ఞానం పంచిపెట్టాలి – సాధ్యమవుతుంది. **– కోడూరు పుల్లారెడ్డి**


కోడూరు పుల్లారెడ్డి

### పారిజాత పరిమళాలు

మీ పారిజాతం భద్రంగా చేరింది. నిత్యం నేను చదవటానికి విషయపరంగా నాలుగు పుస్తకాలు పెట్టుకుంటాను. న్యాయంగా మీ పుస్తకం అయిదవది కావాలి. కానీ పుస్తకం తిరగవేసి చూడగానే పారిజాత పరిమళ ప్రభావమో, అశ్వనీ భావ సంచలన మహిమో కానీ మీ పుస్తకమే పైన కూర్చున్నది. అందులో మెస్మరిజం ఉన్నట్లుంది. అసలింతకీ ఈ పుస్తకం నాకెందుకు పంపినట్లు... అంతటి ఘన కార్యం నేనేమీ చేసినట్లు లేదే... నా పై ఇంత ప్రేమను చూపిన తమ సౌజన్యానికి ధన్యవాదాలు.

**– డా. ఎమ్. పురుషోత్తమాచార్య**

# తన్యతని పెంచే అశ్వినీకుమార్ కథలు

కథ చెప్పేవాడు నింపాదిగానే ఉంటాడు, నిబ్బరంగానే ఉంటాడు, నిమ్మళంగానే రాస్తాడు. ఎటొచ్చీ కథ వినేవాడికి, చదివేవాడికే తపన. తీరని తనివి, కథన కుతూహలం, ఇతరుల కథలు వినాలి, కనాలి అనే తనివి. ఒక వాయొరిజం. కథ చెప్పటం, వ్రాయటం ఒక సాహితీ ప్రక్రియగా ప్రపంచ సాహిత్యాలన్నిటా ఆది నుండి ఉన్నదే. కథాకారుడి స్వప్నం – వ్యక్తిగతంగా మొదలయ్యి పాఠకుల, సామాజికుల దగ్గరికొచ్చేటప్పటికి అదొక కలెక్టివ్ మిత్ అయి కూర్చుంటుంది. ఇక అప్పుడు కథలో నిజమెంత, అబద్ధమెంత అనే ప్రశ్న రాదు. బయటికి కనిపించే నిజాలలోనూ ఆంతరిక రహస్యాలెన్నో ఇమిడి, నిబిడి ఉంటాయి. రోషమాన్ సినిమాలోలాగా. విషయం ఒకటేగాని, వాస్తవానికి అనేక పార్శ్వాలు చూపిస్తాడు కథకుడు. ద్వైత, అద్వైత విశిష్టాద్వైత భావ, అభావ, విభావాల్ని చూపిస్తాడు రచయిత. ప్రాథమికంగా ప్రపంచంలో ఉన్న కథలన్నీ పదమూడు రకాల్లోనే ఉన్నాయన్నాడు. ఎ.కె. రామానుజం. మనం ఎంతగా కథా సరిత్సాగరమను కొన్నానూ. ఈ పదమూడు గాజుముక్కల్ని కెలైడోస్కోప్‌లో తిప్పితిప్పి చూపిస్తాడు కథకుడు. 'చటులాలంకారపు మటుమాయల నటనలలో,' 'చిత్ర విచిత్ర శమంత రోచిర్ణివహం' చూపిస్తాడు. ఓల్డ్ టెస్ట్‌మెంట్‌లోని రూత్ కథని నమ్మలేకపోయామా ఈనాటి ఫెమినిస్ట్ సాహిత్యాన్నీ నమ్మలేం. జాతక కథల్లో విశ్వాసం నశించిందా ఇక బౌద్ధం ఎక్కడిది? సరే ఇతివృత్తం చిన్నదే అయినా దానికి ఒక సమగ్రత ఉండాలి. మంచి కథలో పాత్ర చిత్రణలో మనకు అదివరకు అనుభూతంకాని మానసిక కారణమేదో ఉండాలి. మంచి కథలో ముగింపులోని ఇంపు ఎలా ఉండాలంటే– 'అవున్లే, అలానూ అవొచ్చు. ఇలానూ అనొచ్చు' అనిపించాలి.

అశ్వినీకుమార్ కథా సంకలనంలో నాకు బాగా నచ్చిన, పట్టిచ్చిన ఒక గుణం – యాంబియన్స్. మనమే మరచిపోయిన ఒక జ్ఞాపకపు తాలూకు యాంబియన్స్. ఒక స్మృతి కిరణం. 'అమాహ' అంటే ప్రోషిత భర్తృక అని ఆ కథ చదివినప్పుడు తెలిసొస్తుంది. పాఠకులలోని ప్రోషిత భర్తృకత్వాన్ని రచయిత వచ్చి రక్షించి తీసుకెళ్తాడు తన కథ సీమాసమయాలలోకి మళ్ళా. కథల్లో అమాహ, మాలి, లేమి, పంజరం, సంకెళ్ళు, రెప్పచాటు



వేగుంట మోహన్ ప్రసాద్

లోకంలో, పులివేట అనే కథలు పరదేశీ కథలు. వీటిని చదువుతుంటే కొంచెం భయంగా ఉంటుంది, విచిత్రంగానూ ఉంటుంది. క్రిస్టల్ గ్లాసులో ఐస్‌క్యూబ్ కరుగుతూన్నలాంటి శబ్దపు భయం వేస్తుంది. ఆ సున్నితమైన ఇతివృత్తాన్ని కథకుడు సుతారంగా కలిపి ఇస్తుంటాడు. కాని గ్లాసుని మనం సరిగ్గా పట్టుకోలేక పోతేనో అనే సందేహం సంకోచ దేహాంతరాల్లో కొంచెం వొణుకొస్తుంది. దేశీయమైన కథలు గోడ, పారిజాతంలలోనూ అదే బాధ. నిఘంటువులలో లేని అంతరార్థాలు, మానసిక సమయం, జ్ఞాపకాల నిరంతర ప్రవాహం, ఆగామి చింతనం, పాత్రల జీవన స్రవంతి, ప్రాదేశిక సాన్నిహిత్యం, ఏకాంత జీవన చిత్రాలు, స్త్రీ పురుషుల పరస్పరాకర్షణలోని లైంగిక అంతరంగాలు –

ఇవన్నీ అశ్వినీకుమార్ మాటలే, తన కథాకథన కుతూహలం గురించే. సత్యాన్ని తెలుసుకొనే మనం దొంగచూపులు చూస్తాం! తాళపు చిల్లుల్లోంచి పొంచి చూస్తూవుంటాం. సత్యశోధనతోనే! చూస్తున్న మనల్ని మరొకరు చూడకుండా ఉండేట్లు జాగ్రత్త పడతాం. సత్యదృశ్య ప్రీతితోనే. కథలోని నెరేటర్ మనకంటే జాదూకదా! 'ఆమె దుఃఖాన్ని ఆపలేకపోయాను సరికదా, ఆమె చేరువలోని వెచ్చదనం, ఇంకా స్నానం చెయ్యని ఆమె శరీరపు ఆరిపోయిన చెమట, ప్రొద్దున్నే స్ప్రే చేసిన చానల్ పర్ఫ్యూమ్, రెండూ కలిసిన ఒక వింత వాసన నాకు యాఫ్రొడిజియాక్‌లా పనిచేయడం మొదలుపెట్టింది. మృదువుగా వెచ్చగా తగిలే ఆమె వక్షం, నన్ను మరీ రెచ్చగొట్టింది. అలా ఎంతోసేపు ఆమె ఏడ్చింది. ఆమెను నేను పొదివిపట్టుకొన్నానా – ఆమె కరిగిపోయిందా అనేది ఇక్కడ అంత ముఖ్యమైన విషయం కాదు...' (పంజరం). ఇదీ కథాకారుడి జాదూతనమంటే. ఎప్పుడో ఏదో ఒక కళాత్మక సినిమాలో ఒక దృశ్యం గుర్తుకొస్తుంది. ఒకడు నిలబడి ఒక విచిత్రమైన దృశ్యాన్ని అప్పుడే చూడటం మొదలుపెట్టాడో లేదో వాడికి ఆ దృశ్యానికి మధ్య ఓ పేద్ద పొడవాటి వంద బోగీల గూడ్సు రైలు అడ్డం వస్తుంది. వెళ్తూ వెళ్తూ అది వెళ్ళిపోయిన తరువాత ఆ దృశ్యం అదృశ్యమైపోయింది!

అలా! గోడ కథలో కూడా అదే సున్నితత్వం. సమతుల్యాన్ని కోల్పోతే అటుపడినా ఇటుపడినా రెండూ ఒకటే. రెండూ పతనాలే. ఎంత చైనా గోడకైనా అంచు ప్రమాదమే. సంకెళ్ళులో అహం పగిలితేగాని ఆనందమయ స్థితిని పొందలేమని, స్త్రీలోని జడత్వం కరగాలంటే అహం పగిలిపోవాలని, సాహిత్య సృజనలో నైతిక – అనైతికల మధ్యనున్న సూక్ష్మరేఖలు పగిలిపోవాలని మానసిక శాస్త్ర విశ్లేషణలోని ఒకానొక అంతర్గత సంవేదన ఆవిష్కృతమయింది. సాహిత్య సృజనలో నైతికత – అనైతికతల మధ్యనున్న సూక్ష్మరేఖను చెరిపేసి గొప్ప మేలే చేసారిదివరకే చలం, పాలగుమ్మి పద్మరాజు, బుచ్చిబాబు, త్రిపుర, చండీదాస్‌లు. చెరువు, పారిజాతం కథల్లో కాఫ్‌లహొా, ఆడాలసెంట్ ప్రపంచపు విద్యుద్ఘాతాలు కనిపిస్తాయ్. అశ్వినీకుమార్ కథలు ఫాసినే టింగ్‌గా ఉంటూనే ఫాంటసీ నుంచి లీలగా తప్పుకుంటాయ్. ప్రపంచాన్ని ప్రయాణాల మనిషిగా తరచితరచి చూచిన అశ్వినీకుమార్ మన గ్రామీణ నైసర్గికతను కూడా కళ్ళకు కట్టించ గలడని పారిజాతం కథ నిరూపిస్తుంది. ఈ ట్రావెలర్ విజ్ఞాని, విషయజ్ఞుడు, వినయశీలియైన ఈ గైడ్ అశ్వినీకుమార్‌తో బాటు మనం చేసే ప్రయాణాలు అవి దేశీయమైనవైనా వైదేశికాలవైనా హృదయోల్లాస వ్యాఖ్యల్లానే ఉంటాయి అంతర్దృష్టిని పెంచుతూ (తన్యత అంటే టెన్షన్ అన్నమాట).

***

## 'నాలో నేను'లోని అన్యత

ఉద్యమాలకీ ఉద్వేగాలకీ ఊగిపోయే ఉన్మాదాలకీ దూరంగా ఉందామని ఊహించుకుంటూనే దేశదేశాలు పరిభ్రమిస్తూనే వీలయినంతగా బాహిరమైన భ్రమల్ని తొలగించుకొనే ప్రయత్నంలోనూ ఇంకా ఎంతో కొంత అంతరిక సంఘర్షణ సంవేదన సంతాపం ఉంటూనే ఉంటుందనుకోవడానికి ఈ చిన్న కవితా సంకలనం ఓ చిరుదాహరణ. తొలి తెలివిడితనం; మనుషులు మనస్సులు విడిపోకూడదనే అంతర్యపు అశంసతో అలలు అలలుగా వీచిన చిరు కవితలివి.

కరుణాకారణ సృజనలోని అనుకంపతడిని తడవటమే కవి కార్యం. 'వెళ్లిపో... / ఎక్కడో.. ఓ మబ్బు తునకలో చినుకులా / ఎక్కడో – ఓ లేత ఆకు కొనలో బిందువులా... / ఏదో కొలనులో,



ప్రయాణాల మనిషిగా...

చిరుగాలికి కదిలే అలలా / ఎక్కడైనా, వెన్నెలతో కురిసే తడిమంచులా / మారిపో, నీలోంచి నీకు / నీలోకి నువ్వు.' అన్న కవే అదే కవిత ప్రారంభంలో 'ఈ శరీరం ఓ రొచ్చు / ఈ హృదయం ఓ ఉచ్చు' అనడం భావసౌందర్యాన్ని, భావహృదయాన్ని ఛిద్రం చేసినా – అందులో సత్యం ఉంది. వచన కవిత్వంలో అంత్య ప్రాసలుండాలా! కాబోలుననుకున్న అమాయకత్వం ఇది. 'సుఖాల అసత్యపు ఆనందహేల' అంటే 'హేల' అనే పదాన్ని అపసవ్యంగా వాడినట్లు లేదూ? 'రత్యనంతర నిర్వాణ రేతస్సుగంధాల బంధాలు', 'రత్యనంతర నిర్వేదపు నిట్టూర్పుల', 'అధోగహనాంతర మాయామోహం', 'అర్థంకాని ఆర్థిక నిత్యావసర హత్యలు'... ఇలాంటి పదబంధాలన్నీ మానవత్వాన్ని మానవీయతను తుంచేవా? పెంచేవా? దుఃఖపు ఛాయాచిత్రాల్ని ఇలా చూపిస్తున్నాడు కవి. విషాద నిషాలో దేవదా, సంసారసేవలో పారూ, ఎవ్వరికీ కాని అమ్మీ, ప్రియురాలి శుభలేఖ, మర్నాయుహా ముఖేష్, మెలాంకలి మెలోడి నూర్జహాన్, శ్వాసకి కంపించే బుడ్డిదీపం. 'డాలర్ ప్లీజ్', ఎయిడ్స్ ఎముకల ఆశ, నల్లగా అరుస్తోన్న సముద్రం, ప్రాణవాయురహిత అంధకారం, వెలవెల విలపిస్తోన్న వెన్నెల, మీరు ఇళ్ళకి పొండి, కాస్త ఎంగిలి పడండి – లాంటి కరుణభర పదబంధాలున్నా చివరికి కలిగిన ఆత్మ సమస్థితి ఏమిటంటే– 'నువ్వు ప్రపంచం కాదు / నువ్వు కాలం కాదు / ప్రపంచంలో నువ్వు / కాలంలో నువ్వు... బ్రతుకొక పోరాటం / విప్లవాన్ని ఆలోచన అనకు' అని అంచేతనే ఈ కవితా సంకలనం శీర్షిక సమంజసమే...

***– వేగుంట మోహన్ ప్రసాద్***

# వల్లభనేని బైరన్

ఇది బైరన్ కథ. వల్లభనేని వారి బైరన్ కథనం మిమ్మల్ని కట్టి పడేస్తుంది. బైరన్ జీవితం మిమ్మల్ని ఆశ్చర్యపరుస్తుంది. అతని మరణం, విషాదం మీకు కన్నీరు నింపుతుంది. వెరసి ఇది గొప్ప అనుభూతి మిగులుస్తుంది. ఆంద్రీ మార్వా రచించిన బైరన్ అన్న బృహత్ గ్రంథాన్ని ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి అశ్వినీకుమార్ తెలుగులో రాసారు. నెవిట్ ఎర్గిన్ అన్న అనువాదకుడు "ఏ అనువాదకునికైనా ఉండవలసిన లక్షణాలు ముఖ్యంగా రెండు. మూల రచనను తాను ప్రేమించి ఆనందించగలగాలి. అలా ప్రేమించి ఆనందించగలిగిన రచనను తాను సొంతం చేసుకొని తన ఆనందాన్ని ఆ మూల భాషతో పరిచయం లేని వారితో పంచుకోవాలనే సహృదయం కలిగి ఉండాలి. పదాన్ని ఆశ్రయించుకుని కాక భావాన్ని ఆలంబన చేసుకుని ఉన్నదే నిజమైన అనువాదం. పద్యంలోని ప్రతిపదార్థం కొరకు నిఘంటువు వెతికితే సరిపోతుంది. భావార్థం కోసం మూల రచయిత గుండెను గాలించాలి" అని అంటాడు నెవిట్. ఇవన్నీ అశ్వినీకుమార్ అనువదించిన బైరన్‌కు అతికినట్లు సరిపోతాయి.

బైరన్ జీవితం ప్రేమలు, ప్రయాణాలు, కవిత్వం, ఆయన పోరాటాలు–రాజ్యం మీద, మతం మీద, సాంఘికా దురాచారాలమీద ఆయన తిరుగుబాటు ఈ వల్లభనేని బైరన్‌లో అక్షరం అక్షరంలో మనకు దర్శింపచేస్తాయి. బైరన్ ఎప్పుడూ అశాంతితో సాహస జీవితం కోసం, ప్రేమకోసం, ప్రేమించేవారి కోసం దేనికీ వెనుకాడడు. ఆయన జీవితం ఎంతటి అగ్నిపర్వతమో ఆయన కవిత్వం అంత నిగూఢము, గాఢమైనది.

గ్రీసు దేశానికి స్వతంత్ర్యం కోసం తన ధన, ప్రాణాలు ధారపోస్తాడు. చివరికి "ఇంకా ప్రౌఢ వయస్సే రాలేదు. అంతులేని కీర్తి వచ్చింది. మానవుడన్న వాడికి సంతోషం ఎన్నివిధాలుగా ఉంటుందో దాని అంతు చూసాను. ఎంతో ప్రయాణం చేసాను. నా అన్వేషణ, తపన చల్లార్చుకున్నాను. ఇక భ్రమలేవీ లేవు అనుకుంటాడు బైరన్. ఇన్నాళ్లు పొగలు, సెగలు కక్కిన అగ్నిపర్వతం చల్లారింది. ఏప్రిల్ 19 సాయంసంధ్య బైరన్ కనులు అరమోడ్పుగా వాలిపోతాయి. ఆ మిసిలోంగి దీవిలోనే వారు అనుకుంటారు మహా పురుషులు అస్తమిస్తే ప్రకృతి శక్తులు నిద్రలేస్తాయి అని.

చనిపోయిన బైరన్‌ని చూసి అశ్వినీకుమార్ ఎలా రాసాడో చూడండి.

- అప్పుడే నెరుస్తున్న ఉంగరాల జుత్తు, మరగకాసిన పాలలాంటి అతని మోముచాయను మరింతగా మెరిపిస్తున్నవి...
- ఆ గది గవాక్షం నుంచి వీస్తున్న తుఫాను గాలులు ఆ ఉంగరాల ముంగురులను చిందరవందర చేస్తూ అతను ఇంకా ప్రాణంతో ఉన్నాడనే భ్రమ కలిగిస్తున్నాయి...
- ఎందరో సుందరీమణులను అతని పాదాక్రాంతం చేసిన అతని పొడవాటి కనురెప్పలు నీలిబూడిద కళ్ళను అరమోడ్పుగా కప్పి ఉంచాయి. ఇంకా ఈ ప్రపంచపు దుర్మార్గాన్ని చూడాలేమోనని అనుమానంతో...
- ప్రేమికుల, సున్నితమైన ఎన్నోఎన్నో అరచేతులు నిమిరిన అతని బుగ్గలు కందిపోయినట్లున్నాయి..
- విల్లులాంటి అతని పైమోవి సంధించిన మన్మథబాణాలు ఒక్కటీ వృథాపోలేదని ఒక కొంటె అరనవ్వులా పెదవి చివరలు వంపు తిరిగి వున్నాయి – ప్రపంచాన్ని ఎగతాళి చేస్తూ....
- మగువుల మోవి తేనెల త్రాగిన మత్తులో – మధువును పెదవి చివరే వుంచిన – ఎర్రని మెరుపుఉ మెరుస్తూనే ఉంది...
- 'ప్రపంచానికి ప్రియమైనదేదో వదిలి వెళ్తున్నా' నన్న తృప్తి వదనంలోని ప్రశాంతత కనపడుతోంది....
- పుట్టుక నుంచీ అతనిని వెన్నాడుతూ చిన్నబుచ్చిన అవిటికాలు వక్రంగా వెక్కిరిస్తోంది!
- తన ఆలోచనలను, అంతస్సంఘర్షణలను – అనుభూతుల సుఖదుఃఖాలను, స్వేచ్ఛాప్రయత్నాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన అసాధారణ కవితా ధారను రాసిరాసి అలసిపోయి అతని పొడవాటి కుడిచేతి అంగులీయాలు – విశ్రాంత హృదయంమీద సేదతీరుతున్నాయి.
- "కాలానికి కష్టానికి తట్టుకుని – నా శ్వాస ఆడుతూనే వుంటుంద"ని అతని బలమైన నమ్మకం – మరణాన్ని వమ్ము చేసినట్లు అక్కడి వాతావరణం వెలుగుతోంది...

పురాణ పురుషుని మరణం ప్రకృతి శక్తుల్ని ప్రకోపిస్తుందని మిస్సిలోంగి వాసులు నమ్ముతారు. ఈ మెరుపులు, ఉరుములు, పిడుగులకు కారణం బైరన్ చనిపోయాడని...

జీవితాంతం సెగలు, పొగలు, లావా విరజిమ్మిన ఒక అగ్నిపర్వతం చల్లబడింది. ఒక తుఫాను గడ్డకట్టింది. అల్లకల్లోల సముద్రం స్తంభించింది.

**డా. దిలావర్,** పాల్వంచ

### చార్లీ చాప్లిన్...

Hero's Story...

... Chaplin presented before the spectators heroism in humour with an inherent blend of pathos, and endeared himself to people of the world... This voluminous memoir contains 31 chapters. He narrates trials turmmoil and triumphs with poise.

*-The Hindu*

చార్లీ చాప్లిన్ ఆత్మకథ తెలుగులో... చాప్లిన్ బాల్యం, నాటకాలు, సినిమాలు ఆయన ట్రాంప్ పాత్ర, ఆయనను ముసురుకున్న వివాదాలు, సంపాదించిన పేరు ప్రఖ్యాతులు, ఆయన ప్రవాస జీవితం అన్నిటినీ కళ్ళకు కట్టారు తెలుగులో రచయిత.

*-తెలుగు వెలుగు*

జీవితంలో సాధనాసాధ్యాలకూ, కలిమిలేము లకూ, కీర్తికీ, పతనానికీ అన్నిటికీ ఆఖరి మజలీ చార్లీచాప్లిన్ జీవితం. ఇంగ్లీషు నవల చదివినంత సుగమంగా, సుఖవంతంగా చదివిస్తుంది తెలుగు అనువాదం...

*-సాక్షి*

షెల్లీ అశ్వినీకుమార్‌ని ఆవహించాడు. తన కథను తెలుగులో చెప్పేవరకూ ఆయన్ని కుదురుగా కూర్చోనివ్వలేదు. చదివిన తరువాత అశ్వినీకుమార్ ఓ భావోద్రేకానికి లోనయి, ఆ ఉద్విగ్నత, ఉద్వేగం తాదాత్మ్యత తెలుగులో ప్రతిఫలింప చేసాడు. తరువాత బైరన్‌ని కూడా తెలుగులోకి దింపాడు. అలాగే కీట్స్‌ని కూడా అందించాడు. ఇంగ్లీషు రొమాంటిక్ కవిత్రయం జీవిత చరిత్రలు తెలుగు వారికి కానుకగా ఇచ్చిన ధన్యజీవి అశ్వినీకుమార్.



***-ముక్తవరం పార్థసారథి***



కాంద్రేగుల నాగేశ్వర రావు

అందమైన పదాలను తగు రీతిలో పొదిగి అద్భుత వాక్య నిర్మాణం చేయటం అశ్విని ప్రత్యేకత. తిక్కన మహాభారత అనువాదంలా ఈ సిద్ధార్థ అనుశీలన మూలానికి కొత్త అందాలను తీర్చిదిద్దింది.




**అగాధంలోని కొన్ని ఆణిముత్యాలు**

సామాన్యునికి ఒక సాహిత్య కారునికి ఒకే వ్యవస్థలోని చట్టాలు విధించే శిక్షలో వ్యత్యాసం ఉండక పోవచ్చు. కానీ ఒక మేధావి రచయిత లోనయ్యే సంఘర్షణ లోంచి ఎంతటి సాహిత్యమైనా వెలువడుతుంది. ఆ దు:ఖ సముద్రపు అగాధంలోని చీకట్లు చించుకొని వెలువడే వెలుగు రేఖలు కేవలం రచయితే చూడగలడు. మనిషి అంతరంగం ప్రతి ఒక్కరిలోను ఉందన్నాడు. అతి చిన్న విత్తనంలోను, గుప్పెడు మట్టిలోను, సముద్రంలోని ముత్యంలోను ఉందన్నాడు. ఈ అంతరంగం అన్ని బాహిర కోర్కెలను వదిలించుకుంటే – అవి నాగరికత ద్వారా అంటకట్టుకున్నవే. అన్ని భౌతిక స్వాధీనతల నుండి బైటపడాలని ఆశించాడు. మనిషిలో అరుదైన విషయం తనను తాను తెలుసుకోవటమే అన్నాడు. మనమీద ఎవరైనా ప్రేమ చూపారంటే దానికి మనకు అర్హతలేదనే అనుకోవాలి. ఎవ్వరికీ ప్రేమించబడే అర్హత లేదు అంటాడు. ప్రేమ ఒక దివ్య ప్రసాదం. జ్ఞానానుపానం. దానిని మోకాళ్లపై ఒంగి స్వీకరించాలి. మనసు నింపుకోవాలి.

జీవితం మారుతూ ఉండాలి. ఝరిలాగా ప్రవహిస్తూ ఉండాలి. చైతన్యంతో వెలుగిపోతూ ఉండాలి. ఒక మూసలో బిగిసిపోవడం మరణించడం లాంటిదే. వస్తు ప్రపంచం మీద అనురక్తి పెంచుకోకూడదు. సాధారణ జీవితం మీద మోజు పనికి రాదు. అనిర్దుష్టమైన గమనంలో గొప్ప సాహసం ఉంటుంది. సామాన్య వ్యవహారాలపై ఎక్కువ సమయం వెచ్చించరాదు. ఇవి అగాధంలోని కొన్ని మంచి ముత్యాలు.

***

### ఓ ఖైదీ వీరగాథ

ప్రపంచంలో ప్రతి వాడు తాను ప్రేమించిన దాన్నే నాశనం చేస్తాడు. కొంతమంది కోపంగా చూస్తూ / కొంత మంది మంచి మాటల్తో // పిరికివాడు, ముద్దు పెడుతూ చంపుతాడు / ధైర్యవంతుడు కత్తితో పొడిచి చంపుతాడు.




ఒకడు తన ప్రేయసిని యౌవనంలో / ఇంకొకడు కాస్త వయసు మళ్లిన తర్వాత – / మరొకడు తను లాలించిన చేతుల్తో చంపుతాడు – / ఇంకొకడు ఆభరణాలిచ్చిన అరచేతుల్తో... / దయగలవాడు కత్తితో చంపుతాడు,

చావు చల్లగా వుంటుంది.



డా. రూప్‌కుమార్ డబ్బీకార్

## బైరన్ స్వీయ అన్వేషణను ఆవిష్కరించిన అశ్వినీకుమార్

***"ఒక కన్నీటి బిందువు ఆరిపోవటం కంటే కీర్తి, గౌరవం పేరుతో ఉప్పొంగే సముద్రాలు ఎండిపోవడం మేలు కదా?..."***

పై రెండు బైరన్ కవితా వాక్యాలు చదివితే అతనికి జీవితం పట్ల వున్న దృక్పథం ఏమిటో తెలుస్తుంది. ప్రపంచానికి ఎలాంటి సందేశం ఇవ్వదలిచాడో తెలిసి పోతుంది. నైతిక జీవనానికి, మత విశ్వాసంతో పనిలేదని నమ్మిన పి. బి.షెల్లీని సమాజం నిరసించింది. దేశం వెలి వేసింది. అతని సమకాలీకుడు బైరన్ మత విశ్వాసాలను నమ్మినా, భౌతిక సుఖాల వేటలో నైతిక సూత్రాలను కూడా సంకెళ్ళు గానే భావించి స్వేచ్ఛాజీవిగా బతకటానికి సాహసిస్తే సమాజం వెక్కిరించింది. ఇద్దరూ కాందిశీకులుగా జీవితాన్ని చవి చూశారు. ఈ ప్రకృతిలో ఏదీ అసహజం కాదంటూ స్వలింగ సంబంధాల సుఖాన్వేషణకు లోనై, జీవితంలోని దుఃఖసంద్రపు అగాధాల్లోని చీకట్లు చీల్చుకొని వెలువడే వెలుగు రేఖల కాంతిని చూడగల ఆస్కార్ వైల్డ్‌ను సమాజం శిక్షకు గురి చేసింది. జీవితాన్ని ఏ విధంగా అవగాహనలోకి తీసుకోవాలి? అసలు ఎలా జీవించాలి? నైతికతకు కొలమానాలు ఏమిటి? మన ఇష్టానుసారంగా, స్వేచ్ఛగా, భౌతిక సుఖాలతో జీవించినా ఓర్వలేని సమాజం, జీవితాన్ని ఏ సూత్రాలతో కొలవాలి – నైతికతా? మత విశ్వాసమా? దేవుడిపై నమ్మకమా? – వీటికి సమాధానంగా విశ్లేషించుకోవాలంటే ఒక పి.బి. షెల్లీ, ఒక బైరన్, ఒక ఆస్కార్ వైల్డ్ ల జీవితాలను చదవాల్సిందే? వీరి రచనలు చదివి, వీరి జీవితాలను, జీవితం పట్ల వున్న దృష్టి కోణాన్ని చక్కగా తనలోకి ఇంకింపచేసుకున్న ప్రముఖ రచయిత, మిసిమి పత్రిక సంపాదకులు వల్లభనేని అశ్వినీ కుమార్, ఆంద్రీ మార్వా రచన 'బైరన్' గ్రంథాన్ని తెలుగులోకి అనువదించి తెలుగు పాఠకులకు అందించారు. అనువదించిన తీరు, శైలి, భాష, నడక అన్నీ కలిసి ఒక అద్భుతమైన అనుభవాన్ని అందజేస్తాయి. వచనంతో బాటు కవిత్వాన్ని అనువాదం చేస్తూ వల్లభనేని గారు బైరన్

లోకి పరకాయ ప్రవేశం చేసారు. బైరన్ జీవితాన్ని, జీవన యానాన్ని చదువుతుంటే మనం కూడా ఎక్కడెక్కడో ప్రయాణం చేస్తున్న అనుభూతి.

బైరన్ అందాన్ని ప్రేమించేవాడు. అలా అతని దారిలో అందమైన మేరీ డఫ్ వచ్చింది. ముందు ప్రేమించిన మార్గరెట్ పార్కర్ అలా మంచు తెరలా కరిగిపోయింది. తరువాత మేరీ చావర్తుతో పరిచయం అవుతుంది. ఈమె న్యూ స్టెడ్ బైరన్ ల సోదరికి చెందిన ఆన్ స్లే భవనంలో ఉంటుంది. యువ బైరన్ కు మరదలు వరుస. ఆమె అందానికి ఆకర్షితుడై ప్రేమలో పడతాడు. కానీ మేరీ చావర్తు ఇది వరకే జాక్ మస్టర్స్ అనే యువకుడి ప్రేమలో ఉంటుంది. ఒకానొక సందర్భంలో అనుకోకుండా బైరన్ ను ఉద్దేశించి, "ఆ అవిటి కుర్రవానితో నాకేం పని" అని మేరీ తన సేవకురాలితో చెప్పడం వింటాడు బైరన్. చావర్తు నిరాకరణతో న్యూ స్టెడ్ వదిలి వెళ్తాడు. మేరీ కంటే న్యూ స్టెడ్‌ను వదిలి వెళ్ళటమే బైరన్‌కు బాధ కలిగించింది. అక్కడి నుండి 'సౌత్ వెల్' అనే ఊర్లో తల్లి దగ్గరికి వస్తాడు. అక్కడ ఎలిజబెత్ పిగోట్ అనే అమ్మాయితో పరిచయం అవుతుంది. బైరన్ తన మారుటి అక్క ఐన ఆగస్టాతో స్నేహం పెంచుకుంటాడు. తల్లితో విభేదాలు పెరుగుతాయి. ట్రినిటీ కాలేజీలో చేరాక హాస్టల్లో ఉంటూ సోషల్ లైఫ్ అంటూ విలాసవంతమైన జీవితానికి అలవాటు పడి విచ్చలవిడి ఖర్చులతో అప్పుల పాలవుతాడు. కవిత్వం రాయడం, చదవడం మీద శ్రద్ధ పెరుగుతుంది. తనలోని రచయితను ఎవరూ గుర్తించడం లేదని వాపోతాడు. జీవితంలోని భౌతిక స్తబ్ధత అతని లోని కవికి ఊతం ఇస్తుంది, యువతుల స్నేహంలోని మానసికోల్లాసం స్ఫూర్తినిస్తుంది. అవి తనలోని కవికి పదును పెట్టే కారకాలయ్యాయి. కొన్ని కవితలు రాసాడు, అనువాదాలు చేసాడు. Fugitive pieces శీర్షికతో చిన్న పుస్తకం వేసి మిత్రులకు పంచాడు. కొందరు నిరాశపరచగా దానిని తగలబెట్టాడు. కానీ, ఆ రచనలన్నీ తిరగ రాసి Poems on Various Occassions పేరుతొ అచ్చు వేయగా అది విమర్శకు గురై పెద్ద దుమారం రేపింది. ఆ తరువాత Hours of Idleness అనే పుస్తకం వేసాడు. ఇవన్నీ తన 19వ ఏట జరిగిన ప్రయత్నాలు. ఈ పుస్తకం అతన్ని కవిగా వెలుగులోకి తెచ్చిందని చెప్పవచ్చు. విమర్శకుల మన్ననలు పొందాడు. పాఠకులు ఆదరించారు. రచయితగా జార్జ్ గోర్డాన్ పేరు ప్రధానంగా వినిపించింది. లార్డ్ బైరన్ 'మైనర్' అని చిన్నగా పేరు పక్కన రాసుకున్నాడు. వ్యక్తి జీవనశైలి లోని కొన్ని రకాల ప్రవర్తనల మీద బైరన్‌కు స్థిరమైన అభిప్రాయాలున్నవి. కన్ఫ్యూసియస్ ను అంగీకరిస్తాడు. సోక్రటీస్ ను గౌరవిస్తాడు. కాథలిక్ మతాచారాన్ని విశ్వసిస్తాడు. ఈత కొట్టడం, కవిత్వం రాయడం అతనికిష్టమైన వ్యాపకాలు. ఈత అతని లావుపాటి శరీరాన్ని అందంగా తీర్చిదిద్దుతుంది. కవిత్వం అతని వ్యక్తిత్వాన్ని దర్శింపజేస్తుంది.

...




బైరన్ మూడో యాత్ర. మళ్ళీ ప్రయాణం. నీటి మీద ప్రయాణం. లెరిసి నుంచి జెనోవా వరకు. ఏప్రిల్ ఒకటవ తేదీ, 1823 జెనోవాలో బైరన్ ప్రముఖ రచయిత్రి లేడీ బ్లెస్సింగ్టన్‌తో కలుస్తాడు. ముప్పై ఆరేళ్ళ పిల్లవాడు వింతగా కనిపించాడు ఆమెకు. తానూహించిన అందం ఇప్పుడు అతనిలో లేదు. కానీ ఆకర్షణ వుంది. ఈ సమయంలోనే 'డాన్ వాన్' కావ్య రచన మార్మిక, ధార్మిక పదబంధాలతో గొప్పగా సాగుతుంది. రచనా వ్యాసాంగం నడుస్తోంది, రాజకీయాలు నడుస్తున్నాయి, గ్రీకు స్వాతంత్ర్య పోరాటాలు సాగుతున్నాయి, బంధుత్వాలు, స్నేహాలు కొనసాగుతున్నాయి. మిస్సిలొంగి పట్టణంలో కవిగా, సైనికుడుగా విజయం సాధిస్తాడు. జనవరి 22, 1824 పుట్టిన రోజు. 36 సంవత్సరాలు పూర్తి చేసుకొని 37లోకి అడుగు పెడ్తున్నాడు బైరన్. జ్వరం తిరిగి దాడి చేస్తుంది. ఈ సారి తీవ్రత ఎక్కువే. ఆడా, అనబెల్లా, అగస్టా గుర్తుకు వస్తారు. ఇంగ్లాడ్ గుర్తుకు వస్తుంది. ఏప్రిల్ 15, 17, 18 జ్వరం తీవ్రత పెరుగుతున్న రోజులు, బైరన్ తనకు చివరి రోజులు దగ్గర పడ్డాయన్న వింత వింత ఆలోచనల్లో పడతాడు. ఇంకా ప్రౌఢ వయస్సే రాలేదు. అంతులేని కీర్తి వచ్చింది, ఎంతో ప్రయాణం చేసాడు. అన్వేషణ, తపన తీర్చుకున్నాడు. ఇప్పుడు చావంటే భయం లేదు అనుకుంటాడు. ఫ్లెచర్‌తో అంటాడు – 'ఇంక నా పని పూర్తయిపోయింది. నా బిడ్డ ఆడాకు ఆశీర్వాదం అందచెయ్యి, ఆమెను చూడలేక పోయాను' లేడీ బైరన్, అగస్టాను గుర్తు చేస్తాడు. మాటలు తడబడతాయి. ఏప్రిల్ 19, సాయంత్రం కళ్ళు వాల్చేసి దీర్ఘ నిద్రలోకి వెళ్ళిపోతాడు.

***"వద్దు – వృద్ధాప్యం వరకూ బ్రతకాలా!***
***నాకు యౌవనం కావాలి –***
***అందులోనే తార్కిక పథం వుంటుంది***
***వయసు మళ్లితే అంతా సర్దుకోవటమే***
***వయసులో –***
***నన్ను ఇష్టపడిన వాళ్లను ఎంతగా ప్రేమించాను***
***ఇప్పుడు! 36 ఏళ్లకే – ఇది పెద్ద వయసా***
***ఆరిపోతున్న కోర్కెల నిప్పులు ఎగతోయాటానికి***
***మళ్ళీ హృదయంలో మంటను రగిలించలేను!'***

కవిత్వమే అతని చివరి శ్వాస అవుతుంది.

గ్రీకు ప్రజల పక్షాన బైరన్ గౌరవార్థం, గ్రీకు యువరాజు మావ్రో కార్డోటో ముప్పై ఏడు తుపాకులు పేల్చాలని ప్రకటన చేస్తాడు. గ్రీకు పవిత్ర భూమిలో అతని సమాధి నిర్మించాలనుకుంటారు అక్కడి వారు. కానీ ఫ్లెచర్, పారీ, బైరన్ సన్నిహితులు బైరన్ పార్థివ దేహాన్ని ఇంగ్లాండ్ తీసుకువెళ్ళాలనే ఆదేశాలుండటం వల్ల ఏప్రిల్, 22వ తేదీన బయలు దేరి, జులై ఒకటో తేదీన బైరన్ పార్థివ దేహంతో గ్రీకు నుండి ఇంగ్లాండ్ చేరుకుంటారు. అతని మరణవార్త గ్రీకు, ఫ్రాన్స్, ఇంగ్లాండ్‌ను కుదిపివేస్తుంది. సన్నిహితులు, మిత్రులు, అగస్టా, లేడీ బైరన్ అందరూ దుఃఖసాగరంలో మునిగి పోతారు. బైరన్ నాటింగ్ హాం లోని 'హాక్ నెల్ తోర్కార్డ్' చర్చిలో సమాధి చేయబడతాడు. 22 జనవరి 1788లో లండన్‌లో జన్మించిన జార్జ్ బైరన్, 19, ఏప్రిల్ 1824లో, 36 ఏళ్ల వయస్సులోనే చనిపోవడం విషాదకరం.

ఇదీ బైరన్ జీవితం, అతను చేసిన ప్రయాణం ఒక స్వీయ అన్వేషణ. ఆంద్రీ మార్వా (Andre Maurois) ఫ్రెంచ్‌లో రచించిన 600 పుటల బైరన్ ప్రస్థాన గ్రంథాన్ని హామిష్ (Hamish) ఇంగ్లీష్‌లో చేయగా, వల్లభనేని గారు తెలుగులో 500 పుటలకు కుదించి బైరన్ తో పాటు ప్రయాణించారు. తన భాష, శైలితో అశ్వినీ కుమార్ తెలుగు పాఠకుడిని కూడా బైరన్‌తో పాటు సహా ప్రయాణికుడిని చేసి ఒక కాందిశీకుడిగా వదిలేస్తాడు. ఈ నవల చదువుతున్నంత సేపు బైరన్ ఒక మిత్రుడిగా, ఒక కుటుంబ సభ్యుడిగా, ఒక సహాధ్యాయుడిగా, ఒక తోటి ప్రయాణికుడిగా అనుభవాన్ని మిగిలిస్తాడు. ఇది అనుసృజన లోని సృజనకారుడి ప్రతిభకు నిదర్శనం. వచనంతో బాటు కవిత్వాన్ని అనువదిస్తూ వాటి సహజత్వాన్ని (nativity), స్థానికతను, స్థల, కాల ప్రభావాల తీవ్రతను అందించడం అంత సులభతరం కాదు. అందుకు సృజనతో బాటు ఎంతో మేధోశ్రమ కూడా అవసరమౌతుంది. బైరన్ జీవితంలోని అనేక పొరలు – బాల్యం, చదువు, పేదరికం, తిరుగుబాటు, విశృంఖల నైతికత, బంధువులు, మిత్రులు, బలపడే బంధాలు, తెగిపోతున్న సంబంధాలు, మరు భూములు, శవపేటికలు, కపాలాలు, నౌకలు, అందగత్తెలు, సైనికులు ఇలా ఎందరో, ఎన్నెన్నో, అన్నింటిని పొరలు పొరలుగా విడదీసి మన ముందుంచారు. ఏ విధంగానైతే బైరన్ అవిటితనాన్ని అతని అందం, ఆకర్షణ, కవితాశక్తి మరుగున పడేసిందో అదే విధంగా అతని అవలక్షణాలను అతనిలోని ఔదార్యం, ఉదాత్తత, స్నేహగుణం కప్పిపుచ్చాయి. ఒక విచిత్రమైన, విలక్షణమైన, విశిష్టమైన వ్యక్తిని, వ్యక్తిత్వాన్ని, గొప్ప కవిని తన అనుసృజనతో పరిచయం చేసిన వల్లభనేని అశ్వినీ కుమార్ గారికి అభినందనలు. కుద్రముద్దీన్ జీ షాన్ చేతిలో రూపుదిద్దుకున్న పుస్తకం కవర్ పేజీ పై అల్బేనియన్ దుస్తుల్లో వున్న బైరన్ చిత్రం ఆకర్షణీయంగా వుంది.

**"కథానాయకులందరూ ఒంటరిగాళ్లే – తప్పుడు గుంపులను వ్యతిరేకిస్తూ.."** అని అంటాడు బైరన్. ఈ వ్యాఖ్యానం వర్తమానానికి కూడా వర్తిస్తుంది.

***రచయిత సెల్: 9177857389***